# చతుర

సంపుటి:4 ఏప్రిల్-1981 సంచిక:3

## ఈ నెల సమగ్ర నవల

"నాకు మేడలూ కావాలి...పూరిగుడిసెలూ ఉండాలి... షేక్స్పియరూ కావాలి...శవ సాహిత్యమూ కావాలి... శంకర భాష్యాలూ కావాలి.... సెక్స్ బూతులూ ఉండాలి...ఒకడుగు ముందుకు వేస్తున్నా రెండడుగులు వెనక్కి నడిచే జీవితం కావాలి—మార్పులేని, వెరైటీలేని జీవితం – అది ఎటువంటిదైనా భరించలేను. నా వూహకు సరిపడని జీవిత విధానాన్ని నేనంగీకరించలేను" అనుకునే రకం మనిషి అతను.

బలవంతంగా అతన్ని తమ ద్వీపానికి ఎత్తుకు వచ్చింటో యువతి.

అక్కడి ప్రజలు......పరిపాలన......ఆధునిక వైజ్ఞానిక పద్ధతులు అతన్నాశ్చర్యపరిచేయి... విభ్రాంతిలో ముంచేసాయి. అక్కడి మర మనుషుల్లాంటి వ్యక్తుల మధ్య ఊహాతీత చిత్ర విచిత్రాల నడుమ కొన్నాళ్ళు గడపాల్సి వచ్చింది. అయినా ఆ—

## స్వర్గనరకం

లో అతని కెవరూ అంతుపట్టలేదు.

అతను అక్కడి కెందుకు తీసుకురాబడ్డాడనేది కూడా ఆశ్చర్యకరమే. అసలక్కడ ప్రతీదీ ఆశ్చర్యకరమే. ఆ వింతలేమిటి ?

తిరిగి అక్కడి నుంచి అతను ప్రాణాలతో బయటపడగలిగాడా ?

అనుక్షణం ఆసక్తి రేపుతూ, ఉత్కంఠ కలిగించే

### సుజాత

నవల 'సొర్గతీవు'కు జీ. సె. జీవి అనువాదం

'స్వర్గ నరకం' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖ చిత్రం : జగ్ మోహన్

రెండవ కవరు : మోహన్ కుమార్ శర్మ

మూడవ కవరు : సూరజ్ ఎస్. శర్మ

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతర్రతాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500 004.

# తెలుగు సినీ పత్రికారంగంలో అగ్రగామి

# జ్యోతిచిత్ర

కన్నుల కింపైన వర్ణ
చిత్రాలతో

కవ్వించి నవ్వించే
సెట్సుపై కబుర్లతో

ముచ్చట గొలిపే
తారల ముచ్చట్లతో

ఇంటింటా
తారాతోరణంగా
వెలువడుతున్న
రంగుల హరివిల్లు





# గిరాకీ

“ఈయాల్లెగిస్త్రినోజు బాగులేదొరేయ్. బాకెట్టుకి, టీ సుక్కలకి కూడా గిరాకీ దొరకకుండుంది” — చార్మినార్ దమ్ము కొడుతూ సహచరుడితో అన్నాడు ఫోర్‌నాట్ టూ అనబడే గంగరాజు.

“అంతే. అంతే” మాట్లాడ్డానికి కూడా శక్తి లేనట్టు నాన్చేడు సింహాచలం.

సాయంత్రం ఆరయ్యింటుంది. చలి చలిగా వుంది వాతావరణం. బుర్ర మీద టోపీలు సర్దుకుని సహచరులిద్దరూ గోతికింద నక్కల్లా ఇరానీ రెస్టారెంట్లో కూచుని ‘కేసు’ల కోసం చూస్తున్నారు. ఎదురుగా బస్టాండు దగ్గర బస్సులు వస్తూ పోతున్నాయి.

అప్పుడు పడింది గంగరాజు దృష్టి బస్టాపులో వారగా నిలబడ్డ నీడలమీద.



పరకాయించి చూసేడు. ఇద్దరూ వయసులో వున్న అమ్మాయిలు. చూడ్డానికి చాలా చక్కగా వున్నారు. ఏ కంపెనీ సరుకో గుర్తుకు రాక నోరు చప్పరించేడోసారి. “గురూ! అటు చూడు” మోచేత్తో పొడిచేడు. గురుడు కూడా అటు చూసేడు.

సై అంటే సై అనుకున్నారు. లారీలు పుచ్చుకుని బయల్దేరేరు.

దగ్గరకొచ్చి నిలబడ్డారు.

“ఏం పాపా! మస్దేకంపెనీ” గంగ రాజడిగేడు.

ఇద్దరూ వాళ్ళను చూసి బిత్తర పోయారు.

ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. కొంచెం ఎడంగా జరిగేరు.

శీతాకాలం ఆరున్నరకే చీకటిపడ్డం వల్ల జనసంచారం అక్కడ తక్కువగానే వుంది.

“ఏం? మాట్లాడరేం?” — గద్దించేడు గంగరాజు.

ఇద్దరూ భయంతో ఒణికిపోయేరు. కానీ జవాబు చెప్పలేదు.

గంగరాజు మరింత దగ్గరికొచ్చేడు. ఓ క్షణం అతన్ని చూసి ఇద్దరూ కలిసి, కూడబలుక్కున్నట్టు పరుగులాంటి నడక ప్రారంభించారు.

గంగరాజు వాళ్ళననుసరించేడు శిష్యుడితో సహా.

లేడిపిల్లల్లా పరిగెడుతున్నారు వాళ్ళు. ఊబ శరీరంతో, ఆయాసంగా వెంట





# కతలు

పడ్డారు రక్షకద్వయం.

చివరికో సందు తిరిగి అక్కడున్న పెద్ద గేట్లోంచి లోపలికి వెళ్ళిపోయారిద్దరూ.

గేట్లోకి దూరబోతూ పైనున్న బోర్డు చూసేడు గంగరాజు. దానిమీద ఇలా వుంది– "ప్రభుత్వ మూగ బాల బాలికా పాఠశాల మరియు హాస్టల్"

— కాంత్

## ప్రారంభోత్సవం

నగరంలో కొత్త హాలు ప్రారంభోత్సవానికి మంత్రిగారు విచ్చేస్తున్నారు.

కొత్త సెవెంటీ ఎమ్మెమ్ హాలు సరికొత్త ముస్తాబుల్తో కళకళ్ళాడి పోతోంది. దాన్ని అటుపక్క సగం నిర్మాణంలో ఉన్న థర్టీఫైవు ఎమ్మెమ్‌ని చూసుకుంటూ ముచ్చటపడిపోతున్నాడు థియేటరు యజమాని.

అంతా హడావుడి... రణగొణధ్వని... కేకలు... కార్లు... ఆటోలు... రిక్షాలు...

అంతలో–

మంత్రిగారు కారులో సపరివారంగా రానే వచ్చారు.

నమస్కారాలు... మర్యాదలు... అన్నీ యథావిధిగా జరిగిపోయేయి.

కళ్ళజోడు సర్దుకుంటూ 'హాలు' నోసారి తల పైకెత్తి చూసిన మంత్రిగారికి సగర్వంగా నిలబడ్డ సెవెంటీ ఎమ్మెమ్మ పక్కనే నిర్మాణ దశలోవున్న థర్టీఫైవ్ ఏమ్మెమ్ కనబడింది.

"దాంట్లో ఏటాడుతంది?"– మంత్రిగారి ప్రశ్న.

"అండర్ కన్‌స్ట్రక్షన్ సార్"– ఎవరిదో జవాబు.



"ఓహో ఇంగిలీసు బొమ్మా! తొలాట ఏ 'సీతారామ కల్యానమో' ఎయ్యలేకపోనావయ్యా" మంత్రిగారి ప్రశ్నకి, పుక్కిరి బిక్కిరయ్యాడు థియేటర్ యజమాని.

— బి.కె. ఆర్

## ఐరన్

రామకృష్ణ ఐరన్ అండ్ హార్డ్‌వేర్ షాపులో గుమాస్తాగా పనేస్తున్న



పీతాంబరాన్ని చూసిపోదామని బొంబాయి నుంచి వచ్చింది రాంబాయమ్మగారు. ఆవిడ పీతాంబరానికి వేలువిడిచిన మేనమామ అక్కయ్య. ఆవిడకి బంధుప్రీతి, అంతికు మించి ఆంగ్లభాషాభిమానం హెచ్చు. వచ్చిందగ్గర్నుంచీ తెరిచిన నోరు ముయ్యకుండా బొంబాయి విశేషాలు అద్భుతమైన ఆంగ్లంలో చెప్తూ వూదర కొట్టేస్తోంది ఇంటిల్లిపాదినీ. పీతాంబరం కొడుకు నీటుగా రాసుకున్న ఇంగ్లీష్ నోట్సులు దజనున్నర తప్పుల్ని ఇట్టే ఎత్తి చూపింది కూడా. అలాగే పీతాంబరం భార్య మాట్లాడిన ఒకటి రెండు ఎంగిలి పీచుమాటలు ఎంత తప్పో కూడా సోదాహరణంగా నిరూపించింది.

అవతల ఆఫీసుకి టైమవుతున్నా మర్యాదకి 'వూఁ' కొడుతూ అన్నీ సహిస్తున్నాడు పీతాంబరం.

"ఇంతకీ నువ్వేం చేస్తుంటావు నాయినా?" అనడిగిందావిడ ఆప్యాయంగా.

హమ్మయ్య పీలు చిక్కిందనుకుని తొందరగా "ఐరన్ షాపులో పని చేస్తుంటానులెండి. తొరగా వెళ్ళాలి. షాపు తెరిచే టైమయింది" అన్నాడు.

"అలాగా! ఉండుండు" అన్చెప్పి రాంబాయమ్మగారు తటాలున లోపలికెళ్ళి ఓ గుడ్డలమూట తీసికొచ్చి పీతాంబరం ముందు పడేసింది. ఆశ్చర్యపోయిన పీతాంబరం "ఇదేమిటి" అన్నాడు తెల్ల మొహం వేసి.

"మరేం లేదు నాయినా! ఎలాగు ఐరన్‌షాపులో పని చేస్తానంటున్నావుగా. రైళ్లలో తిరిగి తిరిగి పెట్టెలో నలిగి నలిగి బట్టలు మరీ అలుగుడ్డలా తయారయ్యాయి. చాకలికెందుకు వెయ్యటం. డబ్బుల్దండుగ. ఇవి కాస్త మీ షాపులో ఐరన్ చేయించి పెట్టు. చచ్చి నీ కడుపున పుడతాను" అంది ఏకధాటిగా.

ఐరన్ షాపు పీతాంబరం గాజు కళ్ళతో ఆవిడ్నే చూస్తుండిపోయేడు.

— కె. కమలకుమారి

# ముద్దుమందు

శివరావుకి మధ్య ఆఫీసులో వర్కు ఎక్కువయిపోయింది. దాంతో అతని కిష్టమైన సినిమాలన్నీ దగ్గరి థియేటర్లలోంచి వారం తిరగ్గానే వెళ్ళిపోతున్నాయి. సెకండ్ షో చూస్తే అతనికి పడదు. ఆదివారంనాడు క్యూలో కుస్తీ పట్లు పట్టలేదు. వర్కింగ్ డేస్‌లో ఏ ఒక్కనాడు మొదటి ఆటకి వెళ్దామన్నా పని వల్ల తీరుబాటు కావడం లేదు. దాంతో వెధవాఫీసు, వెధవ పని, వెధవ జీవితం అని తెగ బాధపడిపోతూ అస్తమానూ పళ్లు గట్టిగా నూరుకోవడంతో కుడి దవడ

దగ్గిర పన్ను నొప్పి రోజురోజుకీ ఎక్కువౌతున్నట్లు అనుమానం వచ్చింది శివరావుకి. ఇదివరకటి రోజుల్లో దంత వైద్యులు ఈగల్ని తోలుకునేవారుగాని ఇపుడు వాళ్ళకి డిమాండ్ పెరిగింది. పన్ను పీకి ఏ పాతిక రూపాయలు జేబులోంచి పీక్కుంటాడో అని భయంవేసి ఆ ప్రయత్నం మానుకున్నాడు.



ఓ రోజు సాయంత్రం ప్రసాద్ ఫైళ్ల సర్ది ఇంటికెళ్తూ వెళ్తూ "ఏవోయ్ శివరావ్ బాగున్నావా? ఈ మధ్య పక్కనేవున్నా పలకరించడానికి తీరుబడై చావడంలేదు" అన్నాడు. అంతే పదినిమిషాలు ప్రసాద్‌ని కదలనివ్వకుండా గట్టిగా వాటేసుకుని పన్ను నొప్పి గురించి, చిన్న సీరియల్ వివరించాడు.

వెంటనే ప్రసాద్ "దాందేముందోయ్, ఇలాంటి పంటినొప్పులకు డాక్టర్లు, వైద్యం అక్కర్లేదు. మొన్న నాకిలాగే ఎందుకొచ్చిందో ఏమో తెలీదు. పన్ను తెగ నొప్పి పెట్టేసింది. ఇంట్లో కాపడం పెట్టించుకుందామని వచ్చి చూస్తే మా ఆవిడ ఏ పేరంటానికో పోయింది. 'అబ్బా ఇస్సూ' అనిదవడ పట్టుకుని మూలుగుతూ కూచున్నాను. అంతలో తలుపు తోసుకుని మన స్టెనో లూసీ వచ్చింది" కన్ను గీటుతూ శివరాం వేపు చూసి మళ్ళీ మొదలెట్టేడు. "వస్తూనే ఒక్కణ్నే కూచున్న నా దగ్గరకొచ్చి ఓ ముద్దిచ్చి, చెంప నిమురుతూ 'ఏం రాజూ అలా వున్నావ్' అనడిగింది. అంతే నొప్పంతా చేత్తో తీసేసినట్టు, మంత్రం వేసినట్టు ఎగిరిపోయింది..." మధురానుభూతిలో దృశ్యాలు ఊహించుకుంటూ ఇంకా ఏదో చెప్తున్నాడు. శివరావ్ గభాల్న అందుకుని ఆత్రంగా "ఇంత మంచి సలహా ఇచ్చే మిత్రుడెవరుంటాడు గనక. నాకేం అభ్యంతరం లేదుగానీ మరి లూసీ ఈ టైములో ఇంట్లో వుంటుందా ?" అన్నాడు మురిపెంగా బుగ్గ నిమురుకుంటూ.

# తాజా మెదడు

సైన్సు పుస్తకాలన్నా, సైన్స్ ఆర్టికల్స్ అన్నా పాపారావుకి తెగపిచ్చి. ఎంతపిచ్చి అంటే కొత్తగా విడుదలైన మాగజైన్స్ పావలాకీ, అర్ధకీ అద్దెకి తెచ్చి చదవడమే గాక ఇంట్లో పచారి సామాను పొట్లాల కాగితాలు కూడా వెతికి వెతికి చదివితేనే గాని విడిచి పెట్టనంత. ''పిచ్చెక్కుతుందిరా వెధవా మరీ అలా చెడ చదవకు'' అని తండ్రి తరుచూ చీవాట్లు వేస్తున్నా, "పెళ్ళయిన పధ్నాలుగేళ్ళకి పుట్టిన ఒక్క గానొక్క నలుసువి. నీకివేం బుద్ధులా! ఇప్పటికే నీకు కళ్ళజోడు వచ్చేసింది. ఇకమీద సోడా బుడ్డి అద్దాలు తప్పవు

కాబోలు. ఇదంతా నా ఖర్మరా. నాకు చక్కని కోడలు వచ్చే యోగంలేదు" అని తల్లి చీటికి మాటికి ముక్కు చీదేస్తూ వున్నా పాపారావుకేం పట్టదు - అతని సైన్స్ గొడవ తప్ప. మొన్నీమధ్య కాలేజీలో ఏదో రాకెట్ ప్రయోగం గురించి వాదోప వాదాలు వస్తే "నీ బుర్ర బాగా మేటేసుకుపోయిందిరా! ఎంత సేపూ



పుస్తక పరిజ్ఞానం తప్ప శాస్త్రీయ లిస్టుగా ఆలోచించకపోతే ఎలారా! నీకు తప్పకుండా బ్రెయిన్ వాష్ చేయడమో, బుర్ర తీసేయడమో చేయాలి. తప్పదు" అంటూ విసవిసా వెళ్ళిపోయాడు విశ్వనాథం. అప్పట్నించీ పాపారావు బుర్రలో పురుగు ప్రవేశించింది. నిన్న ఆదివారం అనుబంధంలో చదివినట్లు మెదడు మార్పిడి చేసుకుంటే మంచిదని. ఆలోచన రావాలేగాని క్షణం ఆలస్యం చేయడు పాపారావు పాపం. ఆ విషయం తాలూకు మంచి చెడ్డలు తెల్సుకుందుకు ఫామిలీ డాక్టరు పార్వతీశంగారి దగ్గరికి పరిగెత్తాడు. ఆయనకి పాపారావేం కొత్త కాదు. పైగా అతని పిచ్చి గురించి పాపారావు తండ్రి డాక్టరుకి బాగా బోధించి వుంచాడు కూడా. ఆయన విషయమంతా సావధానంగా విని 'ఇంతవరకూ గుండె మార్పిడి విజయవంతంగా నడవడంలేదు. అపుడే మెదడు మార్పిడి కావాల్ట' అని మనసులో అనుకుని పైకిమాత్రం 'చూడబ్బాయ్! నీకు ఓ వారంలో కావాలంటే నా దగ్గర రెండు మెదళ్ళు రెడీగా వున్నాయి. ఒకటి ఇంజనీరుది. రెండోది రాజకీయ నాయకుడిది. ఇంజనీరు మెదడు రెండు వందలు. రాజకీయనాయకుడిది పన్నెండు వేలు. నీ ఇష్టం నీకేది కావాలంటే అదే అమరుస్తాను. మూడోది మాత్రం అడక్కు. నాదగ్గర్లేదు" అన్నాడు. పాపారావు రెండు నిమిషాలాలోచించి తడుముకోకుండా రాజకీయ నాయకుడిదే



కావాలన్నాడు.

''ఖరీదెక్కువ మరి ఆలోచించు! అదిగాక ఇంజనీరుకంటే రాజకీయనాయకుడికి తెలివితేటలు ఎక్కువా ఏమిటి? నా మాట విని...''

''ఏం వినక్కర్లేదు. ఆలోచించి ఆలోచించి ఇంజనీరుగాడి బుర్ర అరిగిపోయి వుంటుంది. రాజకీయ నాయకుడిది అలాగాదు. అతను తన మెదడు పెట్టి ఏ ఒక్కటి ఆలోచించడు గనుక ఎంతో తాజాగా వుంటుంది. నాకు అదే కావాలి'' అన్నాడు గుక్క తిప్పుకోకుండా.

"అలాగేలే! రేపు మీ నాన్నని వెంట బెట్టుకురా, సాక్షి సంతకం, ఆయన అనుమతి లేనిదే ఆపరేషన్ మొదలెట్టడానికి లేదు"

ఆపైన డాక్టరేమన్నాడో పాపారావుకు వినబళ్ళేదు. తండ్రి పేరు వినగానే తెలిసిపోయింది అది జరగని పని అని.

— లక్ష్మి

నాకు ఇరవై ఎనిమిదేళ్ళు. వీర వరాహ వెంకట సత్యనారాయణ శర్మ అనే చేంతాడంత పేరుని చివరంటా కత్తిరించేసి శర్మ అని ముచ్చటగా రెండక్షరాల పేరుని నిలబెట్టుకున్నాను. ఒక ప్రైవేటు కంపెనీలో కంప్యూటర్ ఇంజనీరుగా వుంటున్నాను. నెలజీతం రెండు వేల అయిదొందలు. ఆఫీసులో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవటం మినహా నేను పెద్దగా చేసేదేమీ వుండదు. ఈ మాత్రానికి అంత జీతమా అని ఆశ్చర్యపడకండి. నా నిపుణతకి అది తక్కువే. మా కంపెనీకి చెందిన కంప్యూటర్ నా ఆధీనంలోనే వుంటుంది. దాని సంరక్షణ నా బాధ్యత. మా కంప్యూటర్ ఎంతో విలువైనది. దాని అసాధారణ తెలివితేటల్ని ఇతర కంపెనీలకి గంటకి అయిదు వందల రూపాయల చొప్పున అద్దెకిచ్చి సొమ్ము చేసుకుంటుంది మా కంపెనీ. రోజుకి ఇరవైనాలుగ్గంటలు. ఎంత ఆదాయమో లెఖ్ఖకట్టి చూడండి. ఇంత ఖరీదైన యంత్రాన్ని సంరక్షించే నాకు జీతం రెండున్నర వేలు మాత్రమే. నేను వినా మా కంపెనీకి మరో గత్యంతరం లేదు. కంప్యూటర్ అణువణువూ తెలిసినవాణ్ణి నేనొక్కడినే. గట్టిగా అడిగితే నా జీతం పెంచకపోరు. కాని నేనే అడగను. నాకిదే చాలు. ఎంత రమ్మీ ఆడినా, ఎన్ని సినిమాలు చూసినా నాకొచ్చే జీతం నాకు సరిపోతూనే వుంది. నాకు ఆశలు కూడా ఎక్కువ లేవు.

నా చెల్లెలు నా కన్న మూడేళ్ళు చిన్నది. చాలా తెలివైంది. యూనివర్సిటీ ఫస్టు. బోల్డు గోల్డు మెడల్సు. నాకేమో దీన్నింకా పైకి చదివించాలని ఉంది. కానీ "చదివింది చాలు ఒక ఇంటిదాన్ని చెయ్యాల"ని మా అమ్మ పట్టుదల. కాదని వాదిస్తే కన్నీళ్ళు పెట్టుకుంటుంది. అంచేత చెల్లికి ఈ యేడు పెళ్ళి చెయ్యాలనే ప్రయత్నంలో వున్నాను.

నగర వాతావరణానికి కొంచెం దూరంగా, కాస్త ప్రశాంతంగా వుండే పరిసరాల్లో ఒక అందమైన భవంతిలో, ఎయిర్‌కండిషన్డు గదిలో అమర్చబడి వుంటుంది మా కంప్యూటర్. ఒక టెక్స్‌టైల్ మిల్లుకి వుత్పత్తిని గురించిన వుపదేశాలిస్తుంది. మరో ఫ్యాక్టరీ కార్మికుల వేతనాల లెఖ్ఖల్ని ప్రతినెలా ఒకటో తారీఖుకల్లా ఠంచన్‌గా గుణించి పెడుతుంది. ఇలాంటి వాటిద్వారా వచ్చే ఆదాయంతో మా కంపెనీ బలుస్తోంది. కామధేనువులాంటి ఈ కంప్యూటర్‌ని ఆయురారోగ్యాలతో కాపాడాల్సిన గురుతర బాధ్యత నాది. చాలా క్లిష్టమైన డిజైన్ కంప్యూటర్‌ది. రోజూ ఉదయం పూట ఓ అర్ధగంట దాని కోసం ఖర్చు పెడితే చాలు. ఒకవేళ అది పని చేయటం ఆగిపోయినా గంట, గంటన్నరలోగా దాన్ని మళ్ళీ బాగుచేయగలను. అంత దోస్తీ నాకూ, దానికీ. 'డయానా' అని ముద్దుగా పిలుచుకుంటాను నానేస్సాన్ని.. డయానాతో మనసు పడినప్పుడల్లా నేను ముచ్చటగా మాట్లాడటం కూడా కద్దు.

నాకు పెద్దగా చెడ్డ అలవాట్లనబడేవేమీ లేవు. సరదాకి వారానికి రెడుసార్లు రమ్మీ ఆడటం, ఓ సినిమా చూట్టం. ఆడవాళ్ళ పరిచయం లేదు. సూటిగా వాళ్ళ కళ్ళలోకి చూట్టం కూడా చేతకాదు. పుస్తకాలెక్కువ చదువుతాను. శాస్త్రీయ సంగీతమంటే చెవికోసుకుంటాను







ఆ ఇరవై మూడో తారీఖుని నేనెన్నటికీ మరిచి పోలేను. మామూలుగానే ప్రారంభమైనా చిత్రమైన సంఘటనలు జరిగిన రోజది.

యథాప్రకారం ఆ వుదయం ఆఫీసు కెళ్ళాను. నా ఎయిర్ కండిషన్డు గదిలో పేపరు చదువుతూ కూర్చున్నాను. బయట హాల్లో 'డయానా' తన పని చేసుకుపోతోంది. మా ఆఫీసు సిబ్బందికి రావాల్సిన జీతం, అలవెన్సులు, ఓవర్ టైము, పి.ఎఫ్.లు, ఇ.ఎస్.ఐ చెల్లింపులు, వాళ్ళు తీసుకున్న అప్పుల మినహాయింపులు మొదలైన వివరాలతో సహా ఒక్కొక్కరికీ చెందవలసిన మొత్తాన్ని వరుస క్రమంలో గుణించి పెడుతోంది డయానా.

ఇంతలో ఎవరో మిస్ లీల అట నన్ను చూడాలంటోందని కబురొచ్చింది రిసెప్షన్‌లోంచి. నేనే లీలనీ ఎరగను.

"సరే. ఆవిడకి ఫోనివ్వండి మాట్లాడతాను" అన్నాను రిసెప్షనిస్టుతో

"గుడ్ మార్నింగ్"

ఆ తీయని కంఠానికి వయసెంతో వుండదని తెలుస్తోంది.

"నేనెవరో మీకు తెలీదు. కొన్ని ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి మీతో. రావచ్చా?"

"ఎవరి ముఖ్యవిషయాలు ?"

"మీ చెల్లెలి పెళ్ళి విషయం గురించి"

''మా చెల్లెలి పెళ్ళితోమీకు...?"

"లోపలికి రానిస్తే అన్నీ వివరంగా మాట్లాడుకోవచ్చు"

"సరే, రండి"

క్రాపు సరి చేసుకున్నాను. షర్టు గుండీలు సరిగ్గా పెట్టుకుని కుర్చీలో సర్దుకుని కూర్చున్నాను.

"గుడ్ మార్నింగ్" అంటూ చిరునవ్వుతో లోపలికొచ్చింది మిస్ లీల.

తెల్లగా మెరిసే పలువరుస. నల్లగా తీర్చి దిద్దిన కనుబొమలు. చేపల్లా కదలాడే అందమైన కళ్ళు. బాబ్‌డ్‌హేర్ క్రాపు. పాంటు మీద బిగుతైన షర్టు వేసుకుంది. ఆ షర్టు మీద గుండెల మధ్య ఒక వలయం. ఆ వృత్తంలో రెండాకుల నడుమ ఒక పుష్పం ఎంబ్రాయిడరీ చేయబడివుంది. మంచి ఆరోగ్యంతో, పుష్టిగా మిసమిసలాడే శరీరం.

"నేను కూర్చోవచ్చా?" అడిగింది.

"సారీ" అని ఎదురుగా వున్న కుర్చీలో చెల్లా చెదురుగా పడివున్న ఎలక్ట్రానిక్సు పుస్తకాలని సర్ది పక్కన పెట్టి "కూర్చోండి" అన్నాను.

కుర్చీలో ఆసీనురాలై నా ముఖంలోకి సూటిగా చూసింది మిస్ లీల.

"రామస్వామి అనే అతను మీ చెల్లెలి జాతకం తెచ్చి మా అమ్మ చేతికిచ్చాడు. మా అన్నకి చూడాలని..." అంటూ ప్రారంభించింది.

"రామస్వామా ? అతనెవరో నాకు తెలీదే ! ఒకవేళ మా అమ్మ ఎవరికైనా జాతకం ఇచ్చిందేమో''

"జాతకాలు సరిపోయాయి. మా

అన్న మీ చెల్లెల్ని ఓ సారి చూడాలను కుంటున్నాడు" అంది సవ్వుతూ.

"అలాగా ? మరి మీ అన్న..."

"ఈ రోజు జెంషెడ్‌పూరు నించి వస్తున్నాడు"

"అంటే అక్కడ... ?"

"పైలెట్‌గా వుంటున్నాడు. టాటా కంపెనీ వాళ్ళ ప్రైవేటు విమానం నడుపు తూంటాడు. పైలెట్ వుద్యోగం కావటంతో పిల్లనివ్వటానికి ఎవరూ ముందుకి రావటం లేదు. మీకలాంటిదేమీ..." అని నాకేసి సూటిగా చూసింది.

"ఆ విషయం మా చెల్లెల్ని అడగాలి. మా అమ్మ కొంచెం భయస్తురాలు"

"తెలుసు. మీ కుటుంబం గురించి చాలా చెప్పాడు రామస్వామి"

ఎవడా రామస్వామి అనుకున్నాను మనసులో. "మీ అన్న ఈ రోజేవస్తున్నా దన్నారు కదూ?"



"అవును.విమానంలో. తనే నడుపుతూ. ముందు మా అన్నని కలిసి మాట్లాడండి. వాడు మీకు నచ్చితే ఈ సాయంకాలమే వచ్చి మీ చెల్లెల్ని చూస్తాడు. కాసిని మంచి నీళ్ళు తెప్పిస్తారా?" అంటూ నా కళ్ళలోకి చూసింది లీల.

"ఓ యస్" అంటూ బజర్నొక్కాను.

"ఈ ఒక్కరోజే మద్రాసులో వుంటాడు మా అన్న. రేపు కొచ్చిన్ వెడుతున్నాడు. మీ చెల్లెల్ని ఓసారి కాలేజీ ఫంక్షన్లో చూసి వున్నాను. చాలా చక్కని పిల్ల. ఈ సంబంధం కుదరాలని నాకెంతో కోరికగా వుంది"

ఫ్యూన్ వచ్చి నిలబడ్డాడు. ఒక గోల్డు స్పాట్ తెమ్మన్నాను.

"చూద్దాం. అదంతా అమ్మా, చెల్లీ వాళ్ళ నిర్ణయాన్ని బట్టి కదా"

"నేను బి.ఎ. పాసయ్యాను.నా అసలు పేరు అంటే మా వాళ్ళు పెట్టింది అలిమేలు. నేనే లీల అని మార్చుకున్నాను" అంటూ ఫ్యూన్ తెచ్చిన గోల్డుస్పాట్ అందుకుంది.

"అలిమేలు మంచి పేరే" అన్నాను చప్పున.

"మళ్ళీ మార్చుకోమంటారా?", స్ట్రాని నోట్లోంచి చేతికి తీసుకుని నవ్వుతూ నా కళ్ళలోకి చూసి అంది లీల అనే అలిమేలు. ఒక్కక్షణం నా మనసు చలించింది ఆ చూపులకి, ఆ నవ్వుకి.

"మీ అన్న ఎప్పుడొస్తున్నాడన్నారు?"

"మరో అర్ధగంటకి విమానం వస్తుందని చెప్పారు ఏర్పోర్టులో అడిగితే. మీకు వీలైతే ఇద్దరం ఇప్పుడే బయల్దేరి అక్కడే వాణ్ని కలుసుకుని మాట్లాడొచ్చు. కాదనుకుంటే మా ఇంటి అడ్రస్ ఇస్తాను. అక్కడికైనా రావచ్చు మీరు" అంటూ వాచీ చూసుకుంది.

"ఫరవాలేదు ఇప్పుడే వెడదాం. మళ్ళీ ఒకటి రెండు గంటల్లో తిరిగి రాగలమనుకుంటాను"

"ఓ తప్పకుండా. అయితే బయల్దేరండి మరి" అంటూ కుర్చీలోంచి లేచింది.

టెలిఫోను ఆపరేటర్తో పని మీద బయటికి వెళుతున్నాననీ, మరో రెండు గంటలదాకా రాననీ చెప్పి ఆఅమ్మాయితో బయలుదేరాను. ఉన్నట్టుండి బొంబాయి నించి టెలిఫోన్ చేస్తాడు 'సబ్ టీక్ హై?' అంటూ మా ప్రొప్రయిటర్ జెయిన్.

ఆఫీసు గుమ్మం ముందు నన్ను నిలబెట్టి పార్కింగ్లోంచి పడవలాంటి కారుని సునాయాసంగా డ్రైవ్ చేసుకొచ్చింది లీల. నెంబర్ ప్లేట్ మీద 'టి' అనే అక్షరం కనిపించి ప్రశ్నార్థకంగా ఆమెకేసి చూశాను. కారులో కూర్చున్న తరువాత చెప్పింది లీల "టూరిస్టు కారు. మా నాన్న ఐ. టి. డి. సి.లో ఒక వున్నతాధికారి" అని. రోడ్డు మీద కొన్ని చోట్ల ట్రాఫిక్ రూల్సుని అతిక్రమించి అతి వేగంగా పోనిచ్చింది కారుని.

"అన్నయ్య వచ్చేలోగా విమానాశ్రయం చేరుకోవాలి మనం. అన్నట్టు మీరు ఇంజనీరు కదూ?"

'అవును. కంప్యూటర్ ఇంజనీరుని"

"కంప్యూటర్ గురించి మీరొక రోజు వివరంగా చెప్పాలి నాకు"

"సంతోషంగా...చెప్తాను"పార్కులో ఏకాంతంగా ఎదురెదురుగాకూర్చున్నాము.

"డిజిటల్ కంప్యూటర్ అనేది..." అంటూ మొదలెట్టాను.

"మీ హృదయంలా వుంటుందా?"





అంటూ నా గుండెల మీదికి వాలింది...

గతంలో నేనెప్పుడూ అమ్మాయిల్ని గురించి ఇలా వూహించింది లేదు. ఇంతలో నా వూహల్ని చెదరగొడుతూ కారు హారన్ మోగింది.

విమానాశ్రయం రిమోడల్ చేస్తున్నారు. టూరిస్టు బస్సులో దిగిన గుంపులు విమానాన్ని చూడ్డానికి నిలబడి వున్నాయి. ఎంట్రెన్సు టిక్కెట్టు తీసుకుని లోపలికి నడిచాము.

"విమానం ఇంకా వచ్చినట్లులేదు. టైమెంత?" అని వాచీ చూసుకుంది.

"పది ముప్పై అయిదు" అన్నాను.

ఆకాశంలోకి చూస్తూ నిలుచుందిలీల. ఆమెనే చూస్తూ నిలబడ్డాను నేను. చెల్లెలి పెళ్ళి తరువాత ఆలోచించాల్సింది నా పెళ్ళి గురించే లీలతో ... లీల ... నా భార్య. ఇక్కడే నా పక్కనే, నన్నానుకునే నిలబడి వుంది. ఛీ! ఏమిటిలా ఆలోచిస్తున్నాను. అసలా అమ్మాయికి నామీద ఎటువంటి అభిప్రాయముందో ఏమో?

"అదుగో అటు చూడండి!" సంతోషంతో అరిచింది లీల.

హంసలా నేలమీదికి దిగే విమానం కేసి చేయి వూపింది. అదొక మీడియం సైజు విమానం. కోడిగుడ్డు ఆకారంలో ఏడెనిమిది కిటికీలు కనిపిస్తున్నాయి. మా వేపుకి దూసుకొచ్చింది. మాకు కొంచెం దూరంలో వచ్చి ఆగింది. పైలెట్ సీటులోంచి ఓ చెయ్యి మమ్మల్ని రమ్మన్నట్టుగా పిలిచింది.

"రండి లోపలికి వెడదాం, విమానం చూద్దురుగాని. చిన్నదైనా లోపల ఎన్ని సౌకర్యాలున్నాయనుకున్నారు!"

ఖాకీ దుస్తులు వేసుకున్న ఒకతను ముందుకి వెళ్ళనుండా మమ్మల్ని అడ్డగించాడు. అతని కళ్ళలోకి చూసి ఒక చిరునవ్వు నవ్వి అతని చేతిలో రెండురూపాయి నోట్లు కుక్కింది లీల. నవ్వుతూ సలాం చేసి "వెళ్ళండమ్మా" అన్నాడతను. విమానం కేసి వేగంగా నడిచాము. విమానానికి ఒకవేపు ఇంజన్ తిరగటం ఆగింది. చనువుగా నా చేతిని పట్టుకుని మెట్లెక్కి విమానం లోపలికి తీసికెళ్ళింది లీల.

"రండి రండి" లోపలినుంచి వినిపించిందో కంఠం. మరుక్షణం విమానం మెట్లు లోపలికి ముడుచుకున్నాయి. తలుపు మూసుకుంది. ఆగిపోయిన ఇంజన్లు మళ్ళీ తిరిగే శబ్దం వినిపించింది.




విమానం తలుపులు మూసుకుపోయింతరువాత గమనించాను ఆ ఇద్దరిని. దృఢకాయులు. అరవింద దళాక్షులు కాకపోయినా ఆజానుబాహువులు. లేత నీలం రంగు 'ఓవరాల్' లాంటి దుస్తులు ధరించి వున్నారు. నా రెండు భుజాలమీద చేతుల్తో గట్టిగా అదిమిపట్టి నన్నొక సీట్లో కూలదోశారు వాళ్ళు. సీటు బెల్టుని నా నడుం చుట్టూ బిగించారు. నివ్వెరపోతూ లీలకేసి చూశాను. విమానం గాల్లోకి లేవటం గ్రహించగలిగాను.

"ఏమిటిదంతా?" భయకంపిత స్వరంతో లీలకేసి చూసి అడిగాను. నా

కిదంతా ఏదో జేమ్సుబాండ్ సినిమాలోవలె వుంది.

"వీళ్ళు చాలా మొరటు మనుషులు. బుద్ధిగా కూర్చొకుంటే తంతారు కూడా. విమానం పైకి లేస్తోంది. జాగర్తగా కూర్చోండి" అంది లీల. ఆమె కంఠంలో మార్పుని గమనించాను.

"విమానం ఎక్కడికి వెడుతోంది? నన్నెక్కడికి తీసుకెళుతున్నారు?" అడిగాను కంగారుగా.

"స్వర్గ ద్వీపానికి"

"స్వర్గద్వీపమా? ఎక్కడుంది అది?"

ఆమె సమాధానం ఇంజన్ రొదలో కలిసిపోయింది. వాళ్ళు ముగ్గురూ నాకెదు

రుగా వున్న సీట్లలో కూర్చున్నారు. ఎదురుగా ఆరెంజి రంగు బల్బొకటి ఆరి ఆరి వెలుగుతోంది. కిటికీలోంచి రన్‌వే దూరం కావటం కనిపిస్తోంది. నాకు కడుపులో ఏదో తిప్పినట్టుగా వుంది. విమానం బాగా ఎత్తుకి లేచింది. హైదరాబాద్ నగరం బొమ్మరిల్లుగా మారింది. రేస్‌కోర్సు, పెద్ద పెద్ద భవనాలు, టాంక్‌బండ్ అంచులు... విమానం ఇంకా పైపైకి తేలిపోతూ వుంది.

"లీలా!" పిలిచాను. లేచి నా పక్కగా వచ్చింది.

"ఇప్పుడు బాగా సర్దుకుని కూర్చో వచ్చు మీరు. తినడానికేమైనా కావాలా? కూల్ డ్రింక్సు లాంటివి?"

"నా ప్రశ్నకి సమాధానం కావాలి ముందు"

"నేను మీ సేవకురాలిని. ఏం కావాలి చెప్పండి?"



"నేసడిగిందానికి సమాధానం చెప్పు. సన్నెక్కడికి తీసికెళుతున్నారు ? ఎందు కోసం ? అసలు ఎవరు మీ ర ం తా?" కోపంగా అరిచాను.

"స్వర్గ ద్వీపానికి వెళుతున్నాం"

"ద్వీపమా?"

"అవును"

"అంటే సముద్రమధ్యంలో"

"అవును"

"మరో దేశమా అది"

"అవును"

"నేనెందుకు అక్కడికి?"

"అ క్క డి కి వె ళ్ళి ం త ర వా త తెలుస్తుంది"

"ఎంతదూరం ఆ ద్వీపం ? ఎన్ని మైళ్లుంటుంది ?"

"నాకు సరిగ్గా తెలీదు. పైలెట్ని అడగండి"

"పిలువు అతణ్ణి"

"పిలుస్తాను. కొంచెం ఆగండి"

ఆ విమానంలో తొమ్మిది సీట్లు న్నాయి. విశాలమైన సీట్లు. విలాసంగా వెనక్కి వాలి, హాయిగా నిద్రపోవడానికి మెత్తని దిండ్లు, మందంగా కాంతిని వెద జల్లే నీలిరంగు బల్బులు. సీట్లోంచి లేవనీ కుండా నన్ను బెల్టుతో కట్టేశారు.

ఎవరో అమ్మాయి రావటమేమిటి ? ఎలుకను పట్టేసినట్టు నన్ను విమానంలో బంధించి ఏ ద్వీపానికో తరలించుకుపోవట మేమిటి ? అమ్మా, చెల్లెలూ ఏమనుకుం టారు? ఎంత దిగులు పడతారో ? క్రింద ఎడారుల్లాంటి పొలాలు తప్ప మరేమీ కని పించటంలేదు. పీలికల్లా తేలుతున్నాయి కొన్ని మేఘాలు.

"ఇదన్యాయం. నన్నొదలండి వెధవ ల్లారా ?" అని పెద్దగా అరిచాను. ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు వాళ్లు. నవ్వే జాతి కూడా కాదనిపించింది వాళ్ళది.

"నన్నొదిలి పెట్టండి ప్లీజ్! నేను మీ పైలెట్ తో మాట్లాడాలి."

వీలుకాదు అన్నట్టుగా తలూపింది లీల. బలవంతంగా బెల్టు పట్టు నుంచి విడి పించుకోటానికి అటూ ఇటూ కదిలాను. మరింతగా బిగుసుకుపోయింది నా చుట్టూ అది.

"మీరు ద్రోహులు, దొంగలు. ఇది అన్యాయం" అని పిచ్చిగా అరిచాను.

"ఏయ్! పైలట్" అని కేకేశాను కసిగా. ఆ ఇద్దరు దృఢకాయులూ లేచారు. ఏదో మాట్లాడుకుంటూ విమానం వెనుక భాగంకేసి నడిచారు. కాసేపట్లో తిరిగొచ్చి నా ముందు నిలబడ్డారు. ఒకని చేతిలో ఇంజక్షన్ వుంది. స్పిరిట్ వాసన తగిలింది నా ముక్కు పుటాలకి. నా చొక్కా గుండీలను విప్పడానికి ముందుకి ఒంగింది లీల. నేను అసహాయంగా గింజుకుంటున్నాను. ఆ ఇద్దరిలో ఒకడు నన్ను అదిమిపట్టగా లీల నా షర్టు వదులు చేసి కుడి భుజం కనిపించేలా చొక్కాని కిందికి లాగింది కొంచెంగా. చిన్న సిరంజి అది. లోపల రంగు లేని ద్రవం.

"ఈ సూది వేసుకుంటే హాయిగా ఉంటుంది. బాగా నిద్దరొస్తుంది. సందే హాలు రావు. ప్రశ్నలడగరు. నొప్పి కూడా పుట్టదు" అంటోంది లీల.

"నో...నో...నాకు సూది గుచ్చ కండి. నేను మిమ్మల్నేమీ అడగను. బుద్ధిగా కూర్చుంటాను. నాకీ సూది వద్దు" అని అరిచాను.

"చీమ కుట్టినట్టు కూడా ఉండదు.

 

హాయిగా వుంటుంది."

"వద్దు. ప్లీజ్ నా మాట వినండి. నన్నొదిలి పెట్టండి."

ఆ ఇద్దరూ నన్నదిమి పట్టుకున్నారు. లీల సిరంజిని నా భుజం దగ్గరకి తీసుకొచ్చింది.

"లీలా... ప్లీజ్ లీలా!"

"ఆపండి" ఖంగుమని ధ్వనించిందో కంఠం. కాబిన్ తలుపు తెరుచుకుంది. అక్కడ నిలబడ్డ అతన్ని చూడగానే నా ముందున్న ముగ్గురూ పిల్లుల్లా అయిపోయి అటెన్షన్‌లో నిలబడ్డారు.

నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"మీకు తెలివి లేదు. అతను మన అతిథి. అతనితో ప్రవర్తించాల్సిన తీరు ఇదేనా? మీకు నిజంగా బుద్ధి లేదు. లీల! నువ్వు కూడానా" అని మందలిస్తూ నన్ను సమీపించాడు అతను.

"సారీ, వెరీసారీ. నేను ఈ విమానం నడిపే పైలట్‌ని. భయపడకండి. లోపల నాకో పైలట్ వున్నాడు. అతనికి ఛార్జి ఇచ్చి మీతో వచ్చి మాట్లాడాలనుకున్నాను. ఇంతలో ఈ గందరగోళం. క్షమించండి". అతనికి, తక్కిన ఇద్దరు దృఢకాయులకీ ఆకారంలో తేడా లేదు. కాని అతని కంఠంలో ధ్వనించిన సౌమ్యత తెచ్చిపెట్టుకున్నదిగా అనిపించింది నాకు. అతనొచ్చి నా పక్కనే కూర్చుని నన్ను బంధించి పెట్టిన బెల్టుని వూడదీశాడు.

"చెప్పండి. ఏం తీసుకుంటారు? బ్రాందీ, విస్కీ, కూల్‌డ్రింక్?"

"నాకేమీ వద్దు. నన్ను మోసం చేసి ఎక్కడికి తీసుకెళుతున్నారు. నాకు చెప్పాల్సిన బాధ్యత మీకు లేదా?"

"తప్పకుండా, తప్పకుండా వుంది మిస్టర్ శర్మా"

"అయితే చెప్పండి వెంటనే. మీరంతా ఎవరసలు?"

"స్వర్గ ద్వీప వాసులం"

"నన్నెందుకిలా బంధించి తీసుకెళుతున్నారు?"

"అలా అనకండి. మీరు మా అతిథి."

"హు...అతిథుల్ని తీసుకెళ్ళే పద్ధతి ఇది కాదు. సరే పోనివ్వండి. నన్నెందుకు మీ ద్వీపానికి తీసికెళుతున్నారోచెప్పండి".

"విమానం దిగాక మీకే తెలుస్తుంది. చూడండి మిస్టర్ శర్మా! మీ ప్రాణానికి గాని, వుద్యోగానికి గాని, మీ కుటుంబానికి గాని ఏ విధమైన ఇబ్బందీ కలక్కుండా జాగ్రత్త చేసుకున్నాం. మీ కంపెనీ మీద అర్జంటుగా ఈ ఉదయం ప్లేన్‌లో బయలుదేరి మీరు బొంబాయి వెళుతున్నట్టుగా మీ ఇంటికి టెలిగ్రాం ఇచ్చాము. ఒక అత్యవసరమైన సొంత పనిమీద మీరు కొన్ని రోజులు సెలవు పెడుతున్నట్టుగా కంపెనీకి టెలిగ్రాం ఇచ్చాం. అంచేత మీరేమీ దిగులు పడాల్సిన అవసరం లేదు?"

"ఎంతకాలం ఈ నాటకం?"

"అది మాత్రం నేను చెప్పలేను"

"నీ పేరేమిటి?"

"షా"

"షా! చిత్రంగా వుంది"

"అది నా పేరు. మిమ్మల్ని మళ్ళీ కలుసుకుంటాను. కాబిన్‌లో నాకు పనుంది. వీళ్ళిద్దరూ మిమ్మల్నిక ఏమీ ఇబ్బంది పెట్టరు. హాయిగా విశ్రాంతి తీసుకోండి"

"నా కిదంతా ఏదో గందరగోళంగా వుంది"

"విమానం దిగేక అంతా అర్థమవుతుంది" అని అతను వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళాంతరువాత గోళ్ళు గిల్లుకుంటూ కాసేపు ఆలోచనలో పడిపోయాను. ముందేమి జరగనుందో ? చిత్రమైన మనుషుల్లా వున్నారు. ఒకరు సూది గుచ్చబోతే మరొకరు అడ్డుకుంటున్నారు. స్వర్గ ద్వీపం అంటున్నారు. అతిథి నంటున్నారు! ఒక్కటి మాత్రం తెలుసుకోగలిగాను. నా ప్రాణానికేమీ భయంలేదు. వీళ్ళకి నాతో ఏదో ముఖ్యమైన పనే వున్నట్టుంది. నా కిప్పుడు కొంచెం భయం తగ్గింది. కిటికీలోంచి బయటికి చూశాను. సూర్యకిరణాలనిబట్టి విమానం ఆగ్నేయ దిశగా ప్రయాణం



చేస్తోందని అర్థం చేసుకున్నాను. ఇప్పుడు కింద సముద్రం మాత్రమే కనిపిస్తోంది. అంటే చాలాదూరం వచ్చామన్నమాట. లేచివెళ్ళి లీల పక్కసీట్లో కూర్చున్నాను. "హలో" అంటూ ఆమెకేసి చూసి చిన్నగా నవ్వాను. బదులుకి బలవంతంగా నవ్వింది ఆమె.

"లీలా! నిన్ను అలిమేలు అని పిలుస్తాను"

"నా పేరు లీలా కాదు, అలిమేలూ కాదు"

"రెండూ కాదా? అయితే ఏమిటి నీ పేరు?"

"నా కసలు పేరు లేదు. టెంపరరీగా ఈ వారం రోజుల కోసం లీల అని పెట్టు



కున్నాను" అందిలీల–సారీ పేరులేని సుందరి.

"యు ఆర్ ఎ క్లెవర్ డెవిల్" అన్నాను ఆమెతో.

"మీరంటున్నదేమిటో నా కర్థం కావటం లేదు" అంది నాకేసి చూసి.

"నీకు ఇంగ్లీషు రాదా ?"

"రాదు"

"ఇంతకు ముందు ఆఫీసు గదిలో నాతో మాట్లాడిందంతా ఏమిటి?" అడిగాను.

"అదంతా నేను వల్లెవేసి అప్పగించిన పాఠం"

"అసలు నీ భాషేమిటి ?" అడిగాను ఆశ్చర్యంగా.

"తెలుగు"

"అదైనా బాగా వచ్చా లేక కంఠతా పట్టావా?"

"తెలుగు నా భాష. కాని మీ భాషకీ, మేం మాట్లాడే భాషకీ చాలా తేడా వుంది. మా భాషలో మీరు వాడే కొన్ని పదాలు వుండవు"

"సరే పోనీ. ఇప్పుడు నాకో ముద్దు ఇస్తావా?"

"ముద్దా? అంటే!"

"తెలీదా ?"

తెలీదన్నట్టుగా తలూపింది.

"మీ భాషలో ముద్దుని ఏమంటారు ? మొద్దు అనా?"

అయోమయంగా చూసింది.

నేను నా చేతి మణికట్టుమీద చుంబించి "ఇది తెలీదా మీకు ?" అన్నాను వ్యంగ్యంగా.

"ఓ..." అని నవ్వింది.

"మీ భాషలో 'ఓ' అంటారా దాన్ని?"

"కాదు. దానికి మా భాషలో పేరు లేదు. కాని సెలవు రోజుల్లో మాత్రం మేం చేస్తూ వుంటాం దాన్ని" అంది నవ్వుతూ.

"ఈరోజు మీకు సెలవు దినం కాదా?"

కాదన్నట్టుగా తలూపింది.

"ఇంతకుముందు మా ఆఫీసులో మీ అన్న పెళ్ళిగురించి నాతో అంతచక్కగా మాట్లాడావే. మరిప్పుడు ముద్దుకి అర్థం తెలీదంటే ఎలా నమ్మటం?" అడిగాను కొంటెగా.

"అదంతా నేను కంఠతా పట్టిన పాఠం అని చెప్పానుగా" అని పాంటు జేబు లోంచి టైపు చెయ్యబడిన కాయితాలు బయటికి తీసింది.

'గుడ్‌మార్నింగ్. నేనెవరో మీకు తెలీదు. కొన్ని ముఖ్యమయిన విషయాలు మాట్లాడాలి మీతో. గావచ్చా...' ఆఫీసు రూంలో నాతో మాట్లాడిందంతా స్పష్టంగా టైపుచేసి వుంది ఆ కాయితాల్లో !

"నెల్రోజులపాటు తరఫీదు ఇచ్చారు ఈ పాఠం అప్పజెప్పడం కోసం."

నమ్మలేనట్టుగా చూశాను ఆమె ముఖం లోకి. ఆ కాయితాలని చేతికి తిరిగిస్తూం డగా ఆమె గుండెల్ని తాకాయి నా చేతులు. ఆమె అభ్యంతరం చెప్పలేదు. ఆమె నడుంచుట్టూ చేతులు పోనిచ్చాను. అయినా ఆమెలో ఏ చలనమూ కనిపించ లేదు. చప్పున చేతుల్ని వెనక్కు లాక్కున్నాను.

"మీ దేశం పేరేమిటన్నావు?"

"స్వర్గద్వీపం".

* * *

'గుయ్'మనే విమాన శబ్దానికి క్రమంగా కునుకు పట్టింది. మళ్ళీ కళ్ళుతెరచే వేళకి విమానం కిందికి దిగుతోంది. లీల వేరే దుస్తుల్లో దర్శనమిచ్చింది. తను

కూడా తక్కిన ముగ్గురిలాగే లేత నీలం రంగు 'ఓవరాల్' యూనిఫారం తొడుక్కుంది. శిరోజాలని బాగా వెనక్కినెట్టి గట్టిగా ముడివేసింది. ముఖంలో ఏ విధమైన మేకప్ కనిపించటం లేదు. కిటికీ లోంచి బయటకు చూశాను. సముద్రం మాత్రమే కనిపిస్తోంది. మరికొంచెం ముందుకి వంగి చూడాలని సీట్లోంచి కొంచెం పైకి లేవబోయాను. మళ్ళీ నా చుట్టూ బెల్టు బిగించివుందని గ్రహించాను.

"లీలా! సముద్రం మీదకి దిగుతున్నామా ఏమిటి?" అని అడిగాను.

నా ఎదురు సీట్లో వున్న దృఢకాయుడు "ఇష్!" అంటూ పైన మధ్యలో వెలిగే అక్షరాలకేసి చేయి చూపాడు. "కిందకి దిగుతున్నాం. జాగ్రత్తగా కూర్చోండి" అన్నాయి ఆ అక్షరాలు.

ఉన్నట్టుండి కిటికీలోంచి చెట్ల పైభాగం పచ్చగా కనిపించింది. చిన్న ద్వీపమే అయివుండొచ్చు ననిపించింది. ఆ చెట్ల చివర్లు మాకేసి విసురుగా తలలూపుతున్నాయి. పచ్చని కంబళీ కప్పుకున్నట్లున్న రెండు పర్వతశిఖరాలు విమానంకేసి స్లోమోషన్‌లో వస్తున్నట్టు అనిపించింది.

ఆ రెండు కొండల నడుమనుంచి అతి చాకచక్యంగా కిందికిదిగుతోంది విమానం. రెక్కలు లోపలికి ముడుచుకున్నాయి. ఇప్పుడు నేలమీద రన్‌వే స్పష్టంగా కనిపిస్తోంది. అటూ ఇటూ వూగుతూ రన్‌వే మీదికి దిగుతోంది విమానం. రెండు కొండల నడుమ ఒక లోయలో దాగున్నట్టుగా వుంది ఆ విమానాశ్రయం. ఒకే రీతిలో కట్టబడిన బొమ్మరిల్లులాంటి భవనాలు కనిపించేయి. తుడిచిపెట్టిన అద్దం పలె పరిశుభ్రంగా కనిపించే నేల! ట్రాములాంటి రెండు బస్సులు, కొన్ని కార్లు కనిపిస్తున్నాయి రోడ్లమీద.

విమానం మృదువుగా నేలని తాకింది. కొంతదూరం రన్‌వే మీద పరిగెత్తి ఒక చోట ఆగింది. ఎదురుగా విశాలమైన భవనం కనిపిస్తోంది.

విమానం తలుపులు తెరుచుకున్నాయి. నా సీటు బెల్టునుంచి విడిపించుకుని బద్ధకంగా వొళ్లు విరుచుకున్నాను. కాబిన్ లోంచి కేప్టన్ షో, అతని కోపైలట్ వెలుపలికొచ్చారు. వారితోబాటు లీల, ఆ ఇద్దరు దృఢకాయులు కిందికి దిగి నన్ను ఆహ్వానించడానికన్నట్టుగా వరుసగా నిలుచున్నారు. నేను కిందికి దిగుతుంటే అంతా చప్పట్లు కొట్టి తమ ఆనందాన్ని వ్యక్తం చేశారు.

ఏం జరగబోతోందోనన్న ఆందోళనతో అటూ ఇటూ చూస్తూ నడుస్తున్నాను. సుమారు వెయ్యడుగుల దూరంలో ఠీవిగా నిలిచివుంది ఆ భవనం. దాని ముంగిట ఓ అందమైన కారు. ఆ కారు నానుకుని గంభీరంగా నిలబడివున్నాడు ఒక వ్యక్తి. అతనూ తక్కిన వారివలె ఆ లేత నీలం రంగు దుస్తులే ధరించి వున్నాడు.

ఆ భవనం కేసి నడిచాము. ఆ కారుని సమీపించగానే "ఇప్పుడు విడిపోతున్నాం. మళ్ళీ కలుద్దాం" అని లీల తక్కిన నలుగురితో కారెక్కింది. కారు దగ్గర నిలబడ్డ అతను డ్రైవర్ సీట్లో కూర్చున్నాడు. కారు నన్నొంటరిగా వదిలి కదిలిపోయింది.

మొదటిసారిగా ఏదో ఒంటరితనం ఫీలై వెనక్కి తిరిగి చూశాను. మేము ఎక్కి వచ్చిన విమానాన్ని ఒక ట్రాక్టరు లాక్కుపోతోంది. ఎదురుగా చూశాను.

పెద్ద అధునాతనమైన థియేటర్ లాంటి ఆ భవనం గంభీరంగా నిలబడివుంది. గాజు కిటికీలన్నీ మూసి వున్నాయి. నా కెందుకో ఆ ప్రదేశం చిత్రంగా కనిపించింది.

"మిస్టర్ శర్మా!" ఎక్కణ్ణుంచో అశరీరవాణి పలికినట్టుగా ధ్వనించిందో కంఠం.

నాలుగు దిక్కులూ చూశాను. దగ్గర్లో వున్న కొండల్లో, లోయల్లో ప్రతిధ్వనించింది ఆ పిలుపు.

కొన్ని సెకండ్ల తరువాత తిరిగి "మిస్టర్ శర్మా" అని ధ్వనించింది. ఈసారి ఆ పిలుపు ఎదురుగా వున్న భవనంలోంచేనని గ్రహించ గలిగాను. కంటికి కనిపించని మైకులోంచి వచ్చి

నట్టుగా వుంది ఆ ధ్వని.

"శ్రమ కలిగిస్తున్నందుకు క్షమించండి... శ్రమ కలిగిస్తున్నందుకు క్షమించండి... మిమ్మల్ని పరిశోధించాలి... మిమ్మల్ని పరిశోధించాలి.. ముక్కుకి సూటిగా నడిచిరండి... ముక్కుకి సూటిగా నడిచిరండి."

తిన్నగా నడిచి వెళ్ళాను. నాకిదంతా చిత్రంగా అనిపిస్తోంది. గాజు తలుపు తెరుచుకుంది. దాని వెనక నిలబడ్డ అమ్మాయి అచ్చం లీలలా వుంది. అదే యూనిఫారం, అదే హేర్ స్టయిల్! అయితే ముఖానికి సగందాకా తెల్ల గుడ్డ చుట్టుకుని వుంది. మెడలో స్టెతస్కోప్. ఆమె కళ్ళు నన్ను చూసి చిన్నగా నవ్వుతున్నాయి.

"మీరెవరు? డాక్టర్ లీలనా?" అడిగాను.

సమాధానం చెప్పకుండా "ఇటు రండి" అంటూ నా చేయి పట్టుకుని తెర తొలగించి లోపలికి తీసుకు వెళ్ళింది.

విశాలమైన హాలు అది. ఎయిర్ కండిషన్డ్ చెయ్యబడినట్టు చల్లగా వుంది. ఎదురుగా పెద్ద టెలివిజన్ స్క్రీన్ లాంటిది కనిపిస్తోంది. గోడ వారగా వున్న ఓ గదిలోకి తీసుకు వెళ్ళింది ఆ డాక్టర్ నన్ను. ఆ గది ద్వారం మీద 'ఆరో' అన్న అక్షరాలు కనిపించాయి. ఆ గదిలో ఓ కుర్చీ మీద కూర్చో బెట్టింది నన్నా అమ్మాయి. నా షర్టు గుండీలు విప్పి నా గుండెల్ని స్టెతస్కోపుతో శ్రద్ధగా పరీక్షించింది. ఆమె దగ్గర అసెప్టిక్ వాసన వేస్తోంది.

"ఇదేమి పరీక్ష?" అడిగాను.

"మామూలే. మా ద్వీపంలోకి అడుగు పెట్టిన వారందరినీ ఇలా పరిశోధించాలి. పావుగంటలో అయిపోతుంది. గట్టిగా శ్వాస పీల్చి వదలండి"

"ఇంత పెద్ద భవనంలో నీవొక్క దానివేనా?"

"కాదు. తక్కిన వాళ్ళున్నారు. వస్తారు"

నా బ్లడ్ ప్రెషర్ చూసింది. నుంచున్న చోటనే పరిగెట్టేలా స్టెప్స్ వేయమని చెప్పి మరోసారి బి.పి. చూసింది. చిన్న సూదితో కాలిమీద గుచ్చి రక్తపు బొట్టుని గాజు పలక మీదికి తీసుకుంది. టెస్టుట్యూబు చేతికిచ్చి మూత్రం పట్టుకు రమ్మంది. అన్ని రకాల వ్యాధుల లిస్టు వల్లించి వాటిలో నాకేదైనా ఇంతకు ముందు వచ్చిందా అని అడిగి తెలుసు కుంది. అంతా అయింతరువాత క్లయి మాక్సుగా నన్ను బట్టలన్నీ విప్పేసి నిలబడమంది.

"తమాషా పడుతున్నారా?" అన్నాను కోపంగా.

"విప్పండి త్వరగా. వాళ్ళంతా కాచుకుని వున్నారు"

"వీల్లేదు" అన్నాను మొండిగా.

"ఎందుకని?"

ఇక నిగ్రహించుకోలేక పోయాను.

"నన్ను అవమానిస్తున్నారు. నేనేదో రాకెట్లో పంపబడే కోతినైనట్టుగా ప్రవర్తిస్తున్నారు నాతో. నీ ముందు నేను నగ్నంగా నిలబడను"

"ఏం ఎందుకని?" అడిగింది నిమ్మళంగా.

"సిగ్గులేదూ అడగటానికి? ఎవరైనా మగ డాక్టర్ని రమ్మను"

"సిగ్గా! అంటే?"

"అదే నీ దగ్గర లేనిది. మీరంతా





మనుషులు కారు. నన్నొదిలి పెట్టండి. లేకుంటే ఈ గాజు తలుపుల్ని బద్దలు కొట్టేస్తాను" అంటూ ఆవేశంతో అరిచాను. టేబిల్ మీది గాజు గ్లాసుని కసిగా నేల మీదికి విసిరాను. అది పగల్లేదు. అయోమయంగా నా కేసి చూసి గది చివరికి వెళ్ళింది ఆ అమ్మాయి ఇంటర్ కాం మీట నొక్కింది.

"ఏమిటి ?" అంటొక కంఠం.

"అతని భాషలో కొన్ని మాటలు అర్థం కావటంలేదు. బట్టలు విప్పనంటున్నాడు" చెప్పింది ఇంటర్‌కాంలో.

"శర్మా ! మీరు దుస్తులు విప్పేదాకా ఈ భవనంలోనే వుండాల్సివస్తుంది. మీ శరీరంలోని అన్ని భాగాలూ పరిశోధించనిదే మీరు బయటికి రావడానికి వీలుండదు. మీరు బట్టలు విప్పేదాకా మీకోసం వేచి వుంటాము" అంది ఆ గొంతు.

"యూ డెవిల్స్" అని అరిచి మరో గాజు కూజాని కసిగా ఆ అమ్మాయి పైకి విసిరాను. అది కూడా పగల్లేదు. గదిలోంచి వెళ్ళిపోయింది డాక్టరమ్మాయి. తలుపు తెరవడానికి ప్రయత్నించాను. సాధ్యం కాలేదు. నిస్సహాయంగా స్టూలు మీద కూలబడ్డాను.

"మగ డాక్టర్ని పంపండి. బట్టలు విప్పుతాను" అన్నాను చివరికి.

"వెంటనే పంపుతున్నాం" అని పలికింది అశరీరవాణి. కొద్ది నిమిషాలకు తలుపు తెరుచుకుని మరో ఆకారం లోపలికి ప్రవేశించింది. ఇంతకు ముందు నేను చూసిన అదే లేత నీలంరంగు యూనిఫారం

"నువ్వు మగా, ఆడా ?" అడిగాను.

"మగ"

గబగబా అన్నీ విప్పేసి నగ్నంగా నిలబడి "చూసుకో" అన్నాను వ్యంగ్యంగా.

"ఏమైనా తీసుకుంటావా ?"

"కాఫీ కావాలి. తెప్పించు" అన్నాను.

"అదిక్కడ దొరకదు మీ విడిదిలో దొరుకుతుంది. ఇక్కడ పాలు కావాలంటే దొరుకుతాయి"

"పసిపాపలెవరూ వున్నట్టులేదే ఇక్కడ" ఎగతాళిగా అన్నాను. డాక్టర్ ముఖంలో ఎటువంటి భావమూ లేదు.

"మీ పరిశోధన పూర్తయింది. పద్దెనిమిది నిమిషాల్లో ఫలితాలు తెలుస్తాయి. దయచేసి వెచి వుండగలరు" పలికింది అశరీరవాణి.

పద్దెనిమిది నిమిషాలకి తలుపు తెరుచుకుంది. ఓ పది మంది ఒకే యూనిఫారంలో లోపలికి ప్రవేశించారు. వారిలో ముందుగా ప్రవేశించినతని ఛాతీమీద ఒక గుండ్రటి వలయం. దానిలో మరో వృత్తం.

"నా పేరు బెరి. మిమ్మల్ని కలుసుకోవటం నాకెంతో సంతోషం" అంటూ తనని పరిచయం చేసుకున్నాడు.

"మెడికల్ టెస్టులో నేను పాసా?"

"క్ష మిం చా లి. మీరంటున్న దేవిటో...?"

"నా దేహ పరిశోధన గురించి అడుగుతున్నాను"

"ఓ అదా. మీ శరీరంలో ఏ రోగమూ లేదు. మీరు మా దీవిలోకి రావచ్చు"

"నీ పేరేమిటన్నావ్ ?"

"బెరి"

"చూడు బెరి! నేనిక్కణ్ణుంచి కదిలే ముందు కొన్ని విషయాలు తెలుసుకోవాలి"



చతుర ... 31

"అడగండి"

"నన్నిక్కడికెందుకు తీసుకొచ్చారు?"

"కొంతకాలం మీరు మాకు అతిథిగా వుంటారు"

"నన్నే ఎందుకు ఎన్నుకున్నారు? ఇందిరాగాంధీ లేదా? అంజయ్య లేడా?"

"ఈ సాయంత్రం తెలుస్తుంది మీకు"

"అంటే?"

"ఈ సాయంకాలం మీరు సత్యాని కలుసుకుంటారు"

"సత్యా? ఆడా, మగా?"

"మగ"

"షో, బెరి, సత్యా... ఏం పేర్లండీ"

"వెడదామా?"

"నా ప్రశ్నలింకా పూర్తి కాలేదు.



ఎంతకాలం నేనిక్కడ వుండాలి?"

"అది మీ మీదే ఆధారపడి వుంటుంది"

"అంటే?"

"సత్యా చెపుతారు"

"ఎవడయ్యా ఈ సత్యా. ఈ దేశానికి

ప్రధానమంత్రా లేక అధ్యక్షుడా?"

"అవన్నీ మాకు లేవు. సత్యా అంతా వివరిస్తాడు".

"సరే వీళ్ళంతా ఎవరు ? అంతా మూసపోసినట్టు ఒకే యూనిఫారంలో వున్నారే? అది కూడా సత్యా చెపుతారు. అంతేనా?"

"మేమంతా మీ మిత్రులం. మరేమీ ఆలోచించకండి..."

"అన్నీ ఆ సత్యా చూసుకుంటారు, అంతేనా...ఇప్పుడు ఎక్కడికి తీసికెళు తున్నారు నన్ను?"

"ముందు మా విడిదికి వెడదాం. అక్కడ మీరు కాసేపు హాయిగా గడిపి, విశ్రాంతి తీసుకున్న తరువాత మీకు అన్నీ వివరంగా చెప్తాం"

"హాయిగా గడపడమంటే ?"

"అక్కడికి వెళ్ళాక మీకు తెలుస్తుంది"

ఒకే రకమైన మూడు కార్లు భవనం ముంగిట ఆగాయి.




విమానాశ్రయం నుంచి కారు బయలు దేరింది. కారు కిటికీలోంచి బయటికి చూస్తున్నాను. చిత్రంగా అనిపించింది. రోడ్డుమీద ఎక్కడా జనసంచారమన్నది లేదు.

హైదరాబాద్ రోడ్లను గుర్తుకి తెచ్చుకున్నాను. నిమిష నిమిషానికీ కారుకి అడ్డొచ్చే మనుషులు, సైకిల్ రిక్షాలు, భూతాల్లాంటి లారీలు, సిటీ బస్సులు, గాడిదబరువు పుస్తకాలని మోసుకుపెళ్ళే బడిపిల్లలు, బూతులు తిడుతూపోయే ఆటో, టాక్సీల డ్రైవర్లు, నోళ్లు తెరుచుకుని కనిపించే డ్రైనేజి గుంటలు, శోషొచ్చి పడిపోయేలా దర్శనమిచ్చే ట్రాఫిక్ పోలీసులు, చెవుల్లో చిల్లులు పడే హారన్‌మోతలు ఇవేవీ లేకుండా నిర్మలంగా, నిశ్శబ్దంగా సాగిపోతోంది నా ముందు కనిపించే కాంక్రీటు రోడ్డు. ఒక కొండని చుట్టుకుంటూ సాగింది రోడ్డు. ఆ కొండ చరియల్లో ఇంతకు ముందు విమానంలోంచి కనిపించిన పచ్చని తోటలు, పొలాలు కనుల కింపుగా దర్శనమిచ్చాయి. ఆ పరిసరాలు కూడా నిర్మానుష్యంగానే వుండటం చూసి విస్తుపోయాను. ఎక్కడా గ్రామాలు కూడా వున్నట్టనిపించలేదు. సుమారు ఎనభై కిలోమీటర్ల వేగంతో వెడుతోంది మా కారు. ఎక్కడా హారన్ మోగించలేదు. చుట్టూ పచ్చని పంట పొలాలు చూడముచ్చటగా. సరిసమానమైన ఎత్తుకు ఎదిగి చక్కని పచ్చటి తివాచీలు పరిచినట్టుగా !

ఉన్నట్టుండి ఒక మలుపు తిరిగింది కారు. నగరం సమీపిస్తోన్న సూచనలు కనిపిస్తున్నాయి. ముందుగా నా దృష్టి నాకర్షించింది ఒక బ్రహ్మాండమైన బోర్డు. పదహారడుగుల ఎత్తు, ఇరవై అయిదు అడుగుల వెడల్పుతో ఎత్తుగా నిలిచి ఉంది. ఆ బోర్డు నిండా ఆక్రమించిన ఒక ముఖం చిరునవ్వుతో పలకరిస్తున్నట్టుగా వుంది. విశాలమైన నుదురు...చురుకైన కళ్లు...కొంచెంగా పైకిజారిన బట్టతల,.. ఆ కళ్లు నన్నే చూస్తున్నట్టుగా అనిపించి–

"ఎవరిది బొమ్మ ?" అనడిగాను.

"సత్యా" అన్నాడు బెరి.

"ఇతను మీ దేశానికి అధిపతా?"

"కాదు. సత్యా మాలో ఒకరు"

"మరయితే ఇంత పెద్ద బోర్డెందు కిక్కడ? పూజించడానికా?"

"మీ మాటలు నా కర్థం కావటంలేదు"

"సమాధానం చెప్పడం ఇష్టం లేనప్పుడల్లా 'అర్థం కాలేదు' అనడం మీకలవాటు కాబోలు"

మౌనం.

"ఈ వూళ్ళో అసలు మనుషులున్నారా?"

"లేకేం, చాలా మంది"

"ఎవరూ కనిపించరేం మరి"

"అంతా వాళ్ళ వాళ్ళ భవనాల్లో వుంటారు"

నగరం మమ్మల్ని కమ్మివేసింది. నిటారుగా నిలబడ్డ ఎత్తయిన కాంక్రీటు భవనాలు ఒకదానితో ఒకటి పోటీపడుతున్నాయి. నగరంలోని వీధులు సరళ రేఖలు గీసినట్టుగా అందంగా విశాలంగా అమరి వున్నాయి. ఎక్కడా ఒక కాగితం ముక్కగాని, సిగరెట్టు పీకగాని, చెత్తాచెదారం గాని కనిపించటం లేదు. అద్దంలా అతి పరిశుభ్రతతో మెరిసిపోతున్నాయి వీధులు. మనుషులు నడవని ఆ వీధుల మీద కార్లు అతివేగంగా సాగిపోతున్నాయి. అందమైన ఒకటి రెండు ట్రాం బండ్లు మాత్రం కనిపించాయి. అవి కూడా ఖాళీగానే వెళుతున్నాయి. పై అంతస్తు ఫ్లాట్ బాల్కనీలోంచి ఎవరో పాప జెండా వూపుతూ కనిపించింది. ఆ జెండా మీద సత్యా బొమ్మ!

రోడ్డు పక్క పార్కులాంటి ప్రదేశంలో మొదటిసారిగా ఒక పిల్లల గుంపు కనిపించింది. ఆడా, మగా పసిపిల్లలు ఒకేరకమైన దుస్తులు ధరించి చూడముచ్చటగా డైమండ్ ఆకారంలో నిలబడి డ్రిల్లులాంటిది చేస్తూ కనిపించారు. అంతా పదేళ్ళలోపు వారే. అయినా వయసుకు మించిన పెరుగుదలతో పుష్టిగా, ఆరోగ్యంగా కనిపిస్తున్నారు.

"బడిపిల్లలా?" అడిగాను.

"అవును" అన్నాడు బెరి.

నాలుగు రోడ్ల కూడలిని సమీపించింది కారు. మా కోసమే అన్నట్టుగా ట్రాఫిక్ సిగ్నల్ గ్రీన్ లైటుని చూపుతోంది.

"మనం వొస్తున్నట్టు ముందే తెలుసా మీ ట్రాఫిక్ సిగ్నల్‌కి?" వ్యంగ్యంగా ప్రశ్నించాను.

"ఒకే వేగంతో కారు నడుపుతూ వెళితే ఎప్పుడూ పచ్చ లైటు వెలుగుతుంది" అన్నాడు బెరి. అంత చక్కని ఏర్పాటుకి విస్తుపోకుండా వుండలేకపోయాను. అంతదాకా మౌనంగా వున్న కారు రేడియో "బెరి'' అని పిలిచింది.

"బెరి" అంటూ బదులు పలికాడు.

''తిన్నగా 4Bకు రా. మన అతిథి వస్తున్నాడా నీతో?"

"వస్తున్నాడు"

"ఏమైనా ఇబ్బంది కలిగిందా?"

"లేదు" అన్నాడు బెరి నన్ను చూస్తూ.

"చూడండి రేడియోగారూ! నేనిప్పుడీ కారులోనే వున్నాను" అన్నాను మైకుని లాక్కుని.

"అలాగా చాలా. సంతోషం."

"మీరెవరో సెలవిస్తారా? సత్యాగారా?

''కాదు'' అని మౌనం వహించింది రేడియో.




రహదారి మలుపు తిరిగి ఒక పదిహేనంతస్తుల భవనం ముందాగింది కారు. భవనం మెట్లెక్కుతూండగానే అద్దాల తలుపులు తెరుచుకున్నాయి మా కోసం. ఆటోమేటిక్ లిఫ్టులో పదిహేనో అంతస్తుకి చేరుకున్నాము.

దీర్ఘమైన వరండా అది. కాళ్ళ కింద అతి మృదువైన కార్పెటు హాయిగా తగులుతోంది. ఎడం వేపుకి తిరిగి ఒక విశాలమైన గదిలోకి తీసుకు వెళ్ళాడు జెరి నన్ను.

"ఇదే మీ గది" అన్నాడు.

చాలా పెద్ద గది అది. గదిలో ఎదురుగా గోడకి ఒకే ఒక పటం, సత్యాదిది! గోడలకి లేత నీలం రంగు. ఓ వారగా పెద్ద మంచం. కుషన్ పరుపు. కూర్చొని చేత్తో అదిమి చూశాను. లీల గుండెల్ని తాకినప్పుడు కలిగిన అనుభూతి కలిగింది. మంచం పక్కనే చక్కని టెలిఫోను. బాత్‌రూం తలుపు తెరిస్తే ఎదురుగా



అద్దంలో నేను. ముక్కుపుటాలకి హాయిగా సోకిన బ్రాత్రూం సోపు వాసన. తలుపు తెరిచిన వెంటనే వెలిగే నీలిరంగు లైటు. ముందు గదిలో కొచ్చాను. ఎదురుగామేజా. మేజా మీద పెన్‌స్టాండు. కొన్ని కాయితాలు. ఎదురుగా గోడ నాక్రమించిన అద్దంలాంటి తెర.

గోడ మీది మీటనొకదాన్ని వేలితో నొక్కాడు బెరి. సినిమా థియేటరులో వలె మెల్లగా తెర తొలగింది. భ్రమించి పోయి చూస్తున్నాను. ఆ తెర మీద నాకు నగరమంతా కనిపించింది! కింద రోడ్డు మీద సాగిపోయే కార్లు. రోడ్డు కిరువేపులా ఠీవిగా నిలబడిన భవనాలు. అదుగో ఆ పార్కులో డైమండ్ ఆకారంలో నిలబడి ఆడుకుంటోన్న బడిపిల్లలు. దూరాన కొంత చరియల మీది పచ్చదనం. టెరేస్ మీద పెద్ద స్విమ్మింగ్ పూలు. దాన్నిండా లేత నీలిరంగులో స్వచ్ఛంగా కదిలే నీళ్ళు.

"మీ కేమైనా కావలిస్తే ఈ వూదారంగు మీట నొక్కండి" అన్నాడు బెరి.

మీట నొక్కాను. వెంటనే గోడ కున్న ఒక తలుపు తెరుచుకుంది.

"నమస్తే. ఏం కావాలి?" అని చిరు నవ్వుతో ప్రవేశించింది అందమైన పదహారేళ్ళ అమ్మాయి.

"ఫరవాలేదు. మీటపని చేస్తోంది" అన్నాను బెరీ వేపుకితిరిగి.

"ఇప్పుడేమీ అవసరం లేదులే. నువ్వెళ్ళమ్మా పాపా" అని ఆఅమ్మాయిని పంపించేశాను. లోపల ఏదో భయం లాంటిది కదులుతోన్నా ఈ ఇంద్రజాలం చూస్తోంటే నాకు మొంది సరదాలాంటిది కూడా కలిగింది.

"గది చూపించారు సరే. నాకు పంచెలూ, పాంటూ, షర్టూ, లుంగీలూ వగైరా అవసరం లేదనుకున్నారా?" అన్నాను బెరీతో. ఒక పెద్ద అల్మేరా తలుపు తెరిచాడు బెరి. అందులో నాకు అవసరమైన అన్ని వస్తువులూ చక్కగా అమర్చి వున్నాయి. పకడ్బందీగా వాళ్ళు నాకోసం చేసి వుంచిన ఏర్పాట్లకి నిర్ఘాంతపోయాను.

"ఇదేమిటి టెలివిజనేనా?" అంటూ స్విచ్ తిప్పాను. ప్రకాశవంతంగా ఓ మానవాకారం కనిపించింది తెర మీద.

"నమస్తే. స్వర్గ ద్వీపానికి మిమ్మల్ని మనసారా ఆహ్వానిస్తున్నాము. మాద్వీపం గురించి కొన్ని ముఖ్యమైన విషయాలు..."

"తర్వాత తీరిగ్గా వింటాలెండి" అని టి.వి. ఆఫ్ చేసి బెరి వేపుకి తిరిగాను.

"ఇది మీ ప్రభుత్వ టెలివిజనా?"

"కాదు. ప్రత్యేకంగా రికార్డు చెయ్యబడినవి మాత్రమే వుంటాయి ఇందులో".

"సత్యాని కలుసుకునే ముందు తప్పకుండా చూడండి. మా ద్వీపాన్ని పరిచయం చేసే కార్యక్రమం రికార్డు చెయ్యబడింది ఇందులో. నాకు అవతల పనుంది. మిమ్మల్ని మళ్ళీ కలుసుకుంటాను" అని వెళ్ళిపోయాడు బెరి.

గదిలో ఒంటరిగా మిగిలిపోయాను.

డాబామీది స్విమ్మింగ్‌పూలుమనసులో మెదిలి ముందుకి లాగింది. బట్టలువిప్పేసి లోపల డ్రాయరుతో డాబా మీదికి చేరాను. యస్ ఆకారంలో అందంగా కట్టబడి వుంది ఆ శీతల మడుగు. నీళ్ళలోకి దిగాను. శరీరానికి గిలిగింతలు పెడుతూ చల్లగా తగులుతున్నాయి నీళ్ళు. మనసుకి, శరీరానికి చెప్పలేని ఏదోహాయి.




స్వేచ్ఛగా మునుగుతూ, తేలుతూ పసి పిల్లవానిలా ఈదుతూ పోయాను. స్విమ్మింగ్ పూల్ మధ్యకి చేరుకున్నాను. "జాగర్త. అక్కడ లోతు చాలా ఎక్కువ. ముందుకి వెళ్ళకండి" హెచ్చరిక వినిపించింది. నివ్వెరపోయి నాలుగు దిక్కులూ పరికించాను. ఎవరూ కనిపించలేదు. మళ్ళీ అశరీరవాణి నాతో మాట్లాడుతోందా? మైకులోంచి విని పిస్తోంది ఆ కంఠం అని తెలుస్తోంది. నన్నెవరో పరికిస్తున్నారు! ఎవరు? ఎక్కణ్ణుంచి? గబగబా ఒడ్డుకి చేరుకున్నాను. దూరంగా ఎత్తయిన భవనాలు ... పైన నిర్మలమైన నీలాకాశం. గదికి తిరిగొచ్చి తలుపు తెరుస్తున్నప్పుడు గమనించాను తలుపు పై అంచుకి అమర్చి వున్న ఆ చిన్న లెన్సుని. టెలివిజన్ లెన్సు అది.

"స్నానం చేస్తున్నప్పుడు చూడొచ్చా? దానికి టాటాచెప్పి గదిలోకి ప్రవేశించాను.

తడిసిన డ్రాయర్ విప్పేసి అల్మేరా లోంచి కొత్త బట్టలు తీసి తొడుక్కున్నాను. శుభ్రంగా తల దువ్వు కున్నాను.

తలుపులు తెరవబోతే రాలేదు. గడియ వేసి వున్నాయి. చిరాకు కలిగింది. విసురుగా టెలిఫోను రిసీవర్ చేతికి తీసు కున్నాను.

"ఏం కావాలి?" అడిగింందో తీయని కంఠం.

"బెరీ. బెరీని పిలవండి" అన్నాను విసుగ్గా.

"బెరీ రావడానికి కాసేపుపడుతుంది. అందాకా మంచి సంగీతం వింటారా?"

వయొలిన్ ధ్వనించింది. "మీ సంగీతం తగలేసుకోండి" అని ఫోను పెట్టేశాను.

చటుక్కున నీలి రంగు మీట సంగతి గుర్తొచ్చింది. మీట నొక్కాను. చిరు నవ్వుతో ప్రవేశించింది. ఆ పదహారేళ్ళ బాల. బిగుతైనపాంటూ షర్టూ వేసుకుంది.

"ఏం!కావాలి?" అడిగింది.

"వేడిగా ఒక రవా దోసె"

అర్థం కానట్టు నా ముఖంలోకి చూస్తూ నిలబడింది.

"అర్థం కాలేదా? నాకు ఆకలి, చచ్చేంత ఆకలిగా వుంది. తిండానికేమైనా పట్రా" అన్నాను కడుపుని చేత్తో పట్టు కుంటూ. నవ్వుతూ తలూపి వెళ్ళింది ఆ అమ్మాయి. పావుగంటలో తిరిగొచ్చింది. చిన్న ప్లేటులో ఏవో తెచ్చి టేబిల్ మీద పెట్టింది.

"ఇదా నా భోజనం ?"

"ఆహారం" చెప్పింది.

"మాంసాహారమా ?"

అర్థం కాలేదా పాపకి.

ఉప్పు, కారం లేని ఆ పదార్థాలు తిన లేకపోయాను. పకోడీ లాంటిది ఒకటి కొరికి చూశాను. పాలవంటి ద్రవం నోటికి తగిలింది. గ్లాసుడు పాలుమాత్రం తీసుకుని మిగతావి వదిలేశాను. చేతులు తుడుచుకుని టేబిల్ మీద కనిపించిన ఫారాల్లోంచి ఒకటి చేతికి తీసుకున్నాను–

మీ పేరు : వయసు: మీ అనుమతి నెంబరు: స్వర్గ ద్వీపంలో ఎంత కాలం వుండదల్చుకున్నారు: మీరు కోరుకునే స్త్రీ వివరాలు : (రంగు, వయసు, కొలతలు మొ॥): ఎంతకాలం : (గంటలు, దినాలు, వారాలు)

సంతకం

ఏదో అప్లికేషన్ ఫారంలా వుందేగాని తలా తోకా అర్థమై చావటం లేదు నాకు.

"ఏమిటిది?" అడిగాను ఆ ఫారాన్ని

అమ్మాయి ముందుకి చాపుతూ.

"పైలో గుణపవానికి ఎవరైనా స్త్రీ కావాలనుకుంటే ఇది పూర్తి చేసి పంపితే మీరు కోరుకున్నటువంటి మనిషి పంపబడుతుంది" నింపాదిగా చెప్పింది ఆపాప.

అదిరిపోయాను.

"ఏమిటీ! మళ్ళీ చెప్పు"

ఆ అమ్మాయి మళ్ళీ చెప్పేలోగా ఇంతలో టెలిఫోను మోగింది. రిసీవర్ తీసుకుని "బెరీ?" అన్నాను.

"కాదు. జాగర్తగా వినండి. వీళ్ళు మిమ్మల్ని మోసపుచ్చి వాడుకోవాలని చూస్తున్నారు. వాళ్ళ మాటలు వినకండి.



వాళ్ళు చెప్పే పనులేవీ..." మాట పూర్తి కాక ముందే టెలిఫోన్ కట్ అయింది.




టెలిఫోను మాటల్ని మననం చేసుకుంటూ ఆలోచిస్తున్నాను. ఎవరో నన్ను హెచ్చరిస్తున్నారు. మరెవరో ఆ హెచ్చరికను విననీకుండా అడ్డుకున్నారు. ఎవరిలా నాతో దాగుడుమూతలాడుతున్నారు? అంతా గందరగోళంగా, అయోమయంగా వుంది.

టెలిఫోన్ మోగింది.

"బెరీని మాట్లాడుతున్నాను" అంది అవతలి కంఠం.

"బెరీ! నువ్వు వెంటనే ఇక్కడికి రావాలి" అన్నాను.

"ఎందుకో చెప్పండి శర్మగారూ"

"నా గది తలుపుల్నెందుకు బంధించి వుంచారు? వాటిని తెరిచి ఉంచాలి. నేను మీ ఖైదీని కాదనుకుంటాను. మీరిచ్చే ఆహారం నాకు రుచించటం లేదు. ఈ వూళ్ళో మంచి ఉడిపి హోటల్‌లాంటిదేమీ లేదా ఏం? సారీ, హోటల్ అంటే అర్థం కాదు కాబోలు- మంచి బ్రాహ్మణ భోజన శాలలు లేవా మీ వూళ్ళో. ఇంకో ముఖ్యమైన విషయం, మరో ఐదు నిమిషాల్లో నన్నెందుకిక్కడికి తీసుకొచ్చారో నాకు చెప్పి తీరాలి"

"మీకిష్టమైన ఆహారం పంపే ఏర్పాట్లు జరుగుతున్నాయి"

"నువ్వు ఇప్పుడు వస్తున్నావాలేదా?"

"నేను రావటం లేదు. అది మా కార్యక్రమంలో లేదు"

"ఏమిటీ! కార్యక్రమంలో లేదా? మీరేమైనా మహాసభలు జరుపుకుంటున్నారా ఏం?"

"శర్మగారూ! ఆ అమ్మాయి ఉంది చూశారూ"

"ఏ అమ్మాయి? మీట అమ్మాయా?"

"ఆఁ... ఆమెతో హాయిగా గడుపుతూ వుండండి, మళ్ళీ కలుస్తాను" అని ఫోను పెట్టేశాడు బెరి.

'షిట్' అంటూ టెలిఫోనుని విసురుగా పెట్టాను స్టూలు మీద. టెలిఫోను సక్రమంగా సర్ది కొంచెం దూరంగా వెళ్ళి నుంచుంది మీట అమ్మాయి.

"గెటవుట్" అరిచాను నాకోపాన్నంతా వెళ్ళగక్కుతూ.

కళ్ళు మిటకరించి చూస్తూ నిలబడింది.

"అర్థం కాలేదా? వెళ్లు. బయటికి నడువు. ఇక్కణ్నుంచి తగలడు అని అర్థం. వెళ్ళిపో ముందు"

ఆమె ముఖంలో ఏ విధమైన భావమూ వ్యక్తం కాలేదు. గదిలోంచి వెళ్ళిపోయింది.

'మర మనుషులు' మనసులో అనుకున్నాను. ఆ అమ్మాయి వెళ్ళిన తలుపుల్ని పరిశోధించాను.

అవి కూడా అవతలివేపునించి లాక్ చెయ్యబడి వున్నాయి. బోనులో బంధించబడిన జంతువులా గదిలో అటూ ఇటూ పచార్లు చేశాను. కుషన్ పరుపు మీద కాసేపు కూర్చున్నాను. అతి మృధువైన ఆ పడక నా కోపాన్ని, చిరాకుని ఏ

మా్ర్తం తగ్గించలేకపోయింది. టెలిఫోన్ రిసీవర్ చేతికి తీసుకున్నాను.

"నమస్తే" అంటోక తీయని స్త్రీ కంఠం.

"నేను సత్యతో మాట్లాడాలి" అన్నాను.

కాసేపు మౌనం తరువాత "ఇప్పుడు వీల్లేదు. ఇంకెవరైనా కావాలా?"

"ఇంకెవరూ అవసరంలేదు"

"పోనీ సంగీతం వింటారా?"

"మధురైమణి అయ్యర్ సంగీతం వినిపించగలరా" అన్నాను ఎగతాళిగా.

"ఒక్క నిమిషం ఆగండి. కంప్యూటర్‌ని కనుక్కొని చెపుతాను"

గతుక్కుమన్నాను. కంప్యూటరా ? సరిగ్గా మరో నిమిషానికి టెలిఫోను మోగింది. "మధురైమణి అయ్యర్... మీ మంచానికి ఎడంవేపు వున్న పసుపురంగు మీటని నొక్కండి. సంగీతం వినిపిస్తుంది"

ఆ మీట నొక్కాను.

'సరస సామదానా' గదంతా మధురంగా ఆవరించింది. సందేహంలేదు. మణి అయ్యరే! కాఫీ నారాయణి. ఎంతో చక్కగా రికార్డు చెయ్యబడింది. అతి దివ్యంగా గానం చేస్తున్నాడు. సాహిత్యంతో నిమిత్తం లేకపోతేనేమి. ఆ కంఠంలో ఎన్ని చిత్రమైన మలుపులు! ఎంత చక్కని స్వరజతులు. కాసేపు నా పరిస్థితిని మరిచిపోయి సంగీతాస్వాదనలో లీనమైనాను. ఈ గదిలో కోరుకున్నవి లభ్యం అవుతాయనే సంగతి గ్రహించి ఆశ్చర్యంలో మునిగిపోయాను. ఎదురుగా వున్న టెలివిజన్ ఆన్ చేశాను.





మణి అయ్యర్ సంగీతం ఆగిపోయింది. కొద్ది క్షణాలు తెరమీద గీతలు నృత్యం చేసి ఓ పురుషాకారం ప్రత్యక్షమైంది.

"నమస్తే. స్వర్గద్వీపానికి మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాము" అంటున్నాడు అతను.

"ఆహ్వానించండి" అన్నాను నవ్వుతూ.

"మా ద్వీపాన్ని పరిచయం చేసే కార్యక్రమం ఇది. పదినిమిషాల పది క్షణాల సేపు సాగుతుంది..." గంభీరమైన కంఠంతో చెప్పుకుపోతున్నాడు. కడలి తరంగాల నేపథ్య సంగీతం వినిపిస్తోంది. ఆకాశం మీంచి సముద్ర మధ్యంలోని ద్వీపపు సుందర దృశ్యం కనిపించింది.

"హిందూ మహా సముద్రంలో వున్న ఈ చిన్న ద్వీపం..." అలలు తీరాన్ని ఢీకొని తెల్లగా నురగలుకక్కుతున్నాయి. ఒక దేశం కాదు, ఒక నగరం. మాంటేజ్ షాట్సులో ఎత్తయిన భవనాలు కనిపించాయి. "ఈ ద్వీప నగరంలో మూడు లక్షల ఇరవైయ్యారువేల మూడు వందల ముప్ఫైఆరు మంది ప్రజలున్నారు". తెరమీద అంకెల్లో కనిపించింది ఆ సంఖ్య. "వీరిలో స్త్రీలు, పురుషులు చెరి సగం..." మొత్తం జనాభా సంఖ్య చెరిసగంగా విడిపోయి అంకెల రూపంలో కనిపించింది.

"ఈరోజు వీరిలో ముగ్గురు మరణించబోతున్నారు. ముగ్గురు జన్మించనున్నారు".

త్రుళ్ళిపడి "ఏమిటి?..." అని అరిచాను.

"ఈ దీవిమీది ప్రజలంతా ఒకే కుటుంబంలోని సభ్యులవలె సఖ్యతతో జీవిస్తున్నారు" సంవత్సరంలో కురిసే సరాసరి వర్షపు కొలత, వ్యవసాయ పారిశ్రామిక రంగాల్లోని వుత్పత్తివివరాలు, నగరంలోని మొత్తం పాఠశాలల సంఖ్య మొదలైన

వివరాలని శ్రద్ధగా చెప్పుకుపోతున్నాడు.

"షటప్" అని టి. వి. ఆఫ్ చేశాను.

'ఇదము మాటలందో బాగ బల్కితిని' మళ్ళీ అందుకున్నాడు మధురై మణి అయ్యర్. ఇంకేమీ ఆలోచించకుండా చివరిదాకా విన్నాను. బాత్రూంలోకి వెళ్ళి పోయి హాయిగా స్నానం చేశాను.

నీటుగా ముస్తాబై మంచం మీద కూర్చు న్నాను. స్టూలు మీద టెలిఫోను కనిపి స్తోంది. ఇందాక టెలిఫోనులో ఎవరో చేసిన హెచ్చరిక మళ్ళీ గుర్తొచ్చింది. అసలు నేనెందుకు ఇక్కడికి తీసుకు రాబడ్డాను ? ఆ విషయం తెలిసేంత వరకు నేనీ గదిలో బందీగా వుండక తప్పదు. ఒక్కటి మాత్రం స్పష్టంగా తెలుస్తోంది. వాళ్ళకి నాతో ఏదో అవసరం వుంది. అదేమిటో వాళ్ళే చెప్పేదాకా వేచి వుండటం మాత్రమే నేను చేయగలిగింది.

ఎప్పుడు కునుకు పట్టిందో తెలీదు. టెలిఫోను మోతకి మెలకువ వచ్చింది. బద్ధకంగా లేచి రిసీవరందుకుని 'హలో' అన్నాను.

"మరో ముప్పై ఎనిమిది నిమిషాల్లో సత్యా మిమ్మల్ని కలుసుకుంటారు. ఇప్పుడు సమయం 4.22" అంది అవతలి కంఠం.

"నాకు ఆకలిగా వుంది. తినడాని కేమైనా తెప్పించండి"

"సరే"

ఐదు నిమిషాల్లో ఆ అమ్మాయి ఓ చిన్న చక్రాలబండిని నెట్టుకుంటూ లోపలి కొచ్చింది. దాని మీద ప్లేట్లలో పొగలు కక్కే వేడివేడి ఇడ్లీలు, సాంబారు, కొత్తి మెర చట్నీ, కొబ్బరి పచ్చడి, ఘుమ ఘుమలాడే కాఫీ... తెలుగు టిఫిన్ రుచి తగిలి ఎన్నో యుగాలైనట్టుగా ఆవు రావురుమంటూ ఆ డజన్ ఇడ్లీలన్నీ పావు గంటలో పూర్తి చేసి త్రేవుమంటూ త్రేన్చాను.

"చూడు పాపా! కొంచెం కాఫీ తాగుతావా?"

"వద్దు. మేం తాగకూడదు"

"ఇలా వచ్చి పక్కన కూర్చో" అన్నాను కాఫీ తాగటం పూర్తిచేసి.

సంకోచించకుండా వచ్చి నా పక్కన కూర్చుంది. ఆమె భుజాల మీద చేతులు వేసి దగ్గరకి తీసుకున్నాను. ఎటువంటి చలనమూ లేకుండా నా ముఖంలోకి చూస్తూ కూర్చుంది.

ఆమె మెడ కింద గుండెలకు పైభాగాన ముచ్చటగా కనిపించే పుట్టు మచ్చ వేపు చూస్తూ కూర్చున్నాను.

"ఇక్కడ మచ్చ చాలా బావుంది" అన్నాను. వేలితో మృదువుగా స్పృశిస్తూ "పుట్టు మచ్చేనా?"

ఆ అమ్మాయికి అర్థం కాలేదు.

"చిన్నప్పట్నించీ వుందా?"

"జ్ఞాపకం లేదు"

"మీకిరోజు సెలవు దినమేనా? నిన్ను ముద్దు పెట్టుకోవచ్చా?"

ఆ అమ్మాయి ఏదో చెప్పేలోగా తలుపు తెరుచుకుంది. బెరి లోపలికి ప్రవే శించాడు.

"సిద్ధంగా వున్నారా ? సత్యాని కలుసుకునేందుకు వెళదామా?" అన్నాడు వస్తూనే.

"ఒక్క నిమిషం. నిద్ర మత్తు వది లించుకుని వస్తాను" అంటూ బాత్రూం కేసి నడిచాను.

* * *

సుదీర్ఘమైన కారిడార్ గుండా నడు

స్తూంటే ఒకే రకమైన ఎన్నో గదులు కనిపించాయి. ఆ గదులన్నీ మూసి వున్నాయి. మూసిన ఆ తలుపుల కవతల ఎన్ని చిత్ర విచిత్రాలు దాగివున్నాయో! ఆలోచిస్తూ నడుస్తున్నాను. కారిడార్ చివరికి చేరుకున్నాము. లిఫ్టులో కిందికి దిగి మరో వరాండాలోంచి నడక. మళ్ళీ మరో లిఫ్టు. ఈ సారి లిఫ్టు కిందికి దిగుతోందో, పైకి వెళుతోందో తేల్చుకోలేక పోయాను. లిఫ్టు దిగి మళ్ళీ విశాలమైన వరాండాలోంచి నడక. వరాండా పొడవునా ఎన్నో మూసిన గదులు. చివరి గది ముందు ఆగాము. తలుపు మీద 2080 అంకె కనిపిస్తోంది. గది తలుపులు తెరుచుకున్నాయి.

"లోపలికి వెళ్ళండి" అన్నాడు బెరీ నా వేపుకి తిరిగి.

"నువ్వు ?" అడిగాను.

"ఇప్పుడు కాదు, మీరు వెళ్ళండి"

లోపలికి అడుగు పెట్టగానే గది తలుపు మూసుకుంది. ఆ గది గోడలు గాజుతో చేసినట్టుగా మెరిసిపోతున్నాయి. కాళ్ళకింద మెత్తగా పరచివున్న ఎర్రటి తివాచీ. విశాలమైన ఆ హాల్లోంచి లోపల మరికొన్ని గదులు కనిపిస్తున్నాయి. ఎడంవేపు గదినిండా పుస్తకాలు. లైబ్రరీలా వుంది. కుడివేపు గది ద్వారం మూసివుంది. ఎదురుగా వున్న గది తలుపులకు తెర వేలాడుతోంది. కమ్మని సువాసనతో హాలంతా నిండిపోయింది. "దయచేయండి"

ఉలిక్కిపడి చుట్టూ తిరిగి చూశాను. ఎవరూ కనిపించలేదు.

"తిన్నగా నడిచిరండి మిస్టర్ శర్మా! ఎదురుగా కనిపించే తెరని తొలగించుకుని రండి"




తెర తొలగించాను.మరో విశాలమైన గది.

ఆ గది మధ్యలో ఉన్న అయిదు సోఫాలూ చాలా ఖరీదైనవి.

ఆ గది మధ్య నిలబడి రెండు చేతులూ విప్పార్చి "రండి...రండి" అని ఆహ్వానిస్తూ ముందుకి అడుగులు వేస్తూ వచ్చాడు అతను.

నా భుజాలమీద చేతులు వేసి ఆప్యాయంగా నడిపించుకువెళ్ళి సోఫాలోకూర్చోబెట్టాడు.

ఆరడుగుల నిలువెత్తు గంభీరమైన విగ్రహం. విశాలమైన నుదురు. చురుకుగా తీక్షణంగా, లోతుకి చూస్తోన్నట్టున్న నేత్రాలు. పెదాలమీద చెరగని చిరునవ్వు. 30 నుంచి 55 లోపుగా ఎంతైనా వుండొచ్చు అతని వయస్సు.

అతని నిండైన విగ్రహం సరసన నేనెంతో చిన్నవాణ్నిగా ఫీలయ్యాను. తలెత్తి అతని ముఖంలోకి పరిశీలనగా చూశాను. సందేహంలేదు. విమానాశ్రయం నుంచి వస్తూ దారిలో నిలువెత్తు బాసర్ మీద నాకు కనిపించిన అదే ముఖం! అందరిలా అతనూ అదే లేత నీలం రంగు దుస్తులు వేసుకున్నాడు. ఛాతీమీద రెండు వృత్తాలకు మధ్య రూపాయి నాణెమంత పరిమాణంలో ఎర్రటి చుక్క.

"మిమ్మల్ని కలుసుకోవటం నాకెంతో సంతోషంగా వుంది శర్మగారూ" అంటూ అతనూ నా పక్కనే కూర్చున్నాడు.

"మీరేనా సత్యా అంటే?"

"అవును. విడిదిలో మీకు అన్నీ సౌకర్యంగా అమిరాయని తలుస్తాను. ఇబ్బందేమీ లేదు కదా?" అన్నాడు నా కళ్ళలోకి చూస్తూ.

"సౌకర్యాలకేమీ తక్కువలేదు లెండి" చిన్నగా నవ్వేడు సత్యా.

"మిమ్మల్ని బలాత్కారంగా మా ద్వీపానికి తీసుకురావలసినందుకు వేయి



క్షమాపణలు చెప్పుకుంటున్నాను. కారణం మీకెవరూ చెప్పలేదు కదూ"

"కారణం అడిగితే తన్నేంత పని చేశాదు"

గది గోడలు దద్దరిల్లేలా నవ్వేడు సత్యా. "మీవంటి వారితో ఎలా ప్రవర్తించటమో తెలీదు వాళ్ళకి. వాళ్ళని పట్టించుకోకండి శర్మా".

పట్టించుకుని మాత్రం నేను చెయ్యగలిగిందేముంది అని మనసులో అనుకుని "సరే ఇప్పుడు చెప్పండి. ఏమిటిదంతా? నన్నెందుకిక్కడికి తీసుకొచ్చారు" అడిగాను ఆవేశాన్ని అణుచుకుంటూ.

"చూడండి మిస్టర్ శర్మా! మా దగ్గర 2080 అనే ఒక కంప్యూటర్ వుంది. ఏదో చిన్న పొరపాటు జరిగినట్టుంది దానిలో. ఈమధ్య కొంచెం ఇబ్బంది పెడుతోంది. మీరు దాన్ని పరిశీలించి ఆ లోపాన్ని సరిదిద్దాలి. ఇదే మీరు మాకు చేయాల్సిన సహాయం".

మహదానందం కలిగినట్లయింది నాకు. నా ఆందోళనంతా ఎగిరిపోయింది. "ఓస్. ఇంతేనా" అనుకున్నాను మనసులో.

"ఇబ్బంది అన్నారు. ఏ రకమైన పొరపాట్లు జరుగుతున్నాయి కంప్యూటర్‌లో" అడిగాను ఆసక్తితో.

"కొన్ని సమయాల్లో చిన్న చిన్న తప్పులు చేస్తోంది కంప్యూటర్"

"దేనికోసం వుపయోగిస్తున్నారు మీ కంప్యూటర్‌ని ?"

"మా ద్వీపంలో జరిగే అన్ని కార్యక్రమాలనీ కంట్రోల్ చేసేది ఈ కంప్యూటరే"

"దాని జ్ఞాపకశక్తి ఎంతో చెప్పగలరా? అంటే కంప్యూటర్ మెమొరీ కెపాసిటీ గురించి"

"అన్ని వివరాలూ మీకివ్వబడతాయి"

"2080- ఏ సిరీసా?"

"అవును. డిజిటల్ ఎక్విప్‌మెంటు కార్పొరేషన్ వారి దగ్గర్నుంచి కొన్నాము. గ్యారంటీ పరిమితి తీరిపోయింది. అమెరికా నుంచి ఒక ఇంజనీరుని రప్పించాలనుకున్నాము. అప్పుడు గుర్తొచ్చింది మీ గురించి."

"నా సంగతి ఎలా తెలుసు మీకు? ఎవరు చెప్పారు?" అన్నాను ఆశ్చర్యపోతూ.

"దీన్ని ఇన్‌స్టాల్ చెయ్యడానికి వచ్చిన అమెరికన్ ఇంజనీరు చెప్పాడు మీ గురించి. కంప్యూటర్ పనిచేయటంలో ఏమైనా లోపాలు కనిపించినప్పుడు వెంటనే రిపేరు చెయ్యాలనుకుంటే మిమ్మల్ని పిలిపించి చూపొచ్చని".

కాసేపు ఆలోచించి అన్నాను. "ఒక వుత్తరం రాస్తే సరిపోయేది. మునిసిపాలిటీ వాళ్ళు కుక్కని బంధించి తెచ్చినట్టు ఇలా తరలించుకు రావటం..."

"మీకింకా కోపం పోయినట్టు లేదు. మీరన్నది నిజమే. కాని ఇందులో కొన్ని చిక్కులున్నాయి. ఈ ద్వీపం ఒక దేశం కాదు. రాజ్యం కాదు. ఇది నా సొంతం. నాకు చెందినది. ఈ ద్వీపం గురించి మీలో చాలామందికి తెలీదు. మీదేశంలోని బురోక్రసీ గురించి, రెడ్ టేపిజం గురించి నేను చాలా విని వున్నాను. మీకు వుత్తరం రాసి, మీరు మీ అధికారవర్గాల అనుమతి పొంది, వాళ్ళు మిమ్మల్ని లక్ష యక్షప్రశ్నలడిగి ఇవన్నీ అయ్యేసరికి కాలాతీతం కావచ్చు. అందుకే ఇలా చేయాల్సి వచ్చింది. క్రమంగా మీకే అర్థం అవు

 

తుంది. చూస్తూ వుండండి" అని నుదుటి మీది క్రాపుని చేత్తో పైకెగదోసుకున్నాడు సత్యా.

"ఈ కంప్యూటర్‌ని బాగుచేశాక నేను మా వూరికి వెళ్ళిపోవచ్చా?"

"ఓ... తప్పకుండా"

"ఎప్పుడు ప్రారంభించమంటారు?"

"ఎప్పుడైనా సరే. రేపు వుదయం ప్రారంభించండి"

"అవసరం లేదు. ఇప్పుడే పని ప్రారంభిస్తాను" అంటూ లేవబోయాను.

"కూర్చోండి శర్మా! ఇప్పుడు వీలు పడదు. తరగతులు జరుగుతున్నాయి. ఓ అర్థగంట ఆగి వెళ్ళండి."

మౌనంగా ఆలోచిస్తున్నాను. 2080 మోడల్ కంప్యూటర్ నాకు కొత్తదేమీ కాదు. ఇదివరకు ఒక విదేశీ సంస్థలో నేను ఇటువంటి కంప్యూటర్లని అసెంబుల్ చెయ్యటం, ఆపరేట్ చెయ్యటం జరిగింది. ఆ అనుభవంతో దీన్ని రిపేర్ చేసిపెట్టడం నాకు అసాధ్యమేమీ కాదు. మూడురోజులు చాలు నాకు. శుక్రవారం మద్రాసు వెళ్ళిపోవచ్చు.

"మిమ్మల్ని కొన్ని ప్రశ్నలడగొచ్చా!"

"అడగండి శర్మా" అన్నాడు సత్యా సోఫాలో సర్దుకు కూర్చుంటూ.

"మీ ద్వీపానికి రాజు లాంటివారా?"

మెల్లగా నవ్వేడు సత్యా.

"ఈ వూరికి సర్వాధికారి 2080"

"మరి మీరు?"

"ఈ దీనికి సొంతదారుణ్ణి. అంతే. మా టెలివిజన్‌లో ఈ ద్వీపాన్ని పరిచయం చేసే ప్రోగ్రాము రికార్డు చేసి ఉంచాము. కాని మీరు దాని సొంతం వినకుండానే ఆపేశారు. మా ద్వీపాన్ని గురించి తెలుసుకోవటంకన్న మహారాజపురం అయ్యర్ సంగీతమే మీకు ఎక్కువ ఇష్టం లాగుంది"

అన్నాడు సత్యా నన్ను చూసి నవ్వుతూ.

ఆశ్చర్యపోతూ అతనికేసి చూశాను.

"మీకెలా తెలును ఇదంతా"

అతను లేచి వెళ్ళి గోడకు అమర్చిన ఒక అల్మేరా తలుపు తెరిచాడు. లోపల ఒక టెలివిజన్ స్క్రీన్ కనిపించింది. మీట నొక్కాడు. చిత్రం!-

"ఇదా నా భోజనం?"

"ఆహారం" చెప్పిందా అమ్మాయి.

"మాంసాహారమా?"

అర్థంకాలేదా పాపకి. ఉప్పూ కారం లేని ఆ పదార్థాలు తినలేక పోతున్నాను-

మైగాడ్! నేను గదిలో మధ్యాహ్నం చేసిందంతా టెలివిజన్‌లో కనిపిస్తోంది!

"ఈ వూళ్ళో ఏకాంతం అన్నదే లేదా?"

"కొన్నిచోట్ల, కొన్ని సందర్భాల్లో వుండదు" తాపీగా జవాబిచ్చాడు సత్యా.

ఇక వుండబట్టలేకపోయాను.

"మీ కెవరికీ సిగ్గు, లజ్జ అనే వాటి గురించి తెలీదనుకుంటాను. ప్రతి మనిషికీ ఏకాంతం, కొంత ప్రైవసీ అవసరం. వ్యక్తి ప్రాథమిక అవసరాలు అవి. నా ప్రతి చర్యనూ మీరు రికార్డు చేసి టెలివిజన్ మీదికెక్కించడం బాత్రూం తలుపు సందుల్లోంచి చూడటం కన్నా సిగ్గుపడాల్సిన విషయం"

"శర్మా! సిగ్గు, లజ్జ, బిడియం లాంటివి మీ పరిభాషలోని పదాలు. మా భాషలో ఈ పదాలే లేవు. మా ద్వీపం గురించి, ఇక్కడి సామాజిక వ్యవస్థ గురించి తెలుసుకోవాలనే జిజ్ఞాస మీకింకా కలగలేదు. అంచేత మీరిలా అభిప్రాయ పడటం సహజమే. చిన్నప్పట్నుంచి సిగ్గు,

లజ్జ, బిడియం అన్నవి మీ రక్తంలో, పెంపకంలో జీర్ణించుకు పోయిన మానసిక ప్రవృత్తులు."

అతను లేచి వెళ్ళి టేబుల్ మీదున్న ఇంటర్‌కాం మీట నొక్కాడు. "లతా! ఒకసారిలా రా" అన్నాడు.

ఎడంవేపు గోడకున్న గాజు తలుపు తెరుచుకుంది. అప్సరసలాంటి అమ్మాయి గది లోపలికి ప్రవేశించింది. పంథొమ్మిదేళ్ళుండొచ్చు. చక్కని ఒంపులు తిరిగిన శరీరం. అమాయకంగా కనిపించే పసిపాప లాంటి అందమైన ముఖం. నన్నామెకి పరిచయం చేశాడు. ఆ ముఖంలో ఏ రకమైన చలనమూ లేదు.

"మిస్టర్ శర్మా. ఈమెను చూడండి. ఈమెకు సిగ్గంటే ఏమిటో బోధించకుండా పెంచబడింది. చూస్తూ వుండండి. లతా! ఆ షర్టు తీసేసి నడుం దాకా నగ్నంగా నిలబడు"అన్నాడు. సత్యా. స్నానానికి వెళ్ళేముందు బనీను విప్పేసినంత తేలిగ్గా. అంత సహజంగా గుండెల మీది ఆచ్ఛాదన తీసేసి అర్ధనగ్నంగా నిలబడింది ఆ



అమ్మాయి లత.

"శర్మా చాలా, ఇంకా పూర్తిగా తీసేయమంటారా?'' అన్నాడు సత్యా నాకేసి నవ్వుతూ చూసి.

"చాలు. స్త్రీలని సర్కస్ జంతువుల్లా చాలా తెలివిగా ఉపయోగిస్తున్నారు. వాళ్ళ సహజ ప్రవృత్తుల్ని సమూలంగా ధ్వంసం చేసినట్టుంది మీరు. ఒక్కమాట డుగుతాను. ఈ అమ్మాయి స్థానంలో మీ తల్లో, చెల్లెలో వుంటే మీరిలాగే ప్రవర్తించగలరా?"

"మిస్టర్ శర్మా. మా ద్వీపాన్ని గురించి మీరు చాలా తెలుసుకోవలసి వుంది. ఇక్కడ మాకు తల్లీ, చెల్లీ, తండ్రీ, తమ్ముడూ అనే మాటలకూ, ఆ అనుబంధ బంధవ్యాలకూ తావులేదు. మా ప్రజలు ఈ వావి వరుసలకు, అవి కలిగించే స్వార్థచింతనకూ, ఆవేశకావేషాలకూ అతీతులు."

అదిరిపడ్డాను ఆ మాటలకు. వీళ్ళంతా మనుషలు కారనిపించింది.

"ప్లేటో వూహించిన 'ఉటోపియానా మీ రాజ్యం" అన్నాను కసిగా.

"మీరెలా అయినా అనుకోండి"

మీరంతా పిచ్చివాళ్ళు. మీది పిచ్చివాళ్ళ స్వర్గం. మీరెలాగైనా ఏడ్వండి అని మనసులో అనుకుని "సరే! మీ సొంత విషయాలతో నాకేమిటి గాని ఆ కంప్యూటరెక్కడో చూపించండి; మీరు చెప్పిన పని పూర్తి చేసి వెళతాను" అన్నాను. చివరి మాటలంటున్నప్పుడు 'వాళ్ల చెప్పింది చెయ్యకు' అన్న ఆ టెలిఫోను అజ్ఞాత వ్యక్తి హెచ్చరిక మనసులో కదిలింది. ఈ సంగతి సత్యాకు తెలుసా? తెలిసీ తెలియనట్టు నటిస్తున్నాడా? ఏమో అంతా అయోమయంగా వుంది.

"చూడండి శర్మా! మీరింతవరకూ మా ద్వీపం గురించి తెలుసుకున్నది చాలా స్వల్పం. ఈ విషయాల్ని మాత్రం దృష్టిలో వుంచుకుని ఒక నిర్ణయానికి రావటం సబబు కాదు. ఇక్కడి సామాజిక జీవిత విధానం గురించి మీరు పూర్తిగా తెలుసుకోవాలి. ఈ రాత్రికి మీరు నాతో భోజనం చేయండి. మా ద్వీపం గురించి వివరంగా చెపుతాను. మీకిష్టమైన భరత నాట్యం కూడా ఏర్పాటు చేయిస్తాను. వస్తారు కదూ" అన్నాడు సత్యా.

"చూస్తాను. ముందు కంప్యూటర్ ఎక్కడుందో చూపించండి. నా పని ప్రారంభిస్తాను '' అన్నాను సోఫాలోంచి లేస్తూ.

''లతా'' పిలిచాడు ఇంటర్‌కాంలో.

ఆ అమ్మాయి గదిలోకొచ్చింది.

"వీరిని 2080 దగ్గరికి తీసికెళ్లు. వుంటాను మిస్టర్ శర్మా. మళ్ళీ కలుసుకుందాం" అని నా చేతిని నొక్కి లోపలికి వెళ్ళిపోయాడు సత్యా.

గదిలోంచి హాలుదాటి వరండాలోకొచ్చాము నేనూ, ఆ అమ్మాయి. ముందు నడుస్తోంది ఆమె. లిఫ్టు దగ్గర ఆగకుండా ఇంకా ముందుకి నడిచింది. వరండా చివర ఆగి తలుపు తెరుచుకుని ఒక గదిలోకి దూరి రమ్మన్నట్టు నాకేసి చూసి సైగ చేసింది. సందేహిస్తూనే ఆమె వెనుక లోపలికి నడిచాను. అదొక అందమైన బాత్రూం!

"ఏమిటిది ?" అన్నాను ఆమెకేసి ప్రశ్నార్థకంగా. మరబొమ్మలాంటి ఆమె చటుక్కున చైతన్యం పుంజుకుని 'మనిషి'లా మాట్లాడింది.

"మెల్లగా మాట్లాడండి. ఇక్కడ

మాత్రమే టి.వి, మైక్రోఫోనుల్లాంటి వేమీ లేవు. ఈ రాత్రి సత్యా ఇచ్చే విందుకి తప్పకుండా రండి. ఆ తరువాత మీతో రహస్యంగా కొన్ని విషయాలు మాట్లాడాలి."

నిశ్శాంతగా పోతూ విన్నాను ఆమె చెప్పింది.

బాత్‌రూంలోంచి బయటకురాగానే తిరిగి మామూలు మర మనిషిగా మారిపోయింది లత. అర్ధగంట క్రితం అడిగిందే తడవుగా నగ్నంగా దర్శన మివ్వటానికి సిద్ధమైన మరబొమ్మకీ, ఇప్పుడు బాత్రూములో నా నా చెవి దగ్గరకు వంగి రహస్యంగా మాట్లాడిన మనిషికీ ఎంత తేడా!

ఆమెలో ఏదో ప్రత్యేకత వుందనీ, ఏదో సంఘర్షణ దాగి వుందనీ అనిపించింది నాకు.

మరబొమ్మలా మౌనంగా నా ముందు నడుస్తూ కంప్యూటర్ వున్న గది దగ్గరకు నడిపించుకు వెళ్ళింది. గది తలుపులు తెరిచి ద్వారపాలకుల్లా నిలబడి వున్నారు ఇద్దరు. నాతో కరచాలనం చేసి యాంత్రికమైన చిరునవ్వులు నవ్వారు.

"నా పేరు ధీర. ఈ కంప్యూటర్ నా ఆధీనంలోనే వుంటుంది" అన్నాడు వారిలో ఒకతను.

"లతా! ఇక నువ్వు వెళ్ళొచ్చు" అన్నాడు.

అంతలో మళ్ళీ "ఒక్క నిమిషం" అని పిలిచాడు. వెనక్కి తిరిగి అతని కేసి చూసింది లత.

"ఈ రాత్రికి వస్తావు కదూ?" అడిగాడు

"వీలు పడదు. ఈ రాత్రికి విందుకి వెళుతున్నాను" అంది లత.



"పోనీ, రేపు ?"

"రేపు నా వంతు ?" అని అంసుకున్నాడు ధీరుని శిష్యుడు.

"కంప్యూటర్‌ని చూద్దామా?" అన్నాను వాళ్ళ సంభాషణకి అడ్డుపడి.

"రండి, రండి" అంటూ కంప్యూటర్ దగ్గరికి తీసుకెళ్ళారు ఆ ఇద్దరూ నన్ను. ధీర అనబడే అతనికి నలభై యేళ్ళుంటాయి. మంచి దృఢంగా, ఆరోగ్యంగా వున్నాడు. కళ్ళు మాత్రం పిల్లి కళ్ళవలె నీలంగా వున్నాయి. అందరిలాగే లేత నీలిరంగు దుస్తులు వేసుకున్నాడు. ఓ వరాల్ కోటు మీద వలయం లోపలి వలయంలో ఎర్ర చుక్క కనిపిస్తోంది.

"ఇంజనీరువా ?" అడిగాను కంప్యూటర్‌ని పరికిస్తూ.

"అవును" అన్నాడు.

ఆ మోడల్ నాకు కొంత కొత్తగానే అనిపించింది. నాకు అంతగా పరిచయం లేని కొన్ని యూనిట్లు ఈ కంప్యూటర్‌కి వున్నాయని గ్రహించాను. అయినా కంప్యూటర్‌ని సొంతం పరిశోధిస్తే సరి చెయ్యగలననే నమ్మకం కూడా కలిగింది.

"కొత్తగా ఒక మెమో చేర్చి వున్నాము ఇందులో" అన్నాడు ధీర.

"ఈ కంప్యూటర్‌ని దేని కోసం వుపయోగిస్తున్నారు ?"

"ఈ ద్వీపంలో జరిగే దైనందిన కార్యక్రమాలన్నీ ఈ కంప్యూటర్ పంపే ఆజ్ఞల ద్వారానే నడుస్తున్నాయి"

"అంటే?"

"చూడండి" అంటూ ముందుకి వంగి టెలిటైప్‌ని చూపించాడు. అదొక హైస్పీడు టెలిటైపు. అమిత వేగంతో టైపు చేసుకుపోతోంది.

"టేప్ పంచ్ వుపయోగించటం లేదా మీరు ?"

''ఎందుకులేదు? వుంది"

"ఏమిటి టెపు చేస్తోందిప్పుడు?''

"చూడండి" అని రిబ్బనులా పైకి జరుగుతోన్న కాయితంలోంచి కొంత భాగం తుంచి నాచేతికిచ్చాడు అతను. అందులో తెలుగక్షరాల్లాగే వున్నాయి. అయినా అర్థం కావటంలేదు నాకు.

...సవొరంగంలవొ ఇఇ రవొజవు వుతపతితి...

"ఏమిటిది? తెలుగేనా?" అడిగాను తెల్లబోతూ.

''అవును. కాని మీరు వాడే భాషలాంటిది కాదు. మాకు మేమై సంస్కరించుకున్న తెలుగు భాష ఇది''

"ఈ వాక్యానికి అర్థమేమిటి?'' అన్నాను.

చిన్నప్పుడు చిన్న పిల్లలతో నేను కలిసి ఆడుకున్న 'క' భాష ఆట గుర్తొచ్చింది.

'"సౌరంగంలో ఈరోజు వుత్పత్తి' అని చదువుకోవాలి" అన్నాడు ధీర సగర్వంగా.

"ఈ సంస్కరణవల్ల మీరు సాధించిందేమిటి?"

"చాలా వుంది. ప్రతి ఒక్కరూ అతి తక్కువ కాలంలో భాష నేర్చుకోవటానికి సులభంగా వీలవుతుంది. అనవసరమైన దీర్ఘాలు, వొత్తులు, సంయుక్తాక్షరాలు - వీటి బెడద వుండదు మా లిపిలో. అక్షరాల సంఖ్య చాలా వరకు కుదించడం జరిగింది. వుదాహరణకు 'కాకి' అనే పదాన్ని రాయటానికి కకు దీర్ఘమిస్తే కా, కాకి గుడిస్తే కిలాంటివి బట్టీ పెట్టనవసరం లేదు మా బడి పిల్లలు. క ఆ క ఇ 'కాకి' అవుతుంది మా పద్ధతిలో. మీకిప్పుడిది గందరగోళంగా వుండొచ్చు. కాని మా పిల్లలు సులభంగానే అలవాటు పడ్డారు ఈ నూతన లిపి సంస్కరణలకి"

వింత మనుషులు, వింత ఆలోచనలు అనుకున్నాను నాలో.

"సరే. ఇంతకీ ఈ కంప్యూటర్‌లోని లోపమేమిటో, ఇది పనిచేసే విధానంలో జరిగే పొరపాట్లేమిటో చెప్పనే లేదు" అన్నాను కొంచెం విసుగుతో.

"తొందర పడకండి. ప్రొసెసర్‌లో ఏదో పొరపాటు జరిగి వుంటుందని భావిస్తున్నాము. ఎంత ప్రయత్నించినా కని పెట్టలేకపోయాము"

"అసలేం జరిగింది. కంప్యూటర్ ఫంక్షనింగ్‌లో జరిగిన పొరపాట్లెటువంటివి చెప్పండి"

"కొన్ని సందర్భాల్లో పొరపాటుగా సమాచారాన్ని అందివ్వటం జరిగింది ఈ కంప్యూటరు. రోజుల తరబడి సరిగ్గానే పని చేస్తుంది. ఉన్నట్టుండి అజ్ఞలివ్వటంలో, ఆదేశాలు జారీ చేయటంలో పొరపాట్లు చేస్తోంది. ఉదాహరణకు పోయిన వారంలో కడపటి దినం నలుగురు జన్మించారు ఈ ద్వీపంలో. దాని ప్రకారం ఆ రోజు నలుగురు మరణించాల్సి వుంది. కాని మరణించ వలసింది ఒక్కరే అని ఆదేశమిచ్చింది. ఆదేశం ప్రకారం ఆ దినం ఒక వ్యక్తి మాత్రమే చంపబడ్డాడు. ఆ తరువాత జనాభా లెక్కలు సరి చూసుకున్నప్పుడు ముగ్గురెక్కువగా వున్నారని తెలిసింది మాకు"

"ఏమిటి నువ్వనేది" అన్నాను నివ్వెరపోతూ.

"అవును. నలుగురికి బదులు ఒక వ్యక్తి మాత్రమే చంపబడ్డాడు"

"ఇక్కడ మీరు మనుషుల్ని చంపుతారా?" అన్నాను నమ్మలేక. లోపలెక్కడో సన్నగా వొణుకులాంటిది కలిగింది నాకు.

"ఎందుకలా ఆశ్చర్యపోతున్నారు? సత్యా మీతో చెప్పలేదా? మా ద్వీపంలో జనాభా నియంత్రణ చాలా సక్రమమైన రీతిలో అమలు జరుపుతున్నాము. యాభై నాలుగు సంవత్సరాలు నిండిన ప్రతి ఒక్కరూ ఇక్కడ మరణించవలసిందే. అది వాళ్ళ జన్మహక్కు."

'కాదు, చావు హక్కు' అనుకున్నాను మనసులో.

"చంపడమంటే ఆవుల్నీ, మేకల్నీ అమ్మోరికి బలి ఇచ్చినట్టుగానా?"

అతనికి నా మాటలు అర్థం కాలేదులా వుంది.

"అంటే ఎలా చంపుతారు? తల నరికేస్తారా లేక వురి తీస్తారా?"

"కాదు. ఆ ముందు రోజు రాత్రి సరిగ్గా పన్నెండు గంటలకి యాభైనాలుగు సంవత్సరాలు పూర్తయిన మనిషిని శాంతి దళం మనుషులు వచ్చి ఎక్కడికో తీసుకెడతారు. అంతే! తెల్లారితే ఆ మనిషి ఈ గడ్డ మీద మరి కనిపించడు. మరణిస్తున్నప్పుడు చీమ కుట్టినట్టయినా వుండదు అంటారు. నేనెప్పుడూ చూళ్ళేదు. అలా మరణించిన వారి కార్డు మా లెఖ్ఖల్లోంచి తొలగించబడుతుంది. ఈ జనాభా నియంత్రణ కార్యక్రమం నిర్వహించటానికని ఈకంప్యూటర్‌లో ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటై వుంది" అని కాసేపు ఏదో ఆలోచించి తర్వాత చిన్నగా నవ్వి అన్నాడు ధీర– "నా వంతు రావడానికింకా పన్నెండు సంవత్సరాలుంది"

పిశ్ళు మనుషులో, మరలో, రాక్షసులో అర్థం కావటం లేదు. స్వర్గ ద్వీపమా ఇది లేక రాక్షస నగరమా అనిపించింది.

"ఇటువంటి పొరబాట్లు ఏమైనా ఇతర ప్రోగ్రాముల్లో కూడా జరుగుతున్నాయా?" అడిగాను.

"ఏమో ఇంకా తెలీలేదు. ఇప్పటి దాకా మా దృష్టికి వచ్చింది నేను చెప్పిన పొరపాటు మాత్రమే".

"టెస్టింగ్ ఎక్విప్‌మెంటుందా ఇక్కడ?"

"అన్నీ వున్నాయి"

"డి బగ్గింగ్ ప్రోగ్రాము?"

"అది కూడా వేసి చూశాము. ఎక్కడా పొరపాటు కనిపించలేదు మాకు"

కాసేపు మౌనంగా ఆలోచించాను.

"దీనికి సంబంధించిన లిటరేచరుందా మీ దగ్గర?"

"వుంది."

"అయితే ఆ పుస్తకాన్ని నా గదికి పంపండి. ఈ రాత్రికి చదివి ఈ కంప్యూటర్ మెకానిజం క్షుణ్ణంగా అర్థం చేసుకోవాలి ముందు. రేపు కంప్యూటర్‌ని పూర్తిగా పరిశోధించాలి"

"అలాగే మీ ఇష్టం"

"ఇప్పుడు నేను నా గదికి వెళ్ళొచ్చా?"

అతను గడియారం కేసి చూశాడు.

"మరో అయిదు నిమిషాల్లో బెరి ఇక్కడికొస్తాడు. అతనితో కలిసి వెళ్ళండి"

కంప్యూటర్‌లోంచి బెలిదెపు కాయితం తెరలు తెరలుగా పైకి వస్తోంది. కొంచెం ముందుకి వంగి చూశాను–

–పవుట టవుక అయిదవు...

00332675...

"ఏమిటిది? చదువు" అన్నాను.





"పుట్టుక అయిదు. నిన్న మా జనన కేంద్రంలో పుట్టిన మగ శిశువుల వివరాలు; బరువు, సంఖ్య మొదలైన వాటిని తెలుపుతోంది"

జనన కేంద్రం! మెటర్నిటీ హాస్పిటల్ వంటిది కాబోలు. దానికి అతను వుపయోగించిన పదానికి మరేదో గుర్తొచ్చి పక్కున నవ్వాను.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"ఏమీలేదు. మీ జనన కేంద్రం ఎలా వుంటుందోనని వూహించాను"

"వీలైతే మీరొకసారి వెళ్ళి చూడొచ్చు. సత్యాకి చెపితే ఏర్పాటు చేస్తారు. మా ద్వీపంలోని జననాలన్నీ అక్కడే జరిగేది"

"బిడ్డల్ని కనడానికూ్కడా మెషీన్ల లాంటివేమైనా ఏర్పాటు చేసి వుంచారా?"

"అటువంటిదేమీ లేదు. స్త్రీలే కంటున్నారు. కన్న వారం రోజుల్లో బిడ్డల్ని వదిలి వచ్చేస్తారు" అన్నాడు ధీర



సీరియస్‌గా.

"అయితే మరి ఆ పసిబిడ్డల గతి?"

"వాళ్ళు ఈ ద్వీపం బిడ్డలు. వాళ్ళ సంరక్షణ బాధ్యత మాది"

నాకు కళ్లు తిరుగుతున్నాయి. కుర్చీలో వెనక్కివాలి కూలబడ్డాను. బెరి వచ్చి నన్ను ఆ గదిలోంచి తీసుకు వెళ్ళాడు. కొంత దూరం మౌనంగా అతనితో నడిచాను.

"ఎక్కడికి?" అడిగాను.

"మీ గదికి" అన్నాడు బెరి.

"వెళ్ళి?"

"మళ్ళీ రాత్రి మిమ్మల్ని విందుకి తీసుకెళ్ళడానికి మీగదికొస్తాను. అందాకా గదిలో విశ్రాంతి తీసుకోండి"

"నేనిప్పుడు గదికి రాను. అలా వూరి బయట తిరిగి రావాలని వుంది నాకు. మీ గదులు నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. కొంత దూరం అలా నడుస్తూ ప్రశాంతమైన గాలి పీల్చుకోవాలని వుంది నాకు" అన్నాను మొండిగా.

"ఈ చీకట్లోనా?"

"ఇంకా చీకటి పళ్ళేదు. గంట ఆరే"

"రేపు మిమ్మల్ని షికారు తీసుకు వెళ్ళడానికి ఏర్పాటు చేయిస్తాను. ఇప్పుడు కాదు"

"కాదు ఇప్పుడే. ఈ క్షణమే వెళ్ళాలి నేను"

"క్షమించండి. వీల్లేదు"

"అయితే నీతో గదికి రావటానికి కూడా వీల్లేదు" నేను మరింత మొండిగా జవాబిచ్చాను.

"చూడండి శర్మా. ఇప్పుడు మీరు వూళ్ళో కెళ్ళినా ఏమీ చూడలేరు. ఇది మీ నగరాలవంటిది కాదు. ఇక్కడ అంగళ్ళూ లేవు. హోటళ్ళు లేవు. సినిమాలు లేవు. నైటు క్లబ్బులు లేవు. గుళ్ళూ, గోపురాలూ లేవు. భజన మందిరాలూ, బాబాల ఉపన్యాసాలూలేవు. ఏం చూడాలనుకుంటున్నారు? అసలు వీధుల్లో జనసంచారమే వుండదు. అంతా వారివారి గదుల్లో టెలివిజన్ చూస్తూనో, వ్యాయామం చేస్తూనో, ఒకరినొకరు చూసుకుంటూనో వుంటారు".

"సరే అయితే వెళ్ళి మీ సత్యాతో చెప్పు. ఈ రాత్రి విందుకి నేను రావటం లేదని"

"మీ కోసం ప్రత్యేకమైన ఏర్పాట్లు చేసి వుంచారు సత్యా" అన్నాడు బెరి నా కేసి వింతగా చూస్తూ.

"తగలేసుకోండి మీ ఏర్పాట్లని. నేను రావటం లేదు"

నాలో ఏదో మొండి ధైర్యం ప్రవేశించింది.

"ఏం? ఎందుకని?" కరకుగా ప్రశ్నించాడు బెరి.

"ఎందుకు? నేనడగాల్సిన ప్రశ్న అది మిమ్మల్ని చూసి. మీరంతా కీ ఇచ్చిన బొమ్మల్లా, సర్కస్ జంతువుల్లా ప్రవర్తిస్తున్నారెందుకని? మీ కందరికీ మనుషుల్లా ప్రవర్తించటం చేతకావటం లేదెందుకని?"

"శర్మా! ఇక్కడెవరూ ఈ ప్రశ్న లడగరు"

"ఏం?"

"అడగటం వాళ్ళకు తెలీదు గనుక"

"నాకు తెలుసు. నేనింకా మనిషిగానే వున్నాను. సమాధానం చెప్పు".

"సమాధానం మీకు సత్యా చెబుతారు. విందుకి రండి"

"సత్యా...సత్యా...సత్యా... ప్రతి

దానికీ సత్యాయే అయితే మీరంతా ఎందుకిక్కడ ?" కోపంగా అరిచాను. నాకు జుట్టు పీక్కోవాలనిపిస్తోంది.

"మీ గది వచ్చేసింది. లోపలికి వెళ్ళి బాగా విశ్రాంతి తీసుకోండి" అంటూ గది తలుపు తెరిచి పట్టుకున్నాడు బెరి.

"మళ్ళీ రాత్రికి విందులో కలుస్తాం"

"నేను రావటం లేదు"

"కాదు. మీరు వస్తున్నారు" అని లోపలికి నెట్టాడు బెరి నన్ను. తలుపు మూసుకుంది.




నేనా విందుకి వెళ్ళడానికి ముఖ్యమైన కారణం ఆ అమ్మాయి లతని కలసుకోవాలని. ఆమె చెపుతానన్న ఆ రహస్యమేదో తెలుసుకోవాలని. పోయిన వారంలో నాలుగు సినిమాలు చూడాల్సింది. కాని ఒక్కటి మాత్రమే చూడగలిగాను 'అన్నంత తేలిగ్గా నలుగుర్ని చంపటానికి బదులు ఒక్కర్ని మాత్రమే చంపగలిగాము' అని ధీర చెప్పటం నాకిప్పటికీ ఏదో భీతిని కలిగిస్తోనే వుంది. నేనేదో వింతయిన విషవలయంలో చిక్కుకున్నట్టుగా ఫీలవుతున్నాను.

సరిగ్గా ఏడున్నరకు వచ్చారు వాళ్ళు నాకోసం. పదిహేనంతస్తులూ దిగి కారులో కూర్చున్నాము. వీధులన్నీ నిశ్శబ్దంగానూ, నిర్మానుష్యంగానూ అవుపిస్తున్నాయి. సముద్రపుగాలి ఒంటికి చల్లగా తగుల్తోంది. అద్దాల మేడవంటి ఒక అందమైన భవనంముందు ఆగింది కారు. లోపల కోలాహలం బయటికి వినిపిస్తోంది. ఆ విశాలమైన హాల్లో అన్నిరకాల అధునాతనమైన సౌకర్యాలూ వున్నాయి. హాలుమధ్యలో ఒక పెద్ద డైనింగ్ టేబిలు సుమారు పాతిక మంది కూర్చుని భోంచేయడానికి వీలుగా. దాని మీద రకరకాల ఆహారపదార్థాలు, ఖరీదైన పానీయాలు. పూల కూజాలు. మందంగా వెలిగే షాండిలియర్ దీపాలు. నేను హాల్లోకి ప్రవేశించడంతోటే సత్యా చుట్టూ మూగి వున్న ఆ పదిహేను మంది లేచినిలబడ్డారు. సత్యా లేచి వచ్చి ఆప్యాయంగా నాభుజాల మీద చేతులేసి సాదరంగా ఆహ్వానించాడు. టేబిల్ మధ్యలో వున్న కుర్చీలో కూర్చుండబెట్టాడు. హాల్లో లత కోసం వెదికాయి నా కళ్ళు. అదుగో ఆ చివర కూర్చుని ఏదో దీర్ఘాలోచనలో వుంది. నన్ను గమనిస్తున్నట్టులేదు. నా పక్కన టేబిల్ చుట్టూ ఆసీనులై వున్న మర బొమ్మల్లాంటి మనుషుల్ని పరికించాను. అంతా ఒకేరకమైన దుస్తులు ధరించి వున్నారు. వాళ్ళ ఛాతీమీద నేనిదివరకు చూసిన వలయంలోని వలయం ముద్రించబడి వుండటం గమనించాను.

"ఈ సున్నాలోని సున్నకి అర్థమేమిటో తెలుసుకోవచ్చా?" అడిగాను. సత్యా కేసిచూసి నవ్వటానికి ప్రయత్నిస్తూ.

"వీళ్ళంతా మా పరిపాలనలోని వివిధ శాఖలకి చెందిన ప్రధానాధికారులు. మొత్తం పదహారుగురు. నిన్న ఒకరు మరణించారు" అన్నాడు సత్యా.

"మీరు వీళ్ళందరికీ తలమానికమను

కుంటాను" అన్నాను సత్యా ఛాతీమీది సున్నాలోపలి సున్నాలోని ఆ ఎర్రని కేంద్ర బిందువుని చూస్తూ. ''అవును'' అంటూ వంపులు తిరిగిన గ్లాసుని నా ముందుకి నెట్టాడు సత్యా. అందులోని ద్రవం బంగారు రంగులో అందంగా మెరిసింది.

"క్షమించాలి.నేను తాగను"అన్నాను.

"మాకు తెలుసు. తీసుకోండి ఇది మధువుకాదు"

సందేహిస్తూ చప్పరించాను. ఆపిల్ జూస్‌లా వుంది నేను చప్పరించడం చూసి తక్కిన వాళ్ళంతా తమతమ గ్లాసులు చేతికి తీసుకున్నారు.

"వీరు మిస్టర్ శర్మ. నేడు మన అతిథి. ముఖ్య అతిథి" అని పరిచయం చేశాడు సత్యా. అంతా ఒకేసారి కోరస్‌లో ''మిమ్మల్ని కలుసుకోడం మాకు చాలా సంతోషంగా వుంది" అన్నారు.

''శర్మగారి గౌరవార్థం ఈ విందు



ఏర్పాటు చేయటం జరిగింది. శర్మగారు కంప్యూటర్ నిపుణులు. మన 2080ని సరి చేయటానికి మనం వారిని పిలిపించు కున్నాం. వారికి అన్నివిధాల మనం సహాయపడాలి. వారు మన ద్వీపానికి కొత్త. అంచేత మన వ్యవస్థ పట్ల వారికి కొన్ని అపార్థాలు, అపోహలు వుండటం సహజం. వారు కోపగించుకున్నా, విసుక్కున్నా మనం సహనం కోల్పో కుండా కంప్యూటర్‌ని సరిచేయటంలో వారు కోరిన అన్ని వివరాలూ,పనిముట్లూ అందివ్వటం మన కర్తవ్యం"

అంతా ఒకసారి చప్పట్లు కొట్టి తమ ఆనందాన్ని వ్యక్తం చేశారు.

"ఇప్పుడు శర్మగారు మాట్లాడుతారు" అని కూర్చున్నాడు సత్యా. మళ్ళీ కరతాళ ధ్వనులు.

నేను లేచి నిలబడ్డాను అయిష్టంగానే.

"వందనం. నాకు ఇలా పదిమంది ముందూ మాట్లాడ్డం చేతకాదు. అలవాటు లేదు. నేనీ ద్వీపానికి కొత్తవాడిని. నాకు కంప్యూటర్లని రిపేరు చెయ్యడం వచ్చు. అందుకని నన్నిక్కడికి...బం...తీసుకు వచ్చారు. కంప్యూటర్‌ని సరిచెయ్యడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. నమస్తే" అని నాలుగు మాటలు చెప్పి కూర్చున్నాను. మళ్ళీ చప్పట్లు.

సత్యా నాకు దగ్గరగా వంగి అన్నాడు-

"మీరు కంప్యూటర్ గదిలో మా వాళ్ళని అడిగిన ప్రశ్నలు నేను విన్నాను. మీ కాశ్చర్యంగా వుంది కదూ"

"నేను టిఫిన్ తినడాన్ని సైతం రికార్డు చేసిన మీరు నా ప్రశ్నల్ని వినడంలో ఆశ్చర్యం లేదు" అన్నాను సూప్‌ని చెంచాతో కలియబెడుతూ.

"ఆ ప్రశ్నలు నన్నే అడగాల్సింది మీరు" అన్నాడు సత్యా గ్లాసులో ద్రవాన్ని ఖాళీ చేసి.

"ఇప్పుడడుగుతున్నాను చెప్పండి. మనుషుల్ని అకారణంగా మీరెందుకు చంపుతున్నారు?"

"అకారణంగా అనకండి. మీరు టూత్ పేస్టు ఉపయోగిస్తారా ?"

"అయితే"

"టూత్ పేస్టంతా అయిపోయాక ఖాళీ ట్యూబుని ఏం చేస్తారు?"

"కాని వీళ్ళు మనుషులు. ఏ సమాజం లోనూ మనుషులు మీలా ప్రవర్తించటం లేదు" అన్నాను కొంచెం ఆవేశంగా.

"కాని మేము మనుషులం కాము" అన్నాడు సత్యా నవ్వుతూ.

"రాక్షసులా?" అనబోయి వూరుకున్నాను.

"మేం మహా మనుషులం. సమాజానికి వుపయోగపడే శారీరక, మానసిక స్థితిని దాటిపోయిన వారిని నిర్మూలించటం మా సమాజ సుస్థిరతకు అవసరం అని మా నమ్మకం"

"మనిషిని మనిషి చంపడం నేరం అని గ్రహించిన నాటినుండే నాగరికత ప్రారంభమైంది. ఒక మనిషి ప్రాణాన్ని హరించేహక్కు మనిషికిలేదు. అది అమానుషం. మహామానుషంకాదు"

"మీరు పాకిస్తానీయుల్ని అయిదు వేలమందికి పైగా చంపారే అది ఎవరిచ్చిన హక్కు?"

"అది యుద్ధం. కొన్ని లక్షలమంది మాన ప్రాణాలని కాపాడ్డానికి కొన్నివేల మందిని బలిచెయ్యటం, బలితీసుకోవటం యుద్ధ ధర్మం"

"మేం చేస్తున్నది కూడా ఒక రకంగా యుద్ధం వంటిదే మిస్టర్ శర్మా. ఇరవై

అయిదేళ్ళనించీ నేను సల్పుతూన్న శాంతి సంగ్రామం ఇది. కొన్ని శతాబ్దాలుగా సమాజంలో పాతుకుపోయిన అర్థరహిత మైన సంప్రదాయాలనీ, మూఢనమ్మకాలనీ, మాయాజాలాన్నీ తుడిచిపెట్టే సంగ్రామం ఇది. మనుషుల్ని కట్టిపడేసి అవినీతికీ, స్వార్థపరత్వానికీ, సంకుచితత్వానికీ, అసూయా ద్వేషాలకీ, ఆవేదనలకీ, ఆవేశాలకీ గురిచేసే అనుబంధాలనీ, ఆత్మీయతలనీ నిర్మూలించడానికి మేము సలుపుతోన్న యుద్ధం ఇది. ఇక్కడ మాకు మతంలేదు, జాతిలేదు, రాజకీయాల బురద లేదు. మా ప్రజలు సుఖశాంతులతో హాయిగా జీవిస్తున్నారు"

"ఇక్కడ లేనివి చెప్పారు. అసలిక్కడ మిగిలివున్నవేమిటో చెప్పండి"

"సుఖము, శాంతి, ప్రశాంతత. స్త్రీ, పురుషుడు, యవ్వనం—మనుషుల్లో మనసుల్లో—యవ్వనం, విజ్ఞానం, మనిషికి భద్రత, రక్షణ. ఇవి చాలవా?"

"వీటిని మాత్రం ఎందుకు వదిలిపెట్టారు?" అన్నాను ఎగతాళిగా అయినా సీరియస్‌గా.

"ఇవి మనిషి మనుగడకు అత్యవసరాలు గనుక. మనిషి కనీసావసరాలేమిటి? తిండి, బట్ట, గృహము. ఇక్కడ మా ద్వీపంలో అందరికీ పుష్కలమైన ఆహారం వుంది. అందరికీ ఉండడానికి ఇళ్ళున్నాయి. ఎక్కువ తక్కువలు లేవు. అంతస్తుల తేడాలు లేవు. నేను ధరించే దుస్తులు, గనిలో కార్మికులు ధరించే దుస్తులూ ఒకేరకమైనవి"

"కమ్యూనిజమా?"

"కాదు కామన్‌సెన్సు. మనిషి కనీసావసరాలు మినహా తక్కినవన్నీ మనం కృత్రిమంగా కల్పించుకున్న ఆకర్షణలు కావా చెప్పండి. తిండి, బట్ట, ఇల్లు, ఆరోగ్యం—ఇంకా ఏం కావాలి మనకు? ఆలోచించి చూడండి"

"మనిషి సంతోషంగా వుండాలంటే ఇంకా చాలా అవసరాలున్నాయి సత్యాగారూ. అనుబంధం, ఆత్మీయత, ప్రేమ, మమత, సాహిత్యం, కళలు ఇంకా ఎన్నో మరెన్నో కావాలి మనిషికి. కాదంటారా"

"అవును. కాదనే అంటాను. మీరు చెప్పినవన్నీ నా దృష్టిలో అనవసరం. మనమే కల్పించుకున్నవి అర్థంలేని సెంటిమెంట్లు. మీరు చెప్పిన అనుబంధాలు, ఆత్మీయతలు, మమతలు కేవలం స్వార్థంతో కూడుకున్నవని అంటాను నేను. బెడిసికొడితే ఈ ప్రేమలే ద్వేషాలుగా, అసూయగా, కసిగా, ఉన్మాదంగా పరిణమించే ప్రమాదం వుంది. ఇక కళలు, సాహిత్యం ఇవి మనిషి ఆలోచనల్ని పెడదారి పట్టించి మనిషికి స్వతంత్రంగా ఆలోచించుకునే శక్తిని, ఇంగితాన్ని నిర్మూలిస్తున్నాయి. మనిషిని తన సహజమైన ఆలోచనా ధోరణినుంచి దూరంగా తీసుకెళుతున్నాయి. అందుకే పుట్టినప్పట్నించీ మా ప్రజలని వీటికి దూరంగా వీటి గురించిన జ్ఞానమే లేకుండా పెంచుతున్నాము"

భోజనం పూర్తయింది.

"మా ద్వీపంలో ఆహారం విటమిన్, కాలరీల ప్రకారం తయారు చెయ్యబడుతుంది" అన్నాడు సత్యా. ప్లేటుకింద ఒత్తుగా పెట్టిన వాటిలోంచి చేతులు తుడుచుకునే కాయితం ఒకటిలాగాను. చేతులు తుడుచుకుంటూ కాయితం మడత విప్పాను. ఒక్క క్షణం ఆ కాయితం లోపలి పొర మీద నిలిచింది నా దృష్టి.




అతి చిన్న ముత్యాల వంటి అక్షరాలతో ఏదో రాసివుంది అందులో. దూరంగా కూర్చుని వున్న లత కేసి చూశాను. ఆమె నా వేపు చూట్టం లేదు. అయినా ఆ కాయితం మడతల్లో రాసిన ఆ రహస్య సందేశం నాకే అయివుంటుందనిపించింది నాకా క్షణంలో. ఎవరూ గమనించకుండా నా జేబులోకి తోసేయగలిగాను దాన్ని.

"క్షమించండి బాత్‌రూంకి వెళ్ళాలి" అన్నాను పొట్టని ఇబ్బందిగా చేత్తో తడుముకుంటూ.

చిన్నగా నవ్వేడు సత్యా.

"వెళ్ళిరండి. అదుగో ఆ తలుపు తెరుచుకుని తిన్నగా వెళ్ళి కుడి వేపుకి తిరగండి"

బాత్‌రూంలోకి దూరి తలుపు మూసి లోపలి గడియ పెట్టి ఆత్రంగా ఆకాయితం మడత విప్పాను.

"తెలివిగా ఏదో కారణం చెప్పి సముద్ర తీరానికి రండి ఒంటరిగా చీకట్లో. కొంత దూరాన ఎర్రని లైటు సంకేతంగా కనిపిస్తుంది. దానికేసి నడిచిరండి. ఎవరి కంటాపడకుండా జాగ్రత్త పడటం చాలా ముఖ్యం" అని రాసివుంది అందులో. బాత్‌రూంలోని 'సింక్'లో ఆ కాయితం పడేసి కుళాయి తిప్పి ఆ కాగితపు వుండ అదృశ్యమై పోయేదాకా చూసి బయటి కొచ్చాను. హాలు చివర అంతా సోఫాల్లో కూర్చుని ఏదో మాట్లాడుకుంటున్నారు. సత్యాకి దగ్గరగా వెళ్ళి కూర్చున్నాను.

"నాకో సందేహం" అన్నాను మెల్లగా.

"అడగండి నిస్సంకోచంగా" అన్నాడు సత్యా నుదిటి మీది వెంట్రుకల్ని నెత్తిమీదికెగదోసుకుంటూ.

"మీ ద్వీపంలో వున్న మూడు లక్షలపైబడిన జనాభాని కంట్రోల్ చేస్తున్నారు కదా. వీరిలో ఎప్పుడైనా, ఏ ఒక్కరైనా మీ సిద్ధాంతాలకీ, మీ వ్యవస్థకీ ఎదురు తిరగడం గానీ, వ్యతిరేకించడం గానీ జరగలేదా?"

"ఈ ద్వీపంలో నివసించే ప్రతిఒక్కరినీ కంట్రోల్ చేస్తున్నది మా కంప్యూటర్. అది పనిచేస్తున్నంత వరకు మా ప్రజలకు మీరు చెప్పిన ఆలోచనలు కలిగే అవకాశం లేదు" అన్నాడు సత్యా.

"కంప్యూటర్ మీరు ఇచ్చే ఆజ్ఞలని మాత్రమే అమలు పరుస్తుంది. మనుషుల ఆలోచనల్ని ఎలా కంట్రోల్ చెయ్యగలదు సత్యాగారూ ?"

"దానికో పద్ధతి వుంది మిస్టర్ శర్మా! మా ద్వీపంలోని ప్రతి ఒక్కరికీ కంప్యూటర్ సూచనలను గురించి ట్రీట్‌మెంటు ఇవ్వటం జరుగుతుంది ప్రతి రోజూ"

ట్రీట్‌మెంటా? మనిషి ఆలోచనల్ని మార్చడానికీ, అదిమి పెట్టడానికీ ట్రీట్‌మెంటా అని నాలో నేను ఆశ్చర్యపోయాను.

నా గౌరవార్థం అప్పటికప్పుడు ఒక భరతనాట్యం ఏర్పాటైంది అక్కడ. టేప్ చెయ్యబడిన చక్కని శాస్త్రీయ సంగీతంతో మనోహరంగా నాట్యం చేసింది ఎవరో ఓ అమ్మాయి. ఆ నాట్యం చూస్తున్నంత సేపూ రవీంద్ర భారతిలో యామినీ కృష్ణమూర్తి డాన్సు చూస్తున్న అనుభూతి కలిగింది నాకు. ఆ కాసేపూ స్వర్గద్వీపాన్ని, సత్యాని మరిచిపోగలిగాను.

విందు వినోదాల కార్యక్రమం ముగిసింది.

అంతా వాళ్ళ వాళ్ళ కార్లలో వెళ్ళి

పోయారు.

"నాకింత గౌరవం ఇచ్చినందుకు చాలా సంతోషంగా వుంది సత్యాగారూ"

"అది మా ధర్మం" అన్నాడు సత్యా- "ఇతను మిమ్మల్ని మీ గది దగ్గర దిగ బెడతాడు వెళ్ళండి"

"నాదొక చిన్న కోరిక"

"చెప్పండి"

"చూడండి. ఇరవై నాలుగ్గంటలూ గదిలో ఖైదీలా పడివుండి చాలాచికాగ్గా వుంది మనసు. మీ కభ్యంతరం లేకుంటే కా సేపలా సముద్రతీరం దాకా నడిచి రావాలని వుంది. మీ ఘనమైన విందు భోజనం కాస్త జీర్ణించు కున్నట్టుగా కూడా వుంటుంది. అందాకా ఇతన్ని ఇక్కడే వుండమంటారా?"

"ఓ దానికేం భాగ్యం వెళ్లిరండి"

"పోనీ మీరూ రాకూడదూ నాతో తోడుగా"

"లేదు మీరు వెళ్ళండి. నాకు పనుంది. మరోసారెప్పుడైనా వస్తాను. మళ్ళీ కలుద్దాం" అని తన కారెక్కి వెళ్ళి పోయాడు సత్యా.

"నీవిక్కడే వుండు. కాస్త అలా సముద్ర తీరందాకా వెళ్ళి అర్ధగంటలో తిరిగొస్తాను" అని నా కోసం వేచివున్న అతనితో చెప్పి బయలుదేరాను. తిన్నగా తీరం చేరుకున్నాను. అతి పల్చని లేత వెన్నెల. తెల్లంచు నల్లచీర కట్టు కున్నట్టుంది కడలి. చల్లటి ఇసుకలో నిలబడి చుట్టూ పరికించాను. ఎడంవేపు దూరాన్నించి ఎర్రని చిరు దీపం మినుకు మినుకు మంటూ కనిపించింది. అది నా వేపుకి అటూ ఇటూ కదులుతూ నన్ను పిలుస్తున్నట్టనిపించింది. ఇసుకలో ఆ చిరుదివ్వెకు అభిముఖంగా అడుగులు వేశాను.




అలా నడుస్తూ కోరి కోరి ఆపదలోకి అడుగులు వేస్తున్నానేమోనని అని పించకపోలేదు. అయినా ఏదో పిచ్చి ధైర్యం. స్వర్గ ద్వీపపు అసలు సంగతి తెలుసుకోవాలనే కుతూహలం. దగ్గరికి సమీపించాను. ఆ మసక వెలుతురులో ఎవరిదో ఆకారం చిన్నగా నా వేపుకి కదిలింది.

"రండి" అంటూ సన్నని కంఠంతో ఆహ్వానించింది ఆ గొంతు. ఒక చిన్న ఇసుక దిబ్బమీద నిలబడి వున్న ఆ వ్యక్తి కిందికి దిగి ఆ దిబ్బ వెనక్కి తీసుకు వెళ్ళాడు నన్ను.

"ఇలా కూర్చోండి" అంటూ ఆ మెత్తని ఇసుకలో చతికిలబడ్డాడు.

"ఏమిటిదంతా?" అడిగాను అతనికి కొంచెం దూరంగా జరిగి కూర్చుంటూ.

"మీరు చదివిన ఆ కాయితం మరెవరి కంటా పడలేదు కదా?" అన్నాడతను.

"లేదు"

"అయితే మీరు మా పక్షమే..."

"ఆగండి. నేనెవ్వరి పక్షమూ కాదు. నేను నేనే. అసలు నన్నిక్కడికి రప్పిం చింది నాలో కలిగిన ఒక క్యూరియాసిటీ తప్ప ఎవరితోనూ కలిసిపోవాలనే

ఆలోచన మాత్రం కాదు"

అతనేదో అనబోయేలోగా అడిగాను "అసలు నువ్వెవరు?"

"ఈ దీవిలో స్వతంత్రంగా ఆలోచించ గలిగిన పది మంది ప్రజల్లో నేనొకణ్ణి. సిగరెట్ కాలుస్తారా?"

వద్దన్నట్టు తలూపాను.

"ఇన్నర్ సర్కిల్ వాళ్ళ దగ్గర్నించి దొంగిలించి తెచ్చాను ఈ సిగరెట్‌ని. వాళ్ళకి మాత్రం ఏ విలాసాలూ నిషిద్ధాలు కావు. సిగరెట్లు తాగొచ్చు, బ్రాందీ విస్కీలు తాగొచ్చు వాళ్లు. శర్మగారూ! మీరీ ద్వీపానికి రావటం నాకెంతో సంతోషం కలిగించింది. మాకు మంచి రోజులు దగ్గర పడుతున్నాయనే నమ్మకం ఏర్పడింది"

"నాకేమీ అర్థం కావటం లేదు" అన్నాను.

"నా పేరు జ్యోతి మూర్తి. నేనే సొంతంగా పెట్టుకున్న నాలుగక్షరాల



పేరు. ఇక్కడ ఎవరికీ రెండక్షరాలకు మించిన పేరు లేదు. నన్ను మూర్తి అని పిల్వండి"

"పెద్ద సాహసమే. ఇంకా ఏం గొప్ప పనులు చేసారు?" అడిగాను ఎగతాళిగా.

"మా వుద్యమంలో చేరడానికి మనుషుల్ని తయారు చేస్తున్నాం"

గతుక్కుమన్నాను.

"ఉద్యమమా?"

"అవును. సత్యా నిరంకుశత్వంలోంచి ఈ ద్వీపవాసుల్ని కాపాడి,వాళ్ళని చైతన్య వంతులుగా సహజ మానవులుగా తయారు చెయ్యటానికి తలపెట్టిన వుద్యమం".

"ఎంత మంది నడుపుతున్నారు ఈ వుద్యమాన్ని?"

"ప్రస్తుతానికి మేం పదిమందివున్నాం. మిమ్మల్ని కలుపుకుంటే పదకొండు"

"ఎవరన్నారు నేను మీతో చేరినట్టు? నేనిక్కడికి వచ్చింది కంప్యూటర్‌ని రిపేరు చేసి పోడానికి"

అతను కాసేపు మౌనంగా ఏదో ఆలోచిస్తూ వుండిపోయాడు.

"ఈ ద్వీపం మీద మూడు లక్షల మంది ప్రజలున్నారు. అంత మందిని మీరు పది మంది మనుషులు మార్చ గలరా? అది సాధ్యమా?"

"మూడు లక్షల మరలు. ఆలోచించడం మరిచి పోయిన, చైతన్యంకోల్పోయి మందుల ప్రభావంలో జోగుతున్న మర మనుషులు. మాకూ, తక్కిన వారికీ వున్న భేదం ఇదొక్కటే" అని సిగరెట్ వెలిగించుకున్నాడు అతను.

అగ్గిపుల్ల వెలుగులో అతణ్ణి గమనించాను. యువకుడే. తల బాగా రేగి వుంది. అతని కళ్ళలో ఏదో ఆరాటం, అలజడి. ఆ ముఖంలో ఏదో తెగింపు ధోరణి.

"శర్మగారూ! ఇక్కడ మనుషుల్ని ఎలా పెంచుతున్నారో తెలిస్తే ఆశ్చర్య పోతారు మీరు. ప్రపంచంలో మరెక్కడా జరగని వింత పరిపాలన ఇక్కడఅమల్లో వుంది. ఇక్కడ ప్రతి రోజూ ఆరోగ్య కేంద్రంలో ప్రతి ఒక్కరికీ 'దేహపుష్టికి' అనే పేరుతో మందులివ్వబడుతున్నాయి. కాని అసలు వుద్దేశం అది కాదు. మనిషి లోని సహజమైన కోరికల్ని, వాంఛల్ని నిర్మూలించి వాళ్ళని జడులుగా, బానిసలుగా తయారు చెయ్యటానికి రకరకాల మందులు, మరెన్నో పద్ధతులు అవలంబిస్తున్నారు ఇక్కడ. శిశువు జన్మించిన నెల రోజుల్నుంచే ఈ కార్యక్రమం ప్రారంభమవుతుంది. 'హిప్నోపీడియా' పద్ధతి ద్వారా బోధన ప్రారంభమవుతుంది- 'స్వర్గ ద్వీపంలో పుట్టిన మీరంతా ధన్య జీవులు. సార్థకజన్ములు. ఈ భూప్రపంచం మీద మరే ప్రాంతంలోనూ లేని సౌకర్యాలు, రక్షణ మీకందరికీ ఈ స్వర్గ ద్వీపం మీద కల్పించబడుతోంది. ప్రపంచంలోని పలు ప్రదేశాల్లో ప్రజలు ఆకలితో, అర్ధాకలితో, అనారోగ్యంతో, యుద్ధాలతో, అనుక్షణం మనుగడ కోసం పోరాడుతున్నారు. కాని స్వర్గ ద్వీపంలో జన్మించిన మీకు ఈ సమస్యలుండవు. మనిషి ప్రాథమిక అవసరాల కోసం ప్రతిక్షణం బ్రతుకు పోరాటం సాగించవలసిన దుస్థితి మీకు లేదు. ఇందుకు ప్రతిఫలంగా స్వర్గద్వీపవాసులైన మీరు శాయశక్తులా శ్రమించి మన ద్వీపం కోసం ప్రాణాలని సైతం త్యాగం చేయగల స్వామిభక్తిని, దేశభక్తిని అలవరచుకోవటం మీ అందరి

కనీస బాధ్యత—' ఇలా వుంటుంది 'హిప్నోపీడియా' బోధన. ఇది ఒక రకమైన బ్రైన్ వాషింగ్ లాంటిది. ఈ బోధనలు పుట్టిన నాటి నుండీ రక్తంలోని అణువణువునా జీర్ణించుకుపోయిన ఈ ద్వీప ప్రజలు మట్టి బొమ్మలుగా, మర మనుషులుగా తయారైనారు. కంప్యూటర్ ఏం చెబితే అది చేసే స్థితికి దిగజారి పోయారు. వారి ఆలోచనని కూడా కంప్యూటరే కంట్రోల్ చేసే పరిస్థితి ఏర్పడింది ఇక్కడ"

"ఇక్కడి ప్రజలంతా చాలా సంతోషంగా వున్నట్టు సత్యా చెపుతున్నాడే" అన్నాను.

"సంతోషం. సంతోషానికి అతను ప్రజల కోసం కల్పించిన అర్థం వేరు. ఇక్కడ అందరికీ పుష్టికరమైన తిండి వుంది. నిజమే. ధరించడానికి ఒకే రకమైన యూనిఫారాలున్నాయి. తల దాచు కోడానికి కూపేల వంటి ఒకే రకమైన గదులున్నాయి. ఇవి మాత్రమే మనిషి సంతోషానికి కావలసిన హంగులు అంటే ఇక్కడ అందరూ సంతోషంగా వున్నట్టే లెఖ్ఖ. ఇక్కడ సంతానోత్పత్తి ఎలా జరుగుతోందో తెలుసా? ఆరోగ్య పుష్టి గల కొందరు పురుషులు, స్త్రీలు ప్రత్యేకం ఆ కార్యం కోసమని ఎన్నుకోబడుతున్నారు. గర్భధారణకు ముందు స్త్రీకి, పురుషునికి ప్రత్యేకమైన మందులు, ఇంజక్షనులూ ఇవ్వబడతాయి. పద్దెనిమిది సంవత్సరాలు నిండిన స్త్రీని, పాతికేళ్లు నిండిన పురుషుణ్ని ఒక నిర్ణీత కాలంలో కొన్ని రోజులపాటు అంటే ఆ స్త్రీ గర్భం ధరించేదాకా కలుసుకోనిస్తారు. ఆ తరువాత ఆ ఇద్దరూ విడిపోవాలి. ఆరోగ్య కేంద్ర సంరక్షణలో ఆ స్త్రీ బిడ్డను కంటుంది."

కోళ్ళ ఫారంలో గుడ్లు పొదిగి కోడి పిల్లలు తయారైనట్టుగా ఇక్కడ శిశువులు జన్మిస్తున్నారని పించింది అతను చెప్పుతున్నది వింటూవుంటే నాకు.

"తలిదండ్రులకు తమ బిడ్డలెవరో తెలిసే అవకాశం లేదు. బిడ్డలకి తమని కన్నవారెవరో తెలీదు..." చెప్పుకుపోతున్నాడు జ్యోతి మూర్తి.

"నాకో సందేహం" అన్నాను అతని కేసి చూసి

"అడగండి"

"అందరిలా కాకుండా నీకు మాత్రం ఈ ఆలోచనలన్నీ ఎలా వచ్చినయ్? నువ్వు ట్రీట్ మెంటు తీసుకోవటం లేదా?"

"జడత్వంలోంచి నేను తప్పించుకోవటం యాదృచ్ఛికంగా సంభవించింది. మిమ్మల్నిక్కడికి రప్పించడానికి కారణం ఏమిటో మీకు తెలుసు. ఇక్కడ జీవితాన్ని కంట్రోల్ చేసే కంప్యూటర్ ఈ మధ్య కొన్ని పొరపాట్లు చేస్తోంది. అది చేసిన పొరపాటు వల్ల మత్తులోంచి తప్పించుకుని మేల్కొన్న వాళ్ళలో నేనొక్కడ్ని. సుమారు వారం దినాలుగా నాకు ట్రీట్ మెంట్ ఇవ్వబడలేదు. కంప్యూటర్ చేసిన పొరపాటు వల్లనేనేమో నా నెంబర్ మిస్ అవుతూ వచ్చింది. ఆ నెల రోజుల్లో నేను మనిషినయ్యాను. ఆలోచించడం నేర్చుకున్నాను. నా చుట్టూ ఉన్న జీవితాన్ని గమనించటం ప్రారంభించాను."

"ఆ అమ్మాయి లత? మీ వుద్యమంలోని మనిషేనా?"

"అవును. ట్రీట్ మెంటు నుంచి తప్పించుకున్న పదిమందిలో లత కూడా

ష్యంది. ఇన్నర్ సర్కిల్ సభ్యులు లతని తమ బానిసగా వాడుకుంటున్నారు. ఉంపుడుగత్తెకన్న దుర్భరమైన జీవితం గడుపుతోంది లత వాళ్ళ మధ్య.

వాళ్ళ విపరీతమైన సెక్సు కోరికల్ని తృప్తిపరచాలి. ట్రీట్‌మెంటులో వున్నంత కాలం ఆమెకి ఏ విధమైన సంకోచమూ వుండేది కాదు. ఆటబొమ్మ వలె వాళ్లు చెప్పినట్టల్లా ఆడింది. కాని ఇప్పుడు ఆమెలో ఆలోచనలు ప్రారంభమైనాయి. మానసిక సంఘర్షణ మొదలైంది. ఎంతో శ్రమపడి ఆమెని నా ఆలోచనా ధోరణికి వొప్పించగలిగాను! తనలోని మార్పుని ఎవరూ గమనించకుండా నటించడం నేర్చుకొమ్మని చెప్పాను..."

విందు జరిగిన హాల్లో లత నన్ను గుర్తించనట్టే ప్రవర్తించడం జ్ఞాపకం వచ్చింది నాకు. బాగానే నటించింది అనుకున్నాను ఇప్పుడు.

దూరంగా మసక చీకట్లో ఏదో



ఆకారం కదిలింది. మాకేసే కదిలి వస్తోంది. ఒక్క క్షణం భయంతో గడ్డ కట్టుకు పోయినట్టయింది. నా శరీరం.

"ఎవరో ఇటుకేసి వస్తున్నారు?" అన్నాను భయంగా.

"భయం లేదు. ఆ వచ్చేది లతే అయి వుంటుంది'' అన్నాడు జ్యోతి మూర్తి నా చేతిని పట్టుకుని. సందేహం లేదు లతే. దగ్గరగా వచ్చి ఇసుకలో మా పక్కన కూర్చుంది.

"అంతా వివరించారా?" అడిగింది జ్యోతి మూర్తిని.

"చెప్తున్నాను" అన్నాడు మూర్తి నావేపుకు తిరిగి.

"నేనిక వాళ్ళ మధ్య ఉండలేను. వాళ్ళు కోరే వికృతమైన కోర్కెలు నాక సహ్యం పుట్టిస్తున్నాయి మూర్తీ" అంది లత.

"మరి కొంత కాలం ఓపిక పట్టాలి మనం. తప్పదు" ఆమెని ఓదార్చుతున్న ట్టుగా అంటున్నాడు జ్యోతిమూర్తి.

"చూడండి శర్మగారూ! ఈ ద్వీపాన్ని రక్షించడం మీ చేతుల్లోనే వుంది.వీలు కాదనుకుంటే కనీసం నన్నూ, జ్యోతిమూర్తిని మీతోపాటు మీ దేశానికి తీసుకు వెళ్ళే ప్రయత్నమైనా చెయ్యండి" అంది ఆ అమ్మాయి నాకేసి బతిమాలు కుంటున్నట్టుగా చూస్తూ.

"అలా అనుకు లతా! అప్పుడే నీలో స్వార్థం ప్రవేశించింది. మనం వుద్యమం ప్రారంభించింది నువ్వూ నేనూ రహస్యంగా ఈ ద్వీపంలోంచి తప్పించుకు పారి పోడానికి కాదు. సత్యాకి మెదడు చెడి పోయింది. అతని ఉన్మత్త పరిపాలన లోంచి మన ద్వీప వాసులకి విముక్తి కలిగించడం మన లక్ష్యం. శర్మగారు మనవేపు వుంటే చాలు. వారు సహకరిస్తే మన ఉద్యమం తప్పకుండా గెలుస్తుంది"

"నా సహకారమా?" అన్నాను విస్తుపోయి.

"అవును. ఈ ద్వీపవాసులు మర మనుషులుగా మారిపోడానికి సత్యాకి సహాయపడుతున్న ఆ కంప్యూటర్‌ని నాశనం చేయగలవారు మీరొక్కరే. మా కోసం మీరీ సహాయం చెయ్యాలి శర్మ గారూ! తప్పదు" అన్నాడు జ్యోతి మూర్తి నా చేతులు పట్టుకుని నొక్కుతూ.

"మనిషి మస్తిష్కంలోని రక్తనాళాల వంటి అతిముఖ్యమైన, సున్నితమైన కంప్యూటర్ భాగాలని కత్తిరించి కంప్యూటర్‌ని నిర్వీర్యం చేసెయ్యండి చాలు. ఈ ద్వీపంమీది జీవితం స్తంభించిపోతుంది. ట్రాఫిక్ సిగ్నల్ ఆరిపోవడం దగ్గర్నుంచి, రత్నాల గనిలోని కన్వేయర్ బెల్టు తిరగడం వరకూ అన్ని పనులూ ఎక్కడివక్కడ నిలిచిపోతాయ్. ఆ తరువాత మా పని సులభం"

"రత్నాల గనా? అదేమిటి?" అన్నాను నివ్వెరపాటుతో.

"తెలీదా మీకు? మా ద్వీపంలో రెండు పెద్ద రత్నాల గనులున్నాయి. నేను పని చేసేదికూడా అక్కడే. ఒక యురేనియం గనికూడా వుందిఇక్కడ. చాలా సంపన్న వంతమైన ద్వీపం ఇది. ఎన్నో విలువైన మినరల్సు లభ్యమవుతున్నాయి ఈ ద్వీపంలో. మిమ్మల్ని అక్కడికి తీసుకు వెళతాను. అప్పుడు చూడండి. ఇంతకీ మీరు అంగీకరించినట్టేనా ?" అడిగాడు జ్యోతిమూర్తి సూటిగా నా ముఖంలోకి చూసి.

"అదే ఆ కంప్యూటర్‌ని ధ్వంసం

చెయ్యటానికి"

నేను సమాధానం చెప్పకుండా ఆలో చిస్తున్నాను.

"చూడు మూర్తీ. ఆయన ఇవాళే వచ్చాడు. అప్పుడే అలా తొందరపెట్టేస్తే ఎలా చెప్ప సార్! మీరూ బాగా ఆలోచించుకోండి. ఈ ద్వీపం గురించి అన్నీ వివరంగా తెలుసుకోండి. ఆ తరువాత మాకు సహాయపడేదీ, లేనిదీ నిర్ణయించుకోండి" అంది ఆ అమ్మాయి లత.

"శర్మగారూ! నేనూ, లతా ప్రేమించుకుంటున్నాం. పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాం. కాని అదిఈ వ్యవస్థలో సాధ్యం కాదు. అందుకే మా వుద్యమం విజయవంతమై ఈ పిచ్చివాళ్ళ పరిపాలన అంతమయ్యేదాకా వేచి వుండాలని నిశ్చయించుకున్నాం" అన్నాడు మూర్తి లతకేసి చిలిపిగా చూస్తూ.

"మూర్తీ! అటు చూడు. ఎవరో వస్తున్నారు" అంది లత భయంగా మూర్తి వెనక్కి నక్కుతూ. మాకు కొంచెం దూరంలో ఒక వ్యక్తి నిలబడివున్నాడు. అతని చేతిలోని టార్చిలైటు కాంతి మా మీద పడింది.

"లతా. నువ్వు అలాగే వెనక్కి నక్కి వుండు. కదలకు" అన్నాడు మూర్తి చిన్నగా.

ఆ వ్యక్తి మమ్మల్ని సమీపించాడు.

నా జబ్బ పట్టుకుని నన్ను పైకి లేపాడు.

"ఏమిటీ దౌర్జన్యం? ఎవరు నువ్వు?" అన్నాను ధైర్యం నటిస్తూ.

"శాంతి దళం మనిషిని. మీరిప్పుడు నాతో రావాలి" అన్నాడు ఆ వ్యక్తి.

"ఎందుకు? ఎక్కడికి?"

"అర్ధగంటలో తిరిగి వస్తున్నట్టు చెప్పి వెళ్ళాను. రాలేదు. మీ కోసం అక్కడ కారు కాచుకునుంది. వీళ్ళతో మీరు మాట్లాడటమే తప్పు" అంటూ అతను టార్చి వెలుగుని మూర్తి మీదకి ప్రసరించాడు.

"నీ కార్డు చూపించు. ఎవరా అమ్మాయి నీ పక్కన. ఊఁ... మీ కార్డులు తియ్యండి బయటికి.

ఈవేళప్పుడు ఇక్కడ తిరగటం నేరమని తెలీదా మీకు?" అంటూ ముందుకి అడుగులు వేస్తున్నాడు. నా గుండెలు వేగంగా స్పందించడం ప్రారంభించాయి. అప్పుడు...

ఆకలిగొన్న పులిలా ఆ వ్యక్తి మీదికి లంఘించాడు మూర్తి. కసిగా రెండు చేతులతోనూ అతని గొంతుని అదిమిపట్టాడు. ఇద్దరూ ఇసుకలో పొర్లుతున్నారు. ఎవరి గొంతుని ఎవరు నలుముతున్నారో ఆ చీకట్లో కనిపించడంలేదు. ఎముకలు విరిగిన చప్పుడు. చిన్నగా సన్నని మూలుగు. రెండు శరీరాలూ అతుక్కుపోయినట్టుగా ఒకదాని మీద ఒకటి.




"మూర్తీ! చంపేశావా అతణ్ణి?" భయంతో లత కంఠం వణికింది.

"అవును" అన్నాడు మూర్తి నీరసంగా పైకిలేచి శరీరానికి అంటిన ఇసు

కని దులుపుకుంటూ.

"తొందరపడ్డారు మీరు. అనవసరంగా ఇతణ్ణి చంపి అపద కొని తెచ్చుకున్నారు" అన్నాను మృతదేహాన్ని చూస్తూ.

"కాదు శర్మగారూ ! ఇతణ్ని చంపకుండా వెళ్లనిచ్చి వుంటే మరో పదిహేను నిమిషాల్లో శాంతి దళం వాళ్ళు మన ముగ్గురినీ అరెస్టుచేసి వుండేవారు"

"ఇప్పుడు మాత్రం ? నన్ను వెతకడానికి వెళ్ళిన మనిషి తిరిగిరాలేదని శాంతిదళం రక్షకభటులెటూ ఇక్కడికి రాక మానరు. జరిగింది బయటపడక పోదు"

"అందుకొక మార్గం వుంది శర్మ గారూ" అంటూ మృతదేహం మీదికి వంగాడు జ్యోతి మూర్తి. చచ్చిపడివున్న అతని పాంటు జేబులోంచి ఒక కార్డు బయటికి తీశాడు.

"వీడి నెంబరు 662544-7. ఈ నెంబరు కార్డుతో నేనే వెళ్ళి ఇక్కడ సందేహించతగినదేమీ జరగలేదని చెప్పొచ్చు. నన్నెవరూ గుర్తుపట్టరు. ఈ ద్వీపం మీద అందరికీ నంబర్లేతప్ప వ్యక్తిత్వాలూ, పోలికలూ లేవు. ఉన్నా వాటి నెవరూ గుర్తుపట్టజాలరు" అన్నాడు జ్యోతిమూర్తి.

"మరి ఈ శవాన్ని ఏం చేయదల్చుకున్నావు?" అడిగింది లత.

"ప్రస్తుతానికి ఇక్కడే గొయ్యితవ్వి కప్పెడదాం. స్వతంత్ర స్వర్గద్వీపం కోసం మన వుద్యమానికి మొదటి బలి వీడు. ఓ మిత్రమా! ఈ ద్వీపం విడుదల పొందనీ. అప్పుడు మొట్టమొదట నీ ప్రాణ త్యాగానికి చిహ్నంగా ఇక్కడే నీకో అందమైన పాలరాతి సమాధి కట్టిస్తాను. అందాకా ఈ ఇసుకలో చల్లగా బజ్జో" అని పిచ్చిగా నవ్వసాగేడు. జ్యోతిమూర్తి. ఆ క్షణం నాకెందుకో అతన్ని చూస్తుంటే భయమేసింది.

"శర్మగారూ! జాగ్రత్తగా వెళ్ళి మీ గదిలో నిదానంగా ఆలోచించి ఒక నిర్ణయానికి రండి. లత మిమ్మల్ని మళ్ళీ కలుసుకుంటుంది. ఇక్కడ మీరు చూసిందంతా మరిచిపోండి. వెళ్ళండి" అతని కంఠంలోని మార్పుకి నిర్ఘాంతపోయాను. దాదాపు నన్ను ఆజ్ఞాపిస్తున్నట్టుగా "ఊం త్వరగా ఇక్కడ్నుంచి వెళ్ళిపోండి" అన్నాడు.

ఈ జ్యోతిమూర్తి కూడా సామాన్యుడేంకాదు. ప్రాణాలు తీయడం వీళ్ళకి అతి తేలికైన పనిలావుంది. నాకు ఏ వుద్యమాలూ వద్దు. ఆ కంప్యూటరేదో బాగుచేసి వచ్చిన దారినే మద్రాసు వెళ్ళిపోయి నా బతుకేదో నేను బతకడంకంటే వుత్తమం ఇంకోటిలేదు. ఇలా ఆలోచిస్తూ నడిచి నా కోసం వేచివున్న కారు దగ్గరికి చేరుకున్నాను. కారు ఆ పవిహేసంతసుల భవనం ముందాగింది. నా గదికి చేరుకున్నాను. ఆలోచనలతో, ఆందోళనతో మనసు, శరీరం వేడెక్కిపోయినట్టుగా వుంది. బాత్రూంలోకి వెళ్ళి చన్నీళ్ళతో ముఖం కాళ్ళూ చేతులూ కడుక్కొని వచ్చి బెడ్‌మీద పడిపోయాను. గదిలోని లైట్లు కాంతిని క్రమంగా కోల్పోయినయ్. గదిలోకి ఎవరో ప్రవేశించిన అడుగుల సవ్వడి విని వులిక్కి పడి లేచాను. ఆ మీట అమ్మాయి నిలబడి వుంది మంచం పక్కన.

"నువ్వా" అన్నాను.

"అవును. మీకేమైనా అవసరం వుంటుందేమోనని నన్ను పంపారు. చెప్పండి.

కావాలా? నేను సిద్ధంగా వున్నాను" అంది ఆ అమ్మాయి. జీవితంలో మొదటిసారిగా హత్య జరగడం కళ్ళారా చూశాను ఇంతకుముందే. ఆ భయం ఇంకా నన్ను వదిలిపోలేదు. నాలోని మానసిక ఆందోళనని మరిచి హాయిగా నిద్ర పోవాలంటే అందుకు ఈ అమ్మాయి సహాయపడు తాననంటోంది. ఎందుకు కాదనాలి.

"సరే పాపా! ఇలా దగ్గరగా రా మరి" అంటూ చేతులు చాచాను...

ఎప్పుడు నిద్ర పట్టిందో గుర్తులేదు. కళ్ళు తెరిచేప్పటికి ఎండ పొడ కిటికీలోంచి గదిలోకి పడుతోంది. బెరి నా కెదురుగా కనిపించాడు.

"స్నానం చేసి తయారవండి. మా ద్వీపంలోని కొన్ని ప్రాంతాలకి మిమ్మల్ని తీసుకెళ్ళి చూపించడానికి ఏర్పాట్లు చేసి వున్నాం. అవి తిరిగి వచ్చిం తరువాత కాసేపు విశ్రాంతి తీసుకుని మీరు కంప్యూటర్‌ని రిపేరు చేసే పని ప్రారంభించవచ్చును" అన్నాడు బెరి.

"వీలుపడదేమో! కంప్యూటర్‌ని గురించిన లిటరేచర్‌ని ఇంకా చదివి ముగించ లేదు నేను" అన్నాను.

"సరే. త్వరగా తెమలండి మరి" అని అక్కడున్న ఒక కుర్చీలో కూలబడ్డాడు బెరి.

బెరి నన్ను తీసుకు వెళ్ళడం ఒక "కండెక్టెడ్ టూర్‌లా అనిపించింది నాకు. నగరంలో ఎక్కడ చూసినా కనిపించే పరిశుభ్రత నన్ను ముందుగా ఆకర్షించింది.

'ఆరోగ్య కేంద్రం' అని రాసివున్న ఒక భవనం ముందు క్రమమైన వరుసలో సుమారు వందమంది నిలబడివున్నారు.

"వీళ్ళంతా ఎందుకిలా క్యూలో నిలబడ్డారు? కొత్తగా రేషన్ పెట్టారా ఏమిటి ఇక్కడ కూడా?" అన్నాను బెరిని చూసి నవ్వుతూ.

"వాళ్ళకి దినసరి చికిత్స జరుగుతోంది. మందు తీసుకుంటున్నారు"

"దగ్గరికి వెళ్ళి చూడచ్చా?"

"ఓ తప్పకుండా. రండి వెళదాం" అని అక్కడికి తీసుకు వెళ్ళాడు. అక్కడ హాల్లో టెలిఫోను బూతు సైజులో అయిదు గాజు గదులు ఏర్పాటు చేయబడి వున్నాయి. వాటిలోపల మైక్రోస్కోపు లాంటి సాధనాలు అమర్చబడ్డాయి. ఒక్కొక్కరుగా ఆ గాజుగదుల్ని సమీపించగానే ఆటోమేటిక్‌గా ఆ గదుల తలుపులు తెరుచుకుని వాళ్ళు లోపలికి ప్రవేశించగానే మూసుకొంటున్నాయిలోపల ప్రవేశించినవాళ్ళు మైక్రోస్కోపుకిందకుడి అరచేతిని బోర్లించి పెడుతున్నారు. మైక్రోస్కోపు మెల్లగా కిందికిదిగి మృదువుగా అరచేతిని స్పృశించి పైకి లేస్తోంది. చేతిని వెనక్కి లాక్కుని అరచేతి వెనుక భాగం మీద చెమట బిందువులవలె పైకి పొంగిన మందు చుక్కల్ని ఎడంచేత్తో తుడిచేసుకుంటూ బయటికి వస్తున్నారు. వాళ్ళ కోసం ఆ గాజు కాబిన్ తలుపులు వాటికవే తెరుచుకుని మళ్ళీ మూసుకుంటున్నాయి.

"వాళ్ళకి ఏమాత్రం నొప్పి వుండదు. తల వెంట్రుకల కన్న సన్నని సూదులు ఏర్పాటు చేయబడ్డాయి ఆ మైక్రోస్కోపులకి" అన్నాడు బెరి.

మరో హాలు దగ్గరికి నడిచాను. అక్కడ వరుసగా ఇన్‌క్యుబేటర్లలాంటి అరలు కనిపించాయి. అవి కూడా గాజుతో చేయబడి వున్నాయి. వాటిలో రబ్బరు బొమ్మల వంటి ఒకే రకమైన




శిశువులు పడుకుని నోళ్ళు వెళ్ళబెట్టి పెద్దగా ఏడుస్తున్నారు.

"వీళ్ళంతా ఎందుకిలా ఒకేసారి ఏడుస్తున్నారు?" అడిగాను బెరిని.

"అంతా మూడు మాసాల శిశువులే. అం చేత అప్పుడప్పుడూ ఏడ్చేందుకు అనుమతిస్తున్నాము. ఇప్పుడు చూడండి" అని పక్కనే నర్సు దుస్తుల్లో వున్న ఒక అమ్మాయి కేసి చూసి ఏదో సైగ చేశాడు బెరి. ఆ అమ్మాయి నడిచి వెళ్ళి గోడకున్న ఒక స్విచ్చి నొక్కింది. మంత్రించినట్టుగా అందరు పిల్లలూ ఒకేసారి ఏడ్వటం ఆపేశారు. నేను విస్తుపోయి చూస్తున్నాను.

"కొద్ది మోతాదులో మైక్రో ఆంపియర్ కరెంటు ప్రసారం చేస్తాము. ఆ మృదువైన ప్రకంపనలకి ఏడవటం మానేస్తారు... ఆఁ... ఇతను ఈ నిలయానికి డైరెక్టరు...ఇతనే శర్మ. మన కంప్యూటర్‌ని రిపేర్ చెయ్యడానికి వచ్చారు" అని పరిచయం చేశాడు.

"మా నిలయంలో పరిపూర్ణమైన ఆరోగ్యంగల పౌరుల్ని తయారు చేస్తున్నాము" అన్నాడు ఆ డైరెక్టర్ నాతో కరచాలనంచేస్తూ.

"మా ఫాక్టరీలో నాణ్యమైన సబ్బుల్ని తయారుచేస్తున్నాం" అన్నట్టుగా అనిపించింది నాకు.

బోక్నొవిస్కీ పద్ధతి గురించి, జీన్స్, హిప్నోపీడియా మొదలైన వాటిగురించి ఓ పావుగంటసేపు వివరించాడు.

"ఈ పాపల్లో ట్రీట్‌మెంటుకి లొంగనివాళ్లుకూడా వుంటారా?"

"కొందరున్నారు. వాళ్ళకోసం ప్రత్యేకమైన గదులున్నాయి. చూస్తారా" అంటూ మరో విభాగానికి తీసుకువెళ్ళాడు నన్ను డైరెక్టర్. అక్కడ అమాయకత్వం నిండిన బోసినవ్వులు చిందిస్తూ ఆడుకుంటూన్న పాపలు - మంచి ఆరోగ్యంతో "గ్లాక్సో బేబీ" లని గుర్తుకి తెస్తున్నారు. ఒక పాపని చిన్న కుర్చీలో కూర్చోబెట్టి నడుం చుట్టూ బెల్టుతో కట్టేసి వున్నారు. పక్కనే స్విచ్చి లాంటి సాధనంతో ఓ అమ్మాయి- నర్సు కాబోలు నిలబడివుంది.

"ఈ బిడ్డ సహజంగానే 'అమ్మా' అని పలకడం, 'అమ్మా' అని ఏడ్వటం చేస్తోంది. అలా పలికినప్పుడల్లా చిన్న షాక్ ఇస్తున్నాం ఈ బిడ్డకి. పదిహేను రోజుల్లో 'అమ్మా' అనే అలవాటుని మానుకుంటుంది ఈపాప"

ఆ గ్లాక్సో బేబీ ఆపరిమిత ప్రదేశం లోనే ఆనందంగా దోగాడుతూ ఆడుకుంటోంది. పక్కనే నిలబడ్డ నర్సు దగ్గరికి దోగాడుతూ వచ్చి ముఖం పైకెత్తి 'మ్...మ్మ...' అని ముద్దుగా పలికింది బోసిగా నవ్వుతూ. వెంటనే ఆ నర్సు తన చేతిలోని మీటని నొక్కడం, ఆ పసిపాప మొఖం మీది బోసి నవ్వు క్షణంలో మాడిపోయి ఆ బిడ్డ తృళ్ళిపడి బొమ్మలా కూర్చుండి పోవడం అంతా క్షణాల్లో జరిగిపోయింది. నిశ్చేష్టుడనై చూస్తూ నుంచున్నాను.

"బోక్నొవిస్కీ పద్ధతి అంటే..." అని ఏదో చెపుతున్నాడు డైరెక్టరు.

* * *

ఆ మర్నాటి రోజు సొరంగంలోకి తీసుకు వెళ్ళారు నన్ను. అక్కడ గనిలో తవ్వి తీయబడిన ఖనిజాలు కన్వేయర్ బెల్టుల మీద ఒక చోటికి చేరుతున్నాయి. చిన్న చిన్న ముక్కలు చేయబడుతున్నాయి. జల్లించబడి, హైడ్రోఫోరిక్

ఆమ్లంలో శుద్ధం చెయ్యబడి చిక్కని ద్రవంగా కరగబెట్టబడుతున్నాయి.

"మా ద్వీపానికి మూలాధారాలు గనులు. వారానికొకసారి ఓడలొచ్చి నిలుస్తాయి. ఈ విలువైన ఖనిజాలని ఇతర దేశాలకు ఎగుమతి చేస్తున్నాం. ఇంకా ఎన్నో గనులు తవ్వి తీయాల్సి వుంది" అన్నాడు నాతో వచ్చినతను. ఆ తరువాత నన్నొక పాఠశాలకు తీసుకు



వెళ్ళారు. అక్కడ్నుంచి వస్తూ దారిలో అడిగాను.

"మీ శాంతి దళం కార్యాలయానికి ఎప్పుడు తీసికెడతారు?"

"క్షమించాలి. అందుకు సత్యా అనుమతి కావాలి"

"ఈ నగరంలో రహస్య ప్రదేశా



లంటూ ఏమీ లేవు అన్నారు కదా"

"కొన్ని ప్రదేశాలు మాత్రం నిషిద్ధం. కంప్యూటర్ నిలయం, శాంతిదళం కార్యాలయం వంటివి" అన్నాడు.

"శర్మగారూ! మీరక్కడ కొత్తగా చూసేదేమీ వుండదు. రండి, ఇక భోజనానికి వెడదాం"

గనుల్లో, కార్ఖానాల్లో, పాఠశాలల్లో, ఆరోగ్య కేంద్రాలలో నేను చూసిన మనుషలంతా ప్రవర్తించిన తీరు చాలా చిత్రంగా అనిపించింది. అందరూ ఏదో అదృశ్య హస్తం ఆడించే తోలుబొమ్మల పలె ప్రవర్తించటం గమనించాను. జ్యోతిమూర్తి గుర్తుకొచ్చాడు. ఇంతమంది మర

మనుషుల మధ్య, తోలు బొమ్మల మధ్య తనొక్కడు మనిషిగా నిలిచి ఈ వ్యవస్థతో పోరాడాలనుకుంటున్నాడు. ఆయుధాలు లేవు అచంచల ఆత్మ విశ్వాసం తప్ప. తన సహాయం అర్థిస్తున్నాడు. అతను కోరిన సహాయం చెయ్యటమా? మానటమా? అసలు తనకీ, ఈ ద్వీపానికీ ఏమిటి సంబంధం. మోసం చేసి తననిక్కడికి తీసుకొచ్చారు. తాము కోరిన విధంగా కంప్యూటర్‌ని బాగుచేసి వెళ్ళమంటున్నారు. అంతవరకే తను చేయవలసింది. అంతేగాని స్వర్గమో, నరకమో తేల్చుకోలేని ఈ ద్వీపాన్ని రక్షించటమో, ధ్వంసం చేయటమో తనకి సంబంధంలేని విషయం. జ్యోతి మూర్తితో చేతులు కలపడం ఆపదను కొనితెచ్చుకోవడమే అవుతుంది.

"ఈ నగరంలో రక్షణశాఖ, పోలీసు శాఖల వంటివి లేవా?" అడిగాను.

"లేవు. మా ఆయుధాలే వేరు?"

ఒక పెద్ద కాంటీనులోకి తీసుకు వెళ్ళాడు బెరి నన్ను.

"భోజనం ముగించి వెంటనే కంప్యూటర్‌ని రిపేరు చేసేపని ప్రారంభించాలి నేను. ఇప్పటికే చాలా ఆలశ్యమైంది. ఎప్పుడెప్పుడు మా దేశం చేరుకుందామా అని వుంది"

మేం భోంచేస్తూ వుండగా ఒకతను బెరి చేతికి ఏదో చీటి ఇచ్చి వెళ్ళాడు. అది చదివిన బెరి ముఖం మారిపోయింది.

"క్షమించండి. నేను వెంటనే సముద్ర తీరం దగ్గరికి వెళ్ళాలి. అక్కడొక విపరీతం సంభవించింది" అంటూ హడావిడిగా వెళ్ళిపోయాడు బెరి.




నా గుండెలు గుబగుబ లాడుతున్నాయి.

నిన్న రాత్రి సముద్ర తీరంలో ఇసుకలో పూడ్చి పెట్టబడిన శవం నా కళ్ళముందు కదిలి భయపెడుతోంది. రాత్రి విందు ముగియగానే నేను కదలి తీరానికి వాహ్యాళికి వెళ్ళడం, అక్కడ జ్యోతిమూర్తిని, లతని కలుసుకోవటం, శాంతిదళం రక్షకభటుని హత్య-వీటితో నన్ను ముడి పెట్టడం, నన్నూ జ్యోతి మూర్తిని, లతని అరెస్టు చెయ్యటం, ఆ తరువాత దేశద్రోహ నేరానికి మమ్మల్ని ముగ్గురినీ ఉరితియ్యటమో - ఇక్కడ మరణశిక్షను మరో పద్ధతిలో అమలు పరుస్తారేమో! కంప్యూటరే ప్రాణాలు కూడా తీస్తుందేమో! ఏ నిమిషాన శాంతి దళం మనుషులు నన్ను అరెస్టు చేసి తీసుకు వెళ్ళడానికి వస్తారోనని క్షణాలు, నిముషాలు లెక్కిస్తూ కూర్చున్నాను. కాని వాళ్ళు రాకపోవడమే నాకు మరింత భయాన్ని, ఆందోళననీ కలిగించింది. తిన్నగా సత్యా దగ్గరకు వెళ్ళి నిన్న సముద్రపుటొడ్డున జరిగిందంతా చెప్పి, వాళ్ళతో నాకెలాంటి సంబంధమూ లేదని, నేను నిర్దోషిననీ చెప్పేస్తే? కాని ఎందుకో అలా చెయ్యటానికి నా మనస్సంగీకరించ లేదు. ఏదో వెనక్కి లాగింది నన్ను.

భోజనానంతరం ఒక ఇన్నర్‌సర్కిల్

మనిషి వచ్చి నన్ను కంప్యూటర్ గదికి తీసుకు వెళ్ళాడు. పుస్తకాలైతే గదికి తెప్పించుకున్నానేగాని ఆ కంప్యూటర్ని గురించి ఇంతదాకా క్షుణ్ణంగా చదవటం కుదరలేదు.

నా పక్కన ధీర నిలబడి వున్నాడు. కంప్యూటర్ని పరిశీలిస్తూ అతణ్ని ఏవో ప్రశ్న లడుగుతున్నానే గాని నామనసంతా సముద్ర తీరం దగ్గరే తిరుగాడుతోంది.

"సముద్ర తీరంలో ఏం జరిగింది ? నాతో వచ్చిన బెరి హడావిడిగా అక్కడికి వెడుతున్నానని చెప్పి భోజనం కూడా వదిలేసి వెళ్ళాడు" అడిగాను ఏదో యధాలాపంగా అడిగినట్టు నటిస్తూ.

"సముద్ర తీరమా? ఏం జరిగింది?" అని మళ్ళీ నన్నే ప్రశ్నించాడు ధీర. ఇక అతణ్ని అడిగి లాభంలేదనిపించింది.

"శర్మగారూ. ఒక్కొక్క ప్రోగ్రాం యొక్క మాస్టర్ టేపులన్నింటికీ నకళ్ళు తీసి పెట్టే విషయం గురించి మీ అభిప్రాయం ఏమిటి?" అడిగాడు ధీర.

"ప్రోగ్రాం టేపుల్లో ఏవైనా లోపాలున్నప్పుడు ఇలా నకళ్ళు తీసి పెట్టుకోవటం మంచి ఆలోచనగానే అనిపిస్తోంది నాక్కూడా" అన్నాను.

గది గాజు కిటికీలకున్న తెరలు తొలగించి బయటికి చూశాను. దూరంగా సముద్రతీరం కనిపిస్తోంది. అక్కడ పది పదిహేనుమంది గుంపుగా నిలబడి వున్నారు. పక్కనే అంబులెన్సు నిలిచి వుంది. ఈ గదిలోంచి ఆ దృశ్యాన్ని చూస్తూవుంటే ఏదో సైలెంటు సినిమా దృశ్యం చూస్తున్నట్టుగా వుంది.

"ధీరా! ఇలా వచ్చి చూడు" పిలిచాను ధీరని.

లేచివచ్చి నాపక్క నిలబడ్డాడు ధీర.

"అటు చూడు. అంబులెన్స్ కదూ అది?"

"అవును"

"ఏం జరిగింది?"

"ఏమో"

"ఎవరికైనా ఏదైనా ప్రమాదం జరిగిందా?"

"అయివుండొచ్చు"

ధీరకేసి చూశాను. అతను సూటిగా నాకేసే చూస్తున్నాడు.

మా చూపులు కలుసుకున్నాయి.

"మీకు నిజంగా తెలీదా మిస్టర్ శర్మా" అడిగాడు ధీర.

"ఏమిటి?"

"అక్కడ జరిగింది"

"తెలీదు. ఎలా తెలుస్తుంది" అన్నాను తడబడుతూ.

"మంచిది"

"ఎవరికి?"

"మీకే. ఏమీ తెలీనంతవరకూ మంచిది. కాని తెలిసీ తెలీకుండా వుండటం మాత్రం కొన్ని ఇబ్బందులకుదారితీస్తుంది."

గదిలోని టెలిఫోను మోగింది.

"ధీర" అన్నాడు రిసీవరు చేతికి తీసుకుని. టెలిఫోను వింటున్నంతసేపూ అతని ముఖంలో రంగులు మారటం గమనిస్తూనే వున్నాను. రిసీవరు పెట్టేసి నా వేపుకి తిరిగాడు.

"శర్మగారూ. మిమ్మల్ని వెంటనే సత్యా చూడాలని అంటున్నారు. బయలు దేరండి"

నా గుండెల్లో రాయి పడినట్టయింది. అయినా నాలోని దడని కప్పిపుచ్చుకుంటూ "ఈ కంప్యూటర్ సంగతేదో

పూర్తిగా కనుక్కొని వస్తాను. తొందరేమిటి?" అన్నాను.

"కంప్యూటర్ సంగతి తర్వాత చూద్దురుగాని, ముందు సత్యా దగ్గరకి వెళ్ళాలి. రండి నాతో" కటువుగా వుంది ఆ గొంతు.

"కంప్యూటర్‌ని రిపేరు చెయ్యనా లేక పిలిచిన వాళ్ళ దగ్గరకి పరుగెట్టుకు వెళ్ళనా? ఏదో ఒకటి మాత్రమే సాధ్యం నాకు. చెప్పండి"

"శర్మగారూ! సత్యా ఆజ్ఞల్ని ధిక్కరించడం మీ క్షేమానికి మంచిదికాదు. బయలుదేరండి నాతో"

"వీల్లేదు. నేను రాను" అన్నాను మొండిగా. ఒక వికారపు నవ్వు నవ్వేడు ధీర.

"శర్మా! మీరిప్పుడు మా అతిథి. మీ అవసరం మాకు చాలా వుంది. లేకుంటే ఈ పాటికి ఏమాత్రం నొప్పి తగలకుండా మా ఛేంబర్‌లో భస్మమైపోయి వుండేవారు. మీ తొడ ఎముకలు మినహా మిగిలినవన్నీ బూడిదై ఆ భాస్వరం మా పూల మొక్కలకి పుష్టికరమైన ఎరువుగా మారి వుండేది. ఆ రోజా పూలని చూశారా? ఎంత నిండుగా, అందంగా విరబూసి వున్నాయో"

నా తొడల్లో వణుకు ప్రారంభమైంది.

"ఇప్పుడు చెప్పండి నాతో వస్తున్నారా?"

మారు పలక్కుండా అతని వెంట నడిచాను.

సత్యా చిరునవ్వు నవ్వుతూ ఆహ్వానించాడు నన్ను.

"రండి, రండి. మళ్ళీ ఇంత త్వరలో మిమ్మల్ని కలుసుకుంటా ననుకోలేదు. ఇలా వచ్చి కూర్చోండి... నువ్వు వెళ్ళొచ్చు ఇక" అని ధీరని పంపించేశాడు సత్యా.

"నిన్నరాత్రి మా ద్వీపంలో ఇదివరకెన్నడూ జరగని, జరగకూడని ఒక సంఘటన జరిగింది. దానికి సంబంధించిన వివరాలు మీరు చెప్పగలరని పిలిపించాను. మీరు విన్నదీ, కన్నదీ తూ.చ.తప్పకుండా వివరంగా చెప్పండి" అన్నాడు సత్యా నా కళ్ళలోకి చూస్తూ.

"దేన్ని గురించి మీరడుగుతున్నది?"

"నిన్నరాత్రి మీరు సముద్రతీరానికి వాహ్యాళికి వెళ్ళారు కదూ"

"అవును"

"అక్కడేం జరిగిందో చెప్పండి"

ఏం చెప్పాలో, చెప్పకూడదో ఆలోచిస్తూ కూర్చున్నాను కొద్ది నిమిషాలు.

"చూడండి శర్మగారూ! అబద్ధం చెప్పడానికి మాత్రం ప్రయత్నించకండి. నిన్న రాత్రి అక్కడ ఇసుకలో పాతిపెట్టబడిన శవం దొరికింది"

"అలాగా!" అని ఆశ్చర్యం నటించాను.

ఇప్పుడు నాకేమీ తెలీదని బొంకడం వుచితమా కాదా? సగం నిజం మాత్రమే చెప్పి తప్పించుకోవడం సాధ్యమా?

"ఎవరి శవం అది?"

"మా ప్రజల్లో ఒకరిది. ఎవరో గుర్తుపట్టడానికి కొంతకాలం పడుతుంది. కొన్ని చిక్కులున్నాయి. మృతుని నెంబరు కార్డు మాకు దొరకలేదు. కంప్యూటర్ లెక్కనిబట్టిచూస్తే ఎవరూ అదృశ్యమైనట్టు తెలటంలేదు. అందరూ వాళ్ళవాళ్ళ కార్డులు 'పంచ్' చేసి వున్నారు. దీన్నిబట్టి చూస్తే మరణించిన వ్యక్తి నంబర్ కార్డుని హంతకుడు దొంగిలించి ఉపయోగిస్తున్నా




దని నిర్ధారణ అవుతోంది."

"నేను సముద్ర తీరానికి వెళ్ళినమాట నిజం. మీతో చెప్పే వెళ్ళాను. నాసీ ఈ హత్యకీ నాకూ ఎలాంటి సంబంధమూ లేదు."

"మిస్టర్ శర్మా! ముందే చెప్పాను. అబద్ధం చెప్పటం మీకు హాని కలిగించ గలదని. మీ అడుగుజాడలు శవం దొరి కిన స్థలందాకా వచ్చి అక్కడ ఆగిపోయి నయ్" అని నవ్వేడు సత్యా.

"నిన్న విందు ముగిశాక మీతో చెప్పి సముద్ర తీరానికి నడిచివెళ్ళాను. ఇసు కలో కొంతదూరం నడిచి ఒకచోట కూల బడ్డాను. మసక వెన్నెల. చల్లని సము ద్రపు గాలికి మైమరచి అలా ఎంతసేపు న్నానో గుర్తులేదు. ఎవరో ఒకతను నన్ను సమీపించాడు. తను శాంతిదళం మనిషిననీ, అర్ధగంట పైగా గడిచినా నేను తిరిగి రాకపోవటంచేత నన్ను తీసుకు వెళ్ళడానికి వచ్చాననీ అన్నాడు. ఇసుక లోంచి లేచి అతనితో తిరిగి వచ్చేశాను. నాకు తెలిసినంతవరకు జరిగింది ఇదే" అని వూపిరి పీల్చుకున్నాను.

ఈసారి సత్యా బిగ్గరగా నవ్వేడు. నాకు భయమనిపించింది.

"శర్మగారూ! మళ్ళీ అవకాశం ఇస్తు న్నాను. బాగా జ్ఞాపకం తెచ్చుకుని చెప్పండి"

"ఇంకా ఏం చెప్పమంటారు?"

"అక్కడ జరిగింది పూర్తిగా చెప్పండి"

"నాకు తెలిసింది చెప్పాను"

"లేదు. మీరు సముద్ర తీరానికి వెళ్ళడం, తిరిగి రావడం మాత్రమే చెప్పారు. మధ్యలో జరిగింది దాస్తు న్నారు" అన్నాడు సత్యా కఠినంగా.

"నేను చెప్పిందంతా నిజం. అంత కన్న నాకేం తెలీదు" అన్నాను. ఏదో మొండి ధైర్యం, ఎవరినో రక్షించాలనే పట్టుదల.

"నిన్నటి విందు నొకసారి గుర్తుకు తెచ్చుకోండి శర్మగారూ. విందు మధ్యలో బాత్‌రూంకి వెళ్ళాలని చెప్పి లేచి వెళ్ళారు కదూ. అక్కడ ఏం చేశారో చెప్పండి. పోనీ అది కూడా నేనే చెబుతాను. చెప్పడ మేమిటి? మీరు బాత్రూంలో ఏం చేసిందీ ప్రత్యక్షంగా మీరే చూద్దురు గాని" అని చేత్తో రెండుసార్లు చప్పట్లు కొట్టాడు సత్యా. ఒక అందమైన అమ్మాయి వచ్చి నిలబడింది.

"ఆ టి.వి. సెట్‌ని ఇలా తీసుకురా"

చక్రాలు అమర్చబడిన ఒక టి.వి. స్టాండుని నెట్టుకొచ్చింది ఆ అమ్మాయి. ఆ స్టాండుకి ఓ చిన్న ముచ్చటైన టెలి విజన్ సెట్ అమర్చబడి వుంది. అదొక జపాన్ పోర్టబుల్ టి.వి సెట్టు. అందు లోనే టెలివిజన్ కెమేరా, రేడియో టేప్ రికార్డర్ మానిటర్, వీడియో ఎక్విప్ మెంటు అన్నీ వున్నాయి. సత్యా నాకేసి నవ్వుతూ చూసి దాని మీట నొక్కాడు.

బాత్‌రూం లోపలికి దూరి తలుపు గడియ పెడుతున్నాను. పాంటు జేబు లోంచి ఆతృతగా ఆ కాగితం బయటికి తీసి మడత విప్పుతున్నాను. ఒణికే చేతుల్తో చదువుతున్నాను...బాత్‌రూం లోని సింక్‌లో వుండగా చుట్టిన ఆ కాయి తాన్ని పడేసి, కుళాయి తిప్పి, అది అదృశ్యమై పోయేదాకా చూసి తలుపు తెరుచుకుని బయటికొచ్చాను.

ఇక అబద్ధమాడి లాభం లేదు. భయంతో నా గుండెలు గడగడ లాడి నయ్.

"ఇప్పుడు చెప్పండి. ఆ ఉత్తరంలో ఏం రాసి వుంది"

"ఏమో నాకు సరిగ్గా గుర్తు లేదు. ఏదో సంకేత భాష" అన్నాను. ఇంకా ఏదో పిచ్చి నమ్మకం నాలో.

"మిమ్మల్ని చూస్తే నాకు జాలేస్తోంది" అన్నాడు సత్యా. సింక్‌లో అదృశ్యమై పోయిందని మీరనుకున్న ఆ కాయితం మాకు దొరికింది శర్మగారూ" అని ఆ అమ్మాయికేసి సైగ చేశాడు. ఒక చిన్న స్లయిడ్ ప్రొజెక్టర్ తీసుకు రాబడింది. స్విచ్ నొక్కగానే అందు లోంచి అతికించబడిన కాగితం ముక్కల మీది అక్షరాలు స్పష్టంగా కనిపించ సాగినయ్.

"తెలివిగా ఏదో కారణం చెప్పి సముద్రతీరానికి రండి ఒంటరిగా..."

"ఇప్పుడు చెప్పండి. విందు భోజనం జీర్ణం కావడానికి సముద్ర తీరం దాకా నడిచి వెళ్ళాలని అన్నారు. వెళ్ళారు. ఆ ఉత్తరంలో రాసివున్న విధంగా ఆ చిన్న ఎర్ర లైటు కనిపించింది. ఆ దిక్కుగా నడిచివెళ్ళారు. అవునా? ఆ తరువాత ఏం జరిగింది?"

నేను మౌనంగా ఆలోచిస్తున్నాను.

"ఇంతవరకు మీరు చెప్పిన చెప్పాల్సిన అబద్ధాలన్నీ క్షమిస్తున్నాను. ఇకనైనా నిజం చెప్పండి"

జ్యోతిమూర్తి, లత మనసులో మెదిలారు. వాళ్ళ అచంచల దీక్ష, ఉద్యమం పట్ల చెక్కుచెదరని వారి ఆత్మ విశ్వాసం తలపుకు వచ్చింది. నిన్న సముద్ర తీరంలో వాళ్లు చెప్పిన మాటలు చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. నాకేం జరిగినా పరవాలేదు. నన్ను నమ్మి తమ ఉద్యమం గురించి నాకు విశదపరచిన వారిద్దరికి మాత్రం ద్రోహం చెయ్యకూడదని తీర్మానించుకున్నాను. ఆ సముద్ర తీరంలో టెలివిజన్ కెమేరాలుండే అవకాశం లేదు. వుంటే సత్యా ఇంత సేపు నాచేత నిజం చెప్పించడానికి తంటాలు పడాల్సిన అవసరం లేదు.

"నన్ను క్షమించండి సత్యా. విందార గిస్తూ ఉండగా ఒక ప్లేటు కింద కాయితంలో ఏదో రాసి వుండటం చూశాను. ఆ రహస్య సందేశం నాకే అయి వుంటుందనిపించింది. బాత్‌రూంకి వెళ్ళి రహస్యంగా చదివాను. చాలా ఆశ్చర్యం కలిగింది. ఆ సందేశం పంపిన వ్యక్తి మన విందులో పాల్గొంటున్న వారిలో ఒకరై వుండాలి. ఎవరా వ్యక్తి. తెలుసుకోవాలనే కుతూహలం. రహస్యంగా ఆ వ్యక్తిని కలుసుకోవాలన్న సాహసం. ఏదో థ్రిల్. అందుకే మీతో అబద్ధం చెప్పి అక్కడికి వెళ్ళాను. ఆ మసక చీకట్లో అతని ముఖం స్పష్టంగా కని పించలేదు. అపరిచిత కంఠం. మిమ్మల్ని, మీ పరిపాలనని విమర్శిస్తూ ఏమేమో అన్నాడు. మీకు వ్యతిరేకంగా తను జరపబోయే పోరాటంలో నా సహాయం కావాలని అర్థించాడు. నేను నిరాకరించాను. 'నేను ఈ ద్వీపవాసిని కాను. మీ అంతరంగిక విషయాలతో నాకేమిటి సంబంధం? నువ్వెంతో, సత్యా కూడా అంతే నాకు. నా పని తీరిపోయాక మా దేశం వెళ్ళవలసిన వాణ్ని, నాకెందుకీ గొడవలు' అని చెప్పాను అతనితో. ఇంకా నాకేదో చెప్పబోయాడు. అప్పుడు శాంతి దళం మనిషి అక్కడికి రావడం. అతని కార్డు చూపమని అడగడం జరిగింది. ఆ క్షణంలో మెరుపులా శాంతి

 

దళం మనిషి మీదికి లంఘించి అతణ్ని హతమార్చాడు అతను. భయంతో ఒణికి పోతూ నిలబడ్డాను. ఆ తరువాత అతను నా భుజం తట్టి "మీరేం భయపడకండి. మీ గదికి వెళ్ళిపొండి. ఇక్కడ జరిగింది మాత్రం ఎవరికీ చెప్పకండి. చెబితే మీకే ప్రమాదం"అని హెచ్చరించి పంపించాడు నన్ను. అక్కడ జరిగింది ఇదే.నమ్మండి" అన్నాను ముఖానికి పట్టిన చెమట తుడుచుకుంటూ.

"హంతకుని ముఖం గుర్తుందా?" అడిగాడు సత్యా.

"లీలగా గుర్తుంది. సిగరెట్ వెలిగించుకున్నప్పుడొకసారి చూశాను.

"శర్మా! మీరెంత వరకు నిజం చెప్తున్నారో తెలుసుకోవడానికి ఓ మందుంది. మీకే మాత్రం నొప్పి కలగదు" అన్నాడు సత్యా.




**నా** అంతరాంతరాలలో జ్యోతిమూర్తి వుద్యమానికి సహాయపడాలనే కోరికదాగి వుందని గ్రహించగలిగాను. కాని అను క్షణం అన్ని రహస్యాలూ కనిపెట్టగలిగిన అన్ని వైజ్ఞానిక సదుపాయాలూ, ఆధునిక పరికరాలూ కలిగిన ఈ నగరంలో అది సాధ్యపడదేమోనన్న భయం. నేను చెప్పిందంతా సత్యా నమ్మివుంటాడన్న నమ్మకం నాకు లేదు. అయినా అతను నన్నేమీ చెయ్యలేదనే ధైర్యం. కనీసం ఆ కంప్యూటర్ని నేను బాగు చేసేదాకా నాకు ఏ హానీ అతను తలపెట్టలేడు. అయినా ఎన్ని అబద్ధాలని చెప్పగలను? వాళ్ళ ఓర్పుని మాత్రం ఎంతకని పరీక్షించడం?

"మిస్టర్ శర్మా! ఆ హంతకుడెవరో తెలుసుకోవటం చాలా ముఖ్యం. మా ద్వీప వాసుల జీవితంలో ప్రవేశించిన ఆ విషక్రిమిని గుర్తు పట్టేదాకా స్థిమితంలేదు మాకు" అన్నాడు సత్యా గదిలో అటూ ఇటూ పచార్లు చేస్తూ.

ఇంటరాగేషన్ గదిలా వుంది అది. ఆ గది మధ్యలో రివాల్వింగ్ ఛేర్లో కూర్చోబెట్టారు నన్ను. నాకెదురుగా ఒక తెరని అమర్చి వుంచారు. నాకిరుపక్కలా ధీర, డిన్నర్లో కలుసుకున్న ఆ బయోకెమిస్టు నిలబడి వున్నారు.

"బాగా గుర్తు చేసుకుని చెప్పండి. అతనెలా వుంటాడు" అన్నాడు ధీర నా కుర్చీని తన వేపుకి తిప్పి.

"ఎలా చెప్పను. ఆ చీకట్లో నేనతన్ని చూడగలిగింది అర నిమిషం పాటు మాత్రమే. ఇక్కడ మనుషులంతా ఒకేలా కనిపిస్తున్నారు నాకు. అతని పేరు మాత్రం 'జ్యోతిమూర్తి' అని చెప్పాడు"

కిటికీ దగ్గర నిలబడి బయటకు చూస్తోన్న సత్యా చివుక్కున వెనక్కి తిరిగాడు. "జ్యోతిమూర్తి కల్పించుకున్న పేరు. ఈ ద్వీపంలో నాలుగక్షరాల పేరున్న వారెవరూ లేరు. ఆ ఫొటోలు చూపించు" అని ధీరకేసి తిరిగి అన్నాడు సత్యా.

గదిలో వెలుతురు క్రమంగా తగ్గుతూ వచ్చింది. నాకభిముఖంగా వున్న తెర మీద వెలుతురు పడుతోంది. స్లైడ్

ప్రొజెక్టర్‌లోంచి తెరమీద బొమ్మలు పడుతున్నాయి.

"శర్మా! వీటిలో హంతకుని గుర్తు పట్టగలరేమో ప్రయత్నించి చూడండి జాగర్తగా"

వరుసగా ముందు ఇన్నర్ సర్కిల్ సభ్యుల ముఖాలు తెరమీదికి ప్రసారం చెయ్యబడ్డాయి.

"చెప్పండి. వీళ్ళలో ఎవరైనా వున్నారా?"

లేదు అన్నట్టుగా తలాడించాడు.

మళ్ళీ తెరమీద వరుసగా ముఖాలు ఒక్కొక్క ముఖం అయిదారు క్షణాలు తెరమీద కనిపించి మరో ముఖానికి చోటిస్తోంది.





నాకు తల తిరుగుతోంది. "ఆపండి దయచేసి. నాకు మైకం కమ్మేలా వుంది. ఇలా ఎంత మంది ముఖాలని చూపాలనుకుంటున్నారు. మీ మూడున్నర లక్షల మందిని నేను ఇప్పుడు చూసి తీరాలంటారా?" అన్నాను దాదాపు జుట్టు పీక్కుంటూ.

"కంగారుపడకండి శర్మగారూ. అంత శ్రమ కలిగించం మీకు. సామాన్య ప్రజలెవరూ ఈ వ్యవస్థని వ్యతిరేకించే అవకాశం లేదు. పుట్టినప్పట్నుంచీ వాళ్ళ రక్తకణాల్లో ఈ వ్యవస్థ పట్ల భక్తిభావం ఇంజెక్టు చేయబడి వుంటుంది. ఇకపోతే ఈ వ్యవస్థని వ్యతిరేకించే అవకాశం వున్నది ఇద్దరికే. ఒకరు అన్య దేశానికి చెందిన వ్యక్తి అయినా కావాలి. రెండు.." అని ఆగాడు సత్యా.

"ఆగిపోయారేం. చెప్పండి" అన్నాను

కుతూహలంతోనూ, ఒక విధమైన భయం తోనూ.

"ఈ ద్వీపం మీది ప్రధాన కేంద్రాల అధికారుల్లో ఏ ఒకరైనా కావచ్చు. ఇంకా చెప్పాలంటే ఈ ఇన్నర్ సర్కిల్ సభ్యుల్లోనే ఎవరో ఒకరై వుండొచ్చు కూడా" అని అందరికేసీ ఒకసారి కలయ జూశాడు సత్యా.

"సత్యా! ఏమిటి మీరంటున్నది!" అంతా ఒక్కసారిగా అన్నారు. ఆశ్చర్యం, భయం, వేదన మిళితమై ధ్వనించింది వారి కంఠంలో.

"సత్యా! ఈ వూహ ఎలా సాధ్యం? మన సర్కిల్‌లో ప్రతి ఒక్కరి గురించి మీకు క్షుణ్ణంగా తెలుసు. ఇక మన ప్రధాన కార్యాలయాల డైరెక్టర్లు-వాళ్ళంతా మీకు నమ్మకమైన మనుషులు. మన ఆదర్శాల పట్ల అచంచల విశ్వాసం కలిగిన వాళ్ళు"

వాళ్ళ మాటలేమీ వినిపించుకోనట్టుగా "శర్మా! మరోసారి ఈ ఫొటోలని జాగర్తగా పరిశీలించి చెప్పండి" అని ధీరకేసి చూశాడు సత్యా. ఈసారి తెర మీద బొమ్మలు ఒక్కొక్కటి మూడు నిమిషాల పాటు నిలిచినయ్. షుమారు నలభై, యాభై బొమ్మలదాకా చూశాను. అలా చూస్తూ వున్న నాలో ఒక వక్రమైన ఆలోచన తలెత్తింది. ఈ యాభై మందిలో ఎవరో ఒకరిని చూపించి ఇతనే ఆ హంతకుడు అని చెబితే పోలా అనిపించింది. కాని మరుక్షణంలో అది ఎంతటి పాపపుటాలోచనో అర్థమైంది. ఒక మనిషిని కాపాడ్డానికి మరొకఅమాయకుణ్ణి దోషిగా నిలబెట్టడం ఎంత పాతకం? నేనెందుకు అంత ఘాతుకానికి పాల్పడాలి? ఒక్కటి మాత్రం స్పష్టంగా అర్థమౌతోంది. సామాన్య ప్రజల్లో ఎవరి మీదా సత్యాకి సందేహం కలగటం లేదు. అంత వరకూ జ్యోతిమూర్తిని ఎవరూ సందేహించరు.

"ఊఁహుఁ ... వీళ్ళలో ఎవరూ కాదు" అన్నాను తలాడించి.

"నిస్సందేహంగా?"

"నిస్సందేహంగా"

"మీకు కొంచెం శ్రమ కలిగించాల్సి వచ్చినందుకు క్షమించాలి మిస్టర్ శర్మా"

"శ్రమ ఫరవాలేదు కాని మీ మనుషులు కొందరు నాతో ప్రవర్తించే తీరు మాత్రం నాకు కొంత బాధ కలిగించేదిగా వుంటోంది. ఇక్కడికి రావటానికిముందు నేనేదో మీ ఖైదీ నన్నట్టుగా మాట్లాడాడు ఈ ధీర. నా అవసరం మీకు చాలా వుంది. కనీసం ఆ అవసరం తీరేదాకానైనా మీరు నన్నేమీ చేయలేరు అనుకుంటాను"

"నిజమే శర్మగారూ! మిమ్మల్ని హింసపెట్టే అవసరం మాకు లేదు. ముందు అబద్ధం చెప్పినా తరువాత నిజం ఒప్పుకున్నారు మీరు. అయినా ఇంకా కొన్ని నిజాలు మీరు దాస్తున్నారన్న సంగతి కూడా తెలుసు మాకు. వాటిని ఎప్పుడు ఎలా రాబట్టాలో కూడా తెలుసు. మీరన్నట్టుగానే మీరొచ్చిన కార్యం కంప్యూటర్‌ని రిపేరు చేసి వెళ్ళడానికి. వీలైనంత త్వరలో ఆ పని పూర్తి చేయగలరని నమ్ముతున్నాము. మీ సముద్ర తీర మిత్రుడ్ని గురించి మీరిక ఆలోచించనవసరం లేదు. రెండు మూడు రోజుల్లో అతడ్ని తెచ్చి మీ ముందు నిలబెడతాం. వెళ్ళండి కంప్యూటర్ దగ్గరికి"

* * *

కంప్యూటర్ గదికి తిరిగొచ్చి ఆలో





చించిన నాకు రెండు సంగతులు స్పష్టంగా బోధపడినయ్.

ఒకటి: నేనేమీ తెలుగు సినిమా హీరోని కాదు. సాహసాలు చేసి, దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ కావించి శభాష్ అని పించుకోడానికి. నాకు నా ప్రాణం మీద తీపి ఇంకా చావలేదు.

రెండు: నేను సురక్షితంగా నాదేశానికి తిరిగి వెళ్ళాలంటే వీళ్ళ కంప్యూటర్‌ని రిపేర్ చేసిపెట్టాలి. అంతవరకూ నేనిక్కడ వుండటం తప్పనిసరి. ఇక్కడున్నంత సేపూ ఇటు సత్యా, అటు జ్యోతి మూర్తి వీళ్ళ పోరు నాకు తప్పదు. వీళ్ళ కుమ్ములాటలేవో వీళ్ళే తేల్చుకోనీ. ఇవన్నీ మనకు సరిపడవు. భరించలేము. ఈ కంప్యూటర్‌ని వీలైనంత త్వరలో రిపేరు చేసి హైదరాబాద్ చేరుకోవాలని వుంది నాకు.

చేంబరులో కాలిపోయి, నా అస్తికల భస్మాన్ని వీళ్ల రోజా మొక్కలకి ఎరువుగా వుపయోగించుకొనే కోరిక నాకు లేదు. అందుచేత బాగా ఆలోచించి ఆలోచించి తీసుకున్న తుది నిర్ణయం—

కంప్యూటర్‌ని రిపేరు చేసి హైదరాబాద్‌కు ప్రయాణం కట్టడం.

* * *

చాలా క్లిష్టమైన కంప్యూటర్ అది. సుమారు మూడు గంటల సేపు దానితో కుస్తీ పట్టాను. ముందుగా దాని సాంకేతిక పరిభాషని అవగాహన చేసుకున్నాను. ఆక్టల్ కోడ్‌లో వుంది ఆ పరిభాష. ఒక మైక్రో సెకండులో (సెకనులో పది లక్షల వంతు) అది ఒక ప్రోగ్రాముని పూర్తిచేయగలదు. ముఖ్యమైన టెస్టు పాయింట్లలో ఆసిలోస్కోప్ నుంచి పల్సులని పరిశీలించి చూశాను. మళ్ళీ మళ్ళీ డిబగ్గింగ్ ప్రోగ్రాముని వేసి పరిశీలించాను. మెమొరీ లైనుని కదిలించడానికి మాత్రం సంకోచించాను.

మూడు గంటల పరిశీలన అనంతరం కూడా ప్రారంభదశలోనే వుండిపోయాను. కంప్యూటర్ రిపేరు చెయ్యడానికి కొంత అదృష్టం కూడా కలిసి రావాలి. ఒక్కోసారి నిముషాల మీద కంప్యూటర్ పొరపాటుని స్పాట్ చేసి పట్టుకోవటం జరుగుతుంది. ఆ తరువాతే రిపేరు పని ప్రారంభం అవుతుంది.

మూడు గంటలపాటు ఓపికతో వేచి వున్నా ఆ కంప్యూటర్ ఒక్క పొరపాటు కూడా చెయ్యకుండా పని చేసుకుపోతూంది. విసిగి వేసారి కుర్చీలో వెనక్కి జార్లబడ్డ నన్ను చూసి 'నీకు చిక్కనుపో' అని వెక్కిరిస్తోన్నట్టుగా వుంది కంప్యూటరు. నుదుటి మీద చెమట తుడుచుకున్నాను.

"అంతా సరిగ్గానే వున్నట్టుందే" అన్నాను ధీరకేసి చూస్తూ.

"పొరపాటు కనిపించేదాకా ఓపిక పట్టాలి. ఒక్కోసారి కొన్ని రోజుల తరబడి ఏ తప్పూ కనిపించదు ఫంక్షనింగ్‌లో"

"వేచి వుంటాను. తప్పుతుందా? నాకు ఒక పెద్ద ఫ్లాస్కు నిండా కాఫీ పంపే ఏర్పాటు చెయ్యండి"

"అంటే?"

"ఈ రాత్రికి నేనిక్కడే గడపదల్చుకున్నాను."

"అందుకు సత్యా అనుమతి కావాలి. కనుక్కొని చెబుతాను వుండండి"

"దీనికి సత్యా అనుమతా? మీ కంప్యూటర్ రిపేరు కావాలి. కంప్యూట

ర్‌ని త్వరగా రిపేరు చేసి నేను మా దేశం వెళ్ళాలంటే దీన్ని ఈ రాత్రి పూర్తిగా నేను పరిశోధించాల్సి వుంది"

"కావచ్చు. కాని ఈ కంప్యూటర్ సత్యా అనుమతి లేనిదే పూర్తిగా మీ అధీనంలో వుంచడానికి వీల్లేదు శర్మ గారూ. ఈ మూడు గంటల్లోనే మాకెంత ఉత్పత్తి నష్టం సంభవించి వుంటుందో మీకెలా తెలుస్తుంది"

ధీర టెలిఫోన్‌లో సత్యాతో మాట్లాడేడు.

"శర్మా! సత్యా మిమ్మల్ని వెంటనే రమ్మంటున్నారు"

"ఈ రాత్రికి ఇక్కడే వుండి కంప్యూటర్‌ని పరిశీలించాలని చెప్పాను గదా. ఆ సంగతి మాట్లాడేవా అతనితో?"

"అందుకు సత్యా అంగీకరించ లేదు"

నాలో మళ్ళీ వొణుకు ప్రారంభ మైంది. సత్యాకి నా మీద ఇంకా అను మానం తీరలేదు. ఈసారి నా చేత నిజం కక్కించడం ఖాయం.

సత్యా గదిలోకి అడుగు పెట్టాడు.

"రండి శర్మా! కంప్యూటర్ విష యంలో మీరు కనబరుస్తున్న శ్రద్ధకు నాకు చాలా సంతోషంగా వుంది. త్వరలోనే మీ పని పూర్తికాగల దని నమ్ముతున్నాను. రేపు వుదయమే మీరు మళ్ళీ మీ పని ప్రారంభించవచ్చు. మళ్ళీ మీకు శ్రమ కలిగిస్తున్నందుకు క్షమించాలి. ఇప్పుడు మళ్ళీ ఆ సముద్ర తీర సంఘటనల గురించి మాట్లాడుకో వాల్సివుంది మనం"

"అంతా ఇదివరకే చెప్పాను మీకు"

"చెప్పారు. నిజమే. కాని అంతా మాత్రం కాదు"





"చూడండి. నేనిప్పటికే మీ ప్రశ్నలతో బాగా విసిగిపోయి, అలసిపోయి వున్నాను. బుద్ధిగడ్డితిని సముద్ర తీరానికి వెళ్ళాను. ఆ వుద్యమం గురించి వాళ్ళే నాతో మాట్లా డేరు. అందుకు నేనేం చెయ్యను" అన్నాను ఆవేశంగా.

"ఉద్యమమా?" అంటూ ఆశ్చర్యంగా నాకేసి చూశాడు సత్యా.

"శర్మా! మీరేదో దాస్తున్నారు. చెప్పండి. అక్కడ ఎంతమందిని కలిశారు మీరు?"

"ఒకతనినే"

"మరి ఏదో వుద్యమం అంటున్నారే అదేమిటి?"

"ఏదో నోరు జారాను. మీ పద్ధతుల్ని విమర్శించుతూ మాట్లాడేసరికి అతనో వుద్యమకారుడుగా భావించాను. అంతే"

నోరు జారినందుకు లోలోపల నన్ను నేను నిందించుకున్నాను.

"శర్మా. మీరేదో దాస్తున్నారు. అతను మీతో చాలా విషయాలు మాట్లాడి వున్నాడు. ఉద్యమం గురించి చెప్పి వున్నాడు. మీరు నిజం ఒప్పుకోకపోతే మిమ్మల్నికూడా అతనితోబాటు అను మానించవలసి రావచ్చు. అలా వెళ్ళి ఆ కుర్చీలో కూర్చోండి"

హాలు మధ్యలో వున్న ఒక రివాల్వింగ్ ఛేర్‌లో నన్ను కూర్చోబెట్టారు.

"ఏమిటిది? నన్నేం చెయ్యదల్చు కున్నారు?" భయంతో పెద్దగా అరిచాను.

"భయపడకండి. మీరు మా అతిథి. మాకు చాలా అవసరం వున్నవారు. ఇప్పుడు మీకు రక్త నాళంలోకి ట్రూత్ సీరమ్ ఎక్కించ బడుతుంది. అతి సున్నితమైన ఇంజెక్షన్. ఏ మాత్రం బాధ అనిపించదు మీకు. అది మీ నరాల మీద, మెదడు మీద తన

ప్రభావం చూపుతుంది. మీరెంత ప్రయత్నించినా అబద్ధం చెప్పలేరు"

"వద్దు...ప్లీజ్... నాకు సూది గుచ్చకండి. నా శరీరం సూది మందులకి తట్టుకోలేదు. నన్ను ఎన్ని ప్రశ్నలైనా అడగండి. ఎంతసేపైనా ఇంటరాగేట్ చెయ్యండి. ఈ ఇంజెక్షన్ మాత్రం నాకొద్దు. నాకు భయంగా వుంది"

"ఏం భయం లేదు. చీమ కుట్టినట్టు కూడా వుండదు" అంటూ రివాల్వింగ్ ఛేర్‌ని చేత్తో గట్టిగా తిప్పి వదిలాడు సత్యా. రంగుల రాట్నం వలె గిరగిర తిరిగింది ఆ కుర్చీ. నాకు మైకం కమ్మినట్లయింది. కుర్చీ తిరగడం ఆగి నేను కళ్ళు తెరిచే సరికి నా ఎదురుగా ఓ అందమైన అమ్మాయి నిలబడి వుండటం కనిపించింది. కళ్లు నులుముకుని చూశాను. నిర్ఘాంత పోయాను! చేతిలో ఇంజెక్షనుతో నా ఎదురుగా నిలబడిన ఆ అందమైన యువతి లత! ఆమె ముఖంలో ఎటువంటి స్పందనగాని, అనుభూతి గాని కనిపించటం లేదు. అదే గ్రిమ్ ఫేస్.

నా షర్టు గుండీలు విప్పి ఇంజెక్షన్ సిద్ధం చేసింది లత. నన్ను ఏ మాత్రం గుర్తించనట్లే ప్రవర్తిస్తోంది. నాలోని ఏదో స్వార్థం మెల్లగా పడగ విప్పబోయింది. 'అసలు నన్నీ రొంపిలోకి దింపింది ఇదుగో ఈ పిల్లే. ఏమీ ఎరగని నంగనాచిలా ఎలా నటిస్తోందో చూడండి. నిన్న విందులో ఆ రహస్య సందేశం నా కందించిన అమ్మాయి ఈ పిల్లే. జ్యోతి మూర్తితో బాటు నేను ఈ అమ్మాయిని కూడా సముద్రతీరం దగ్గర చూశాను. వీళ్ళిద్దరూ మీకు వ్యతిరేకంగా ఏదో వుద్యమం లేవదీయాలని పథకం వేస్తున్నారు. ఈమెను వెంటనే అరెస్టు చేయండి. ఇక నన్నొదిలి పెట్టండి' అని అంతా చెప్పేయాలని పించింది. నా ఆలోచనలని చదివేసిన దానిలా సూది గుచ్చటానికి ముందుకి వంగుతూ ఒక్క క్షణం కళ్ళతోనే ప్రార్థించింది. సిరెంజిని సర్దుతున్నట్టుగా నటిస్తూ ఎడమ అరచేతిని మెల్లగా విప్పార్చింది నాకు కనిపించేలా. తెల్లగా మెరిసే అరచేతి మధ్య చిన్నగా మెరిసిన అక్షరాలు.

'భయంలేదు'

అర్థంచేసుకోగలిగాను. సూదిగుచ్చిన వెంటనే రాలో ఏదో మార్పు జరిగినట్టుగా నటించాను. "నాకేదోగా వుంది. కాసేపు పడుకుంటాను" అన్నాను. సోఫాలో పడుకోబెట్టారు నన్ను. గదిలోని లైట్లు క్రమంగా కాంతిని తగ్గించుకుని మందంగా వెలుగుతున్నాయ్. నాకు దగ్గరగా అతి మృదువుగా ధ్వనిస్తోంది ఒక గొంతు!

"శర్మా...నిన్న రాత్రి...సముద్ర తీరాన మీరు విన్నదీ ...కన్నదీ ... అంతా వివరంగా చెప్పబోతున్నారు"

ఏదో సినిమాలో చూసిన హిప్నాటైజ్ చేసే దృశ్యం గుర్తొచ్చింది నాకు.

"చెప్పండి. నిన్న సముద్ర తీరంలో"

"అవును. నిన్న రాత్రి సముద్ర తీరంలో జ్యోతి మూర్తిని కలుసుకున్నాను"

"అతను మీతో ఏం మాట్లాడేడు?"

"సత్యాని చంపాలన్నాడు. అందుకు నా సహాయం కోరాడు"

"అప్పుడు మీరేమన్నారు?"

"భయంతో వణికిపోయాను. నావల్ల కాదన్నాను. నన్ను భయపెట్టసాగాడు. అప్పుడు...అప్పుడు..."

"చెప్పండి అప్పుడేం జరిగింది?"

"అప్పుడు అశాంతి దళం మనిషి

వచ్చాడు. అతని కార్డు తియ్యమన్నాడు. జ్యోతిమూర్తి అప్పుడు...అప్పుడు .. నాకు భయమేస్తోంది"

"చెప్పండి శర్మా భయంలేదు. అప్పుడేం జరిగింది?"

జ్యోతిమూర్తి ఆ మనిషిని దారుణంగా చంపేశాడు"

"మీరూ, జ్యోతిమూర్తి తప్ప అక్కడికి మరెవ్వరూ రాలేదా?"

"వచ్చారు"

"ఎవరు? చెప్పండి ఆ మూడో మనిషెవరో చెప్పండి"

"శాంతిదళం మనిషి"

"సరే ఆ తరువాతేం జరిగింది?"

"వాడు ఆ హంతకుడు నన్ను తిరిగి వెళ్ళిపొమ్మన్నాడు. అక్కడ జరిగింది ఎవరితోనూ చెప్పొద్దన్నాడు. సత్యా! నన్ను రక్షించండి. వాడి బారి నుంచి నన్ను కాపాడండి" అంటూ పెద్దగా అరిచాను. ఫరవాలేదు. బాగానే నటిస్తున్నాను.

"శర్మా! ఇకలేవండి. మీకేం భయం లేదు. మళ్ళీ ఒకసారి తెరమీద ఫొటోలు చూసి చెప్పండి. వారిలో జ్యోతిమూర్తి పోలికలు గలవారెవరైనా వున్నారేమో"

మళ్ళీ తెరమీద బొమ్మలు. సత్యా... ధర...బెరి...షో ... లత ... లీల ... రత్నాల గని డైరెక్టరు...బయోకెమిస్టు ఆరోగ్య కేంద్ర ప్రధానాధికారి...విమానం పైలెట్...సుమారు యాభై ఫొటోలు చూపించారు. ఒక్కొక్క ఫొటోని మూడు నిమిషాల సేపు చూసి 'కాదు కాదు' అంటూ తలాడిస్తూ కూర్చున్నాను. మెడ నరాలు పట్టేసినట్టయింది నాకు. "ఇక నన్ను వెళ్ళనిస్తారా దయచేసి. నా నోరంతా చేదుగా వుంది. తల భారంగా వుంది. అసలు మీరిచ్చిన మందేమిటి?" అన్నాను ముఖం వికారంగా పెట్టి.

సత్యా ఇక చాలన్నట్టుగా సైగ చేశాడు లతకేసి తిరిగి. నన్ను కుర్చీలోంచి లేవనెత్తి షర్టు గుండీలు సరిగ్గా పెట్టింది లత.

"చాలా శ్రమ కలిగించాం మీకు. చివరికి నిజం చెప్పినందుకు చాలా సంతోషంగా వుంది మాకు" అన్నాడు సత్యా నాతో కరచాలనం చేస్తూ.

"సత్యా మీతో అంతా చెప్పేశాను. అతని వల్ల నాకేమీ ఆపద రాదుకదా?"

"మీకే హానీ జరక్కుండా చూడాల్సిన బాధ్యత మాది మిస్టర్ శర్మా. ఈ వ్యవస్థకే హాని తలపెట్టిన అతడిని త్వరలోనే మీ ముందు నిలబెడతాం. చూస్తూ వుండండి. ఇక మీ గదికి వెళ్ళి నిశ్చింతంగా నిద్రపొండి"

"సత్యా. ఒక్క విషయం"

"ఏమిటి చెప్పండి"

"ఇక్కడ కాదు. ఏకాంతంగా"

"సరే. ఆ గదిలోకి వెళదాం రండి"

పక్క గదిలోకి తీసుకు వెళ్ళాడు నన్ను.

"ఆ అమ్మాయి లత..." అంటూ నీళ్ళు నమిలాను.

"ఆఁ... చెప్పండి. లత ఏం చేసింది?"

"అదికాదు. ఆమెని..."

చిన్నగా నవ్వాడు సత్యా. "అర్థమైంది. లతని ఇష్టపడుతున్నారా? ఈ రాత్రికి మీ గదికి పంపమంటారా చెప్పండి"

అవునన్నట్టుగా తలూపుతూ సిగ్గు నటించాను.

"దానికేం భాగ్యం. ఈ రోజు మీరు పడిన శ్రమనంతా ఒక్క రాత్రి లత సాంగత్యంలో గడిపారంటే మరిచి పోవచ్చు... లతా! ఇలారా"

లత వచ్చి నిలబడింది సత్యా ముందు.

"ఈ రాత్రికి నువ్వు శర్మగారి గదికి వెళ్ళాలి"

"అలాగే" అన్నట్టు తలూపింది లత యాంత్రికంగా.




గదికి తిరిగొచ్చి అలసటతో పడక మీద వాలిపోయాను. జరిగిన సంఘటనలన్నీ కళ్ళముందు నీడల్లా కదిలి భయపెడుతున్నాయి. కిటికీ తెరలు తొలగించి బయటకు చూశాను. బాగా చీకటి పడింది. మరి కాసేపటికి లత రాబోతోంది గదికి. ఆమెతో మాట్లాడవలసిన విషయాలు మనసులో మననం చేసుకుంటూ మంచం మీద వెల్లికిలా పడుకున్నాను. ఈ గదిలోని నా ప్రతి కదలిక, నేను మాట్లాడే ప్రతి మాట టెలివిజన్ కెమేరాల ద్వారా రికార్డు చెయ్యబడుతున్నాయి. ఈ గదిలో రహస్యంగా ఎక్కడో అమర్చివుంటాయి ఆ కెమేరాలు, మైక్రోఫోనులు. వాటిని కనిపెట్టి తొలగించనిదే లతతో నేనే రహస్యమూ మాట్లాడటం సాధ్యం కాదు. వెల్లికిలా పడుకుని గది పైకప్పుకేసి కళ్ళు చిట్లించి చూస్తూ నిదానంగా పరిశీలించాను. ఆ క్షణంలో నేను చూసిన జేమ్సుబాండ్ సినిమాలన్నీ గుర్తుకు వచ్చాయి. పైకప్పుకి ఎడంవేపు, గోడ వారగా ఏదో చిన్న త్రికోణం ఆకారంలో ఒక చిన్న స్లాబ్ వంటిది కనబడుతోంది మసగ్గా. కొంచెం దగ్గరగా వెళ్ళి పరికించాను. సందేహం లేదు. అది కెమేరా లెన్సే! ఎగిరి గంతేసేనంత పని చేశాను. మేజా డ్రాయరు సొరుగు వెతగ్గా పండ్లు కోసుకునే కత్తి కనిపించింది. కెమేరా లెన్సు పరిధిలో పడకుండా జాగ్రత్తపడుతూ గోడ వారగా నక్కి నక్కి ఆ మూలకి చేరుకున్నాను. ఒకదాని మీద ఒక స్టూలుంచి పైకెక్కాను. లెన్సు చుట్టు బిగించబడిన స్క్రూలు వదులు చేసి దాని చుట్టూ బిగించబడిన ప్లేటుని వూడదీశాను. లోపల కెమేరాని కలుపుతూ ఏవో వైర్లు, ఒక జంక్షన్ బాక్సు, చిన్న మైక్రోఫోను అన్నీ ఆ చిన్న ప్రదేశంలో చక్కగా ఇమిడ్చి వున్నాయి. వాటిని మళ్ళీ యథాస్థానంలో వుంచేసి స్టూలు దిగాను. బాత్‌రూంలోకి వెళ్ళి చన్నీటితో శుభ్రంగా స్నానం చేసి వచ్చాను. మీటనొక్కి నా కోసం చేసివుంచిన పూరి,కూర్మా తెప్పించుకుని సుష్టుగా ఆరగించాను. కాసేపు బితోవెన్ సంగీతం వింటూ గడిపాను. లత రాకకోసం ఎదురు చూస్తూ మంచం మీద వాలి కూర్చున్నాను.

తలుపు తెరుచుకుని లత గదిలోకి ప్రవేశించింది. తలుపు గడియపెట్టి నా పక్కనే వచ్చి కూర్చుంది.

"నిన్నిలా ఏకాంతంగా కలుసుకోవటం నాకెంతో ఆనందంగా వుంది లతా" అన్నాను ఆమె భుజాలచుట్టూ చేతులు వేసి! నన్ను మృదువుగా మందలిస్తున్నట్టు



నా చేతులు తొలగించింది లత. సత్యా ముందు నగ్నంగా నిలబడిన అమ్మాయికీ, ఈ గదిలోని లతకీ ఎంత తేడా! అయినా ఇద్దరూ ఒక్కరే. పరిస్థితులు, పరిసరాలు మాత్రం వేరు. నాకు వెంటనే జ్యోతిమూర్తి గుర్తుకి వచ్చాడు.

నా పొరపాటు అర్థమైంది.

"సారీ" అన్నాను మెల్లగా.

"ఫరవాలేదు" అని చిన్నగా నవ్వింది లత. మంచంమీంచి లేచి గోడవారగా

వేలాడే తెరల వెనక్కి వెళ్ళి నన్ను పిలిచింది. లేచి వెళ్ళాను.

ఆ స్థలం నుంచి మేము కెమేరా దృష్టిలో పడటానికి వీల్లేదు.

"మన ప్రతి చలనం, మాట ఈ గదిలో రికార్డు చెయ్యబడుతుంది. ఇక్కడ రహస్యమంటూ లేదు" అంది నా చెవి దగ్గరగా జరిగి.

"భయపడకు. ఆ సంగతి నాకు ముందే తెలిసి అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాను."

స్టూలుతో గోడవారగా నడుచుకుంటూ వెళ్ళి కెమేరా లెన్సుకు ఫిక్సుచేసిన స్క్రూలని వూడదీసి కెమెరానీ, మైక్రోఫోనునీ కలిపే సప్లై పాయింట్లని తొలగించాను.

"ఇప్పుడు నిర్భయంగా మాట్లాడుకోవచ్చు" అన్నాను కిందికి దిగి.

"ఇష్..." అంటూ చేత్తో నా నోటిని



మూసింది లత. నన్ను తిన్నగా మేజా దగ్గరికి నడిపించుకు వెళ్ళింది. మేజా కిందికి వంగి గోడకి అమర్చివున్న మైక్రో ఫోను చూపించింది. చూట్టానికి అదేదో మామూలు లైటు స్విచ్చిలా కనిపిస్తోంది. ఆ తరువాత ఫైర్ ప్లేసులాంటి ప్రదేశంలో మరొక మైక్రోఫోను. అన్నిటినీ పీకి పారేశాను.

"ఇప్పుడు మాట్లాడండి. టెలివిజన్ ఈ గదిలోను, స్విమ్మింగ్‌పూల్ దగ్గరా మైక్రోఫోనులు మూడుచోట్లా వున్నాయి" అంది లత.

"టెలివిజన్ తెరమీద అసలేమీ కనిపించకపోతే సందేహించరా?" అడిగాను.

"లైట్లార్పి పడుకున్నామనుకుంటారు" అని చిన్నగా నవ్వింది. "మళ్ళీ రేపు వుదయం వాటిని యథాప్రకారం వాటి స్థానాలకి ఫిక్సు చేసెయ్యొచ్చు."

"లతా?"

"ఊఁ చెప్పండి"

"మీరు ఈ వుద్యమం విరమించుకోవటం మంచిది"

"ఎందుకలా అనుకుంటున్నారు?"

"త్వరలో వాళ్ళు మిమ్మల్ని అరెస్టు చేస్తారేమోనని భయంగా వుంది నాకు"

"ఎందుకలా అనిపించింది మీకు?"

"మరణించిన శాంతిదళం మనిషి ఫొటో సహాయంతో అతని పేరు, నెంబరు మొదలైన వివరాలు కనుక్కోవటం పెద్ద కష్టంకాదు. దాన్నిబట్టి ఆ నెంబరుతో ఇప్పుడు శాంతిదళం మనిషిగా చెలామణీ అయ్యేది జ్యోతిమూర్తేనని తెలుసుకోవటానికి ఎంత సేపు పడుతుంది?"

"జ్యోతిమూర్తి అజాగ్రత్తగా ఏ పనీ చెయ్యడు శర్మగారూ. ఆ శాంతి దళం మనిషి ముఖాన్ని గుర్తుపట్టడానికి వీల్లేని విధంగా పచ్చడి చేశాడు పాతిపెట్టడానికి ముందు"

ఆ సముద్ర తీరంలో ఆ రాత్రి జ్యోతిమూర్తి శాంతిదళం మనిషిని చంపి అతని ముఖాన్ని నుజ్జునుజ్జు చేయటాన్ని వూహించాను.

"ఏమిటాలోచిస్తున్నారు శర్మగారూ! చూడండి. మాకు మీరెంత త్వరగా సహాయపడితే అంత మంచిది. ఇంతవరకు వాళ్ళకు వ్యతిరేకంగా ఒక వుద్యమం లేవగలదన్న ఆలోచనే రాలేదు. కాని ఇప్పుడు వాళ్ళు జాగ్రత్త పడటం ప్రారంభించారు. ఈపాటికే ఆరోగ్య కేంద్రానికి వుత్తర్వులు జారీ చేయబడ్డాయి — రేపట్నుంచి రోజువారీ ట్రీట్‌మెంటు ప్రతి ఒక్కరూ సరిగ్గా తీసుకుంటున్నారో లేదో నిఘా వేసి గమనించవలసిందిగా. కంప్యూటర్ లిస్టులోంచి, పొరపాటు కారణంగా, వారం రోజుల పాటు ట్రీట్‌మెంటు తప్పించుకున్న మేం పది మందీ ఆలోచించడం నేర్చుకుని ట్రీట్‌మెంటు నుంచి తప్పించుకుంటూ వస్తున్నాం. మరి కొంత మందిని ట్రీట్‌మెంటు నుంచి తప్పించడానికి ప్రయత్నిస్తున్నాం. ఇక నుంచీ అది సాధ్యపడకపోవచ్చు. ఫలితంగా మందుల ప్రభావంతో మళ్ళీ మా ఆలోచనలు అణగారిపోయి మేం మర మనుషులుగా మారిపోయే ప్రమాదం కూడా వుంది"

"నువు చెపుతున్నదంతా చాలా గందరగోళంగా వుంది లతా" అన్నాను.

"నిన్న మీరు ఆరోగ్య నిలయానికి వెళ్ళారు కదూ. అక్కడ ఒక్కొక్కరే ఇన్‌కుబేటర్ లాంటి గాజుగదిలోకి వెళ్ళడం అక్కడ అమర్చబడిన మైక్రోస్కోపు





లాంటి సాధనం కింద చేతులుంచి తీసెయ్యడం చూసి వుంటారు. అప్పుడు వాళ్ళ శరీరాల్లోకి అర చేతుల్లోంచి ఒక నిర్ణీత మోతాదులో ఆ ఔషధం వారి రక్తనాళాల్లోకి ప్రసరించబడుతుంది. అలవాటు ప్రకారం కంప్యూటర్ ఈ కార్యక్రమాన్ని కంట్రోలు చేస్తూ ఉన్నందువల్ల, అందరూ సరిగ్గా ఆ మైక్రోస్కోపు కింద చేతులు సక్రమంగా వుంచుతున్నారాలేదా అని ఇంతవరకూ ఎవరూ నిఘా వేసి చూసింది లేదు. మేం పది మంది మాత్రం ఆ మైక్రోస్కోపు సాధనం కింద చేతులుంచినట్టు నటిస్తూ వస్తున్నాం ఇన్ని రోజులూ. రేపట్నుంచి అది సాధ్యం కాదు. ఎంతో కాలం అవసరం లేదు. మరో వారం రోజులపాటు మేం ఆ ట్రీట్‌మెంటుకి గురయ్యామంటే మళ్ళీ పాత మనుషులుగా తయారు కావటం తప్పదు"

"ఇంతకీ ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు లతా?"

"అది చెప్పడానికే జ్యోతిమూర్తి వస్తున్నాడిప్పుడు. ఇక్కడికి"

గతుక్కుమన్నాను. "ఏమిటి! జ్యోతిమూర్తా? ఇక్కడికా!" అన్నాను. సరిగ్గా ఆ క్షణంలో తలుపు మీద చిన్నగా ఎవరో తట్టడం వినిపించింది.

''జ్యోతి మూర్తి వచ్చినట్టున్నాడు." అంటూ లేచి వెళ్ళి తలుపు తీసింది లత.

* * *

''నమస్తే శర్మగారూ" అంటూ లోపలికి ప్రవేశించాడు జ్యోతిమూర్తి. నాకు ఆశ్చర్యంతోబాటు కొంచెం భయం కూడా కలిగింది.

''ఎలా రాగలిగారు ఇక్కడికి?

''అవన్నీ తరువాత చెపుతాను. ఇప్పుడు వ్యవధి లేదు" అని చెప్పుతూ వచ్చి మా పక్కనే మంచం మీద కూలబడ్డాడు జ్యోతిమూర్తి.

"మూర్తీ! మనం ఇక్కడ ధైర్యంగా మాట్లాడుకోవచ్చు. శర్మగారు టి.వి కెమెరాలు, మైక్రోఫోనులూ తొలగించారు ఎంతో తెలివిగా" అంది లత నాకేసి మెచ్చికోలుగా చూస్తూ.

"అలాగా! అయితే మీరు మాతో సహకరించడం అప్పుడే మొదలు పెట్టేశారన్న మాటే"

''సహకారం కాదు, నా పిండాకూడు కాదు" అనుకున్నాను మనసులో"వెంటనే మీరిక్కడ్నుంచి వెళ్ళిపొండి దయచేసి. సత్యా మనుషులు మిమ్మల్నిక్కడగాని చూశారంటే నా పీకకొస్తుంది ముప్పు'' అన్నాను.

"అలాగే వెళ్ళిపోతాను. అయితే వెళ్ళడానికి ముందు మీరు నాకు మాటివ్వాలి. నేను చెప్పిన ప్రకారం ఆ కంప్యూటర్‌ని."

''మూర్తీ. దయచేసి ఈ విషయంలో మాత్రం నన్ను బలవంతం చెయ్యకండి. అది అసాధ్యం. కంప్యూటర్ దగ్గర ఒక్క క్షణం కూడా వాళ్ళు నన్నొంటరిగా వదిలి పెట్టడం లేదు. ఎప్పుడూ నీడల్లా సత్యా మనుషులు నన్నంటిపెట్టుకునే వుంటున్నారు. ఒకవేళ వాళ్ళ కన్నుకప్పి ఎలాగో నేనా కంప్యూటర్ ముఖ్య నాడీ కేంద్రాన్ని కత్తిరించగలిగినా ఆ విషయాన్ని వెంటనే వాళ్ళు పసిగట్టగలరు. మీ మీద నాకు సానుభూతి వుంది. కాని కంప్యూటర్ని మాత్రం ధ్వంసం చేయలేని స్థితిలో నేనున్నాను. నా అంతరాత్మ కూడా అందుకు అంగీకరించదు. రోగాన్ని

బాగు చేసి రోగిని కాపాట్టమే వైద్యుని ధర్మం. చూస్తూ చూస్తూ రోగిని చంపటానికి ఏ వైద్యుని వివేకమూ అంగీకరించదు."

"శర్మా! ధర్మా ధర్మాల విచక్షణకి ఇది సమయం కాదు. సత్యా అరాజకత్వానికి ఇది సమయం కాదు. సత్యా అరాజకత్వాన్ని, అతని తలతిరుగుడు పరిపాలనని అంతమొందించాలంటే మరో గత్యంతరం లేదు. ఈ ద్వీపపు రాకాసి హృదయం ఈ కంప్యూటరు. అది నిలిచిపోతే ఈ రాక్షస పరిపాలన స్తంభించిపోతుంది. రోజు రోజుకీ తమని చైతన్యరహితుల్ని చేసి, నిర్వీర్యులను చేస్తోన్న మందుల్నించి ఈ ప్రజలు రక్షింపబడాలంటే ఈ రాకాసి హృదయం ఆగిపోక తప్పదు"

"ఇక ఆ విషయం మర్చిపోండి జ్యోతిమూర్తిగారూ! కంప్యూటర్ని ధ్వంసం చెయ్యటం అనేది నా వల్ల జరగదు. నన్ను క్షమించండి"

"పోనీ ఈ విషయం చెప్పండి శర్మగారూ. కంప్యూటర్‌లో ఆ నాడీ కేంద్రం ఎక్కడుందో చెప్పండి. దాన్ని ఎలా పూడదీయాలో, కత్తిరించాలో నేర్పండి. చాలు. మిగతా విషయాలు నేను చూసుకుంటాను."

"చెబితే?"

"నేను వెళ్ళి ఆ పని పూర్తి చేసుకొస్తాను" అంది లత.

"నువ్వా?" అన్నాను ఆశ్చర్యపోతూ.

"అవును శర్మగారూ. నే వెళ్ళి ఆ కంప్యూటర్ని ధ్వంసం చేస్తాను" అంది లత.

"మీరెందుకిలా పిచ్చి నమ్మకం పెంచుకుంటున్నారో అర్థం కావటంలేదు. కంప్యూటర్ గురించి మీకు తెలీదు. కంప్యూటర్ ముందు భాగంలోని పేనల్స్నీ భద్రంగా తాళం వేసి వుంటాయి. సాధారణంగా వాటిని తెరిచే అవకాశం లేదు. మీరు చెప్పే దాని రాకాసి గుండె ఆ పేనల్స్ వెనుక పేర్చిన యూనిట్ల లోపలి పొరల్లో అమర్చిన కార్డుల్లో ఇమిడి వుంది. పేనల్‌ని కదిలిస్తే చాలు. ఈ భవనం యావత్తూ అలారం సిగ్నల్‌తో ప్రతిధ్వనించే ఏర్పాటు చేయబడి వుంది. అంతే కాదు. కంప్యూటర్‌లోని ప్రతి యూనిట్‌కీ వీళ్ళ దగ్గర స్పేర్‌పార్టు వుంది. ఒక యూనిట్‌ని తొలగిస్తే దాన్ని మళ్ళీ స్పేర్ పార్టుతో బిగించడం మూణ్ణిముషాల పని. మీరు తలపెట్టిన కార్యం ఎంత ప్రమాదంతో కూడుకున్నదో వివరించడానికే లతని ఇక్కడికి పిలిపించుకున్నాను. నా మాట వినండి. మీరు పోరాటాలనుకునేది ఎంతో పరిపక్వత చెందిన ఒక ఆధునికమైన వైజ్ఞానిక సాధనంతో. అది మీ శక్తికి మించిన పని. మీ దగ్గర ఆయుధాల్లేవు. సాంకేతిక పరిజ్ఞానం లేదు. మందిబలం అసలే లేదు. కేవలం పదిమంది ఆవేశం, పరిస్థితులని అవగాహన చేసుకోలేని పిచ్చి ఆవేశం. వీటితో వుద్యమాలు నడవ్వు – మీ పది మందితో బాటు నేనూ బలికావటం తప్ప. విప్లవాలకి మరీ ఇంత తొందర పనికి రాదు"

"మా తొందరపాటుకి కారణం వుంది శర్మగారూ. రేపట్నించి శాంతివనం భటుల పర్యవేక్షణలో అందరికీ 'డ్రగ్గింగ్' ప్రారంభమౌతుంది. తప్పించుకునే అవకాశం లేదు. ఒక వారం రోజులపాటు ఆ మందు మా రక్తంలో కలిసిందంటే చాలు మాలో మేల్కొన్న చైతన్యం





నశించి మళ్ళీ మేము జడత్వంలోకి జారి పోయి మర మనుషులుగా మారిపోక తప్పదు. అందుకే ఈ రాత్రి.. ఈ రాత్రికే ఏదో ఒకటి తేల్చుకోవాలి. చెప్పండి మీ తుది నిర్ణయం ఏమిటి?"

''మీ పథకం ఆత్మహత్యతో సమానం జ్యోతిమూర్తిగారూ ! మీరు వాళ్ళకి సుల భంగా దొరికిపోతారు''

"మాకా చింతలేదు. మా పథకం విఫలమై మేం వాళ్ళకిదొరికి పోవటం జరిగితే ఏం జరుగుతుంది. వాళ్ళు మమ్మల్ని చంపేస్తారు. అంతేనా ? ఫరవాలేదు. రేపట్నుంచి రోజురోజుకీ చైతన్యం పోగొట్టుకుని నిర్వీర్యలం కావటం కన్న ఒకే సారి వాళ్ళ చేతుల్లో చావటంలో ఏం పోయింది. కనీసం ఈ వ్యవస్థని మార్చడానికి ప్రయత్నించి ప్రాణాల ర్పిస్తున్నామనే ఆత్మసంతృప్తి అయినా మిగులుతుంది. చెప్పండి. కంప్యూటర్‌ని ఎలా ధ్వంసం చెయ్యాలో మాకు చెప్పండి శర్మగారూ. ఆ బాధ్యత మేం తీసుకుంటాం. ఒక వేళ మీరన్నట్టు మేం పట్టుబడటమంటూ జరిగితే మమ్మల్ని ఎన్ని చిత్ర హింసలు పెట్టినా మీ పేరుని మాత్రం బయటకు రానియ్యం.నమ్మండి''

నేను ఆలోచించాను. నా పిరికితనాన్ని తెలివిగా ఎత్తి చూపుతున్నారని అర్థ మైంది.

"నన్ను కాసేపు ఆలోచించుకో నివ్వండి" అన్నాను చివరికి ఎటూ తేల్చుకోలేక.

జ్యోతిమూర్తి, లతా దూరంగా వెళ్ళి గది చివర ఒక మూలకి ఆనుకొని కూర్చున్నారు.

ఇక్కడికి కొచ్చి వీళ్ళ చేతుల్లో చద రంగపు పావులా చిక్కడిపోయి నట్టయింది నా పరిస్థితి. ఎటుకదిపితే ఏం ప్రమాదం ముంచుకొస్తుందో. అన్ని కోణాల్లోంచి తీవ్రంగా ఆలోచించి చూశాను.

"నేను మీరు కోరిన సహాయం చెయ్య టానికి నిరాకరిస్తే ఏం చేస్తారు?"

"ఆ రాత్రి సముద్ర తీరంలో శాంతి దళం భటునికి ఏం జరిగిందో మీరింకా మర్చిపోలేదనుకుంటున్నాను శర్మగారూ"

ఆ మాటలంటునప్పుడు జ్యోతిమూర్తి ముఖం వికృతంగా మారటం గమ నించి ఉలిక్కిపడ్డాను.

"నన్ను మీరంత సులభంగా చంప లేరు" అన్నాను మేకపోతు గాంభీర్యంతో. జ్యోతిమూర్తి నాకు దగ్గరగా వచ్చి నిల బడ్డాడు.

"శర్మగారూ! ఏదీ మీ చేతిని ఒక సారి ఇలా ఇవ్వండి" అన్నాడు నాతో కరచాలనం చెయ్యబోతున్నవాడిలా. యాంత్రికంగా కుడిచేతిని ముందుకు చాచాను. చేతినందుకుని నా ముఖంలోకి నవ్వుతూ చూసి చిన్నగా నొక్కి వది లాడు. అరచేతి ఎముకలు టపటపమని విరిగినట్లయి ప్రాణం అలిసిపోయినట్లని పించి 'కుంయ్యో' మంటూ బాధతో చిందులు తొక్కాను. లత లేచి వచ్చింది. "బాధ కలిగిందా శర్మగారూ" అంటూ నా భుజంమీద చెయ్యివేసి ప్రేమగా నొక్కినట్లు అదిమింది. మెడమీది నరాలు చిట్లినట్లయి మరోసారి తుళ్ళిపడ్డాను.

"మిమ్మల్ని చంపటం మాకు చాలా తేలికైన విషయం శర్మగారూ! అవసర మైతే అందుకు వెనుకాడం" అన్నారు ఇద్దరూ.

"మీకు ఈ ద్వీపంలో కరాటే,

జుడోలు కూడా నేర్పుతున్నారా?" అంత బాధ, భయంలోను జోకు వేయగలిగాను. నవ్వి పూరుకున్నారు.

"సరే. నేనిప్పుడే సత్యాకి టెలిఫోను చేసి మీ సంగతి చెబితే ఏం చేస్తారు ?" అన్నాను.

"మీరిప్పుడది కూడా చెయ్యలేరు. మీకు కనెక్షన్ దొరకదు. స్విచ్ బోర్డు దగ్గర మాలోని మనిషి వున్నాడు. మీరీ గదికి వచ్చిన రోజు మీకో అజ్ఞాత వ్యక్తి ఫోను చేశాడు. గుర్తుందా?"

"నీ దగ్గర ఆయుధం ఏదైనా వుందా?"

కాలి బూటులోపల అతిజాగ్రత్తగా దాచి వుంచిన ఒక చిన్న కత్తిని బయటికి తీశాడు జ్యోతిమూర్తి. చిన్నదైనా పదును సుతో తెళ తెళ మెరిసింది.

"నేనె రహస్యంగా తయారు చేసు కున్నది"

"చూడండి. నేనిప్పుడు కంప్యూటర్‌లో ఈ స్థానంలో ఈ తీగెలున్నాయి. వాటిని ఇలా కత్తిరించాలి అని ఎంత చెప్పినా మీకు అర్థంకాదు. లాభమూ వుండదు. మెయిన్ స్విచ్చిని ఆఫ్ చేసినా వెంటనే ఛార్జి చేసిన బాటరీ పనిచేయటం ప్రారంభిస్తుంది. సర్క్యూట్ బ్రేకర్‌ని ట్రిప్ చేస్తే వెంటనే మళ్ళీ మూడు సెకెన్లలో ఆటోమేటిక్‌గా రీసెట్ అయ్యే విధంగా అమర్చి వున్నారు. అలారంని బైపాస్ చేసి లోపలికి దూరి, బ్లాక్ ప్లేనుతో ప్రారంభించి మీరు కోరిన విధంగా కంప్యూటర్‌ని ధ్వంసం చేయాలి. ఇందుకు నా సహాయం మీకు తప్పని సరి. అంచేత మీరు నన్ను చంప టంలో అర్థంలేదు. దీని కంతటికీ ఒక మార్గం వుంది"

ఎందుకలా అన్నానా అని ఇప్పుడా లోచించి చూస్తే సరైన సమాధానం దొర క్కుండా వుంది.బహుశా నా అంతర్యంలో ఏమూలో వాళ్ళకి సహాయపడాలనే కాంక్ష దాగి వుందేమో. లేకుంటే కోరి కోరి నేనా వుచ్చులోకి జొరబడి వుండేవాడినా? ఆతరువాత జరిగిన విపరీత పరిణామాలకు బాధ్యుడినై వుండేవాడినే కాదు. నా పథకం వాళ్ళకి చెప్పకుండా వుండి వుంటే.

అసలెందుకిలా అన్నాను?

"లతా! ఇప్పుడా కంప్యూటర్ గదిలో ఎవరెవరుంటారో నీకుతెలుసా?"అడిగాను.

"ఈ సమయంలో ఎవరూ వుండరు. కంప్యూటర్ మాత్రం పని చేస్తూ వుంటుంది?"

"గదికి తాళం వేసి వుంటుందా?"

"అవును. కాని మాదగ్గర నకిలీ తాళంచెవి వుంది. లత సహాయంతో ముందుగానే దాన్ని తయారు చేసి వుంచాను" అన్నాడు జ్యోతిమూర్తి.

"సరే. మనం ఇప్పుడు అక్కడికి వెడదాం: అలారంని బైపాస్ చేసి ఎలా వెళ్ళాలో నాకు తెలుసు. అయితే ఒక వేళ ఏదైనా పొరపాటు జరిగి మనం బయటపడి పోవటం జరిగితే"

"అలా జరగదు శర్మగారూ"

"సత్యా సామాన్యుడు కాడు. ఒక వేళ మనం పట్టుబడటమంటూ జరిగితే ఏం చెయ్యాలి అనేది ఆలోచించకుండా ఈ సాహసానికి పూనుకోవటం మంచిది కాదు. కంప్యూటర్ గది ముందు కాపలా వుంటుందా?"

"గది ముందు ఒకతను కాపలా కాస్తూ వుంటాడు"

"అయితే అతన్నెలా తప్పించు కోవటం"

"ఆ విషయం మాకొదిలేయండి. మేం చూసుకుంటాం" అన్నాడు జ్యోతిమూర్తి.

"చంపకూడదు''

"అలాగే''

"ఒక వేళ మన పథకం బెడిసికొట్టి మనం దొరికిపోవటం జరిగితే నేను మీతో చేతులు కలపడానికి ఏం కారణం చెపుతానో తెలుసా? నేనే పాపమూ ఎరగ ననీ, మీరే నా గదిలోకి బలవంతంగా ప్రవేశించి మీరు చెప్పినట్లు చెయ్యకపోతే నా ప్రాణాలు తీస్తామని బెదిరించారనీ, ప్రాణాల మీది తీపితో నేనీ ద్రోహానికి తలపడ్డాననీ చెపుతాను. మీకు అంగీ కారమేనా?"

"అలాగే" అని నవ్వుతూ తలూపారు ఇద్దరూ.

"సరే! ఒక్క నిముషంలో తయార వుతాను" అని బట్టలు మార్చుకుని వాళ్ళతో బయలుదేరాను సింహంగుహలోకి కాలు పెడుతున్నవాసిలా. కారిడార్ గుండా నడిచి లిఫ్టులో కంప్యూటర్ వున్న అంతస్తు కింది ఫ్లోర్‌లో లిఫ్టు దిగాము.

"మీరిక్కడే వుండండి. నేను వెళ్ళి ఆ కాపలా వాని సంగతి చూసొస్తాను" అని మెట్లెక్కి వెళ్ళాడు జ్యోతిమూర్తి.

"అతణ్ణి చంపకు" అంటూ అరిచాను.

''భయపడకండి" అంటూ వేగంగా మెట్లెక్కి వెళ్ళాడు జ్యోతిమూర్తి. నా గుండె గొంతుకు అడ్డం పడినట్లయింది. ఈ సాహసం విరమించి మెట్లుదిగి కిందికి పరుగెత్తి వెళ్ళిపోవాలనిపించింది ఒక్క క్షణం. పది నిముషాల్లో తిరిగివచ్చాడు జ్యోతిమూర్తి.

"అడ్డు తొలగించాను. నిర్భయంగా రండి" అన్నాడు.

"ఏం చేశావు అతన్ని ?" అడిగాను.

''తరువాత చెపుతాను. త్వరగా గది లోకి వెళ్ళాలి మనం ఇప్పుడు. రండి త్వరగా"

మెట్లెక్కి పైకి వెళ్ళాము. ఆ గది ముందు ఎవరూ లేరు.

"ఎక్కడ అతను? చంపేశావా?"

"లేదు. బాత్‌రూంలో పడివున్నాడు" అంటూ డూప్లికేటు తాళం చెవితో కంప్యూటర్ గది తలుపులు తెరిచాడు జ్యోతిమూర్తి. లోపలికి దూరి తలుపు గడియ పెట్టాము. గదిలో ఒక్క లైటు మాత్రమే వెలుగుతోంది. కంప్యూటర్ ఫంక్షన్ అవుతోంది. దాని నీలం-అంబర్, పచ్చ-ఎరుపు రంగుల కంట్రోల్ పేనల్ బల్బులు వెలుగు తున్నాయి. డిస్క్ మెమొరీ శబ్దం వినబడుతోంది.

కంప్యూటర్ తాళాన్ని ధీర ఎక్కడ వుంచుతాడో నేను ఇదివరకు చూసి వున్నాను. ఆ అల్మైరా తెరచి తాళం చెవి తీసుకున్నాను. అందులోనే టూల్ బాక్సు కూడా వుంది. అందులోనుంచి ఒక పెద్ద స్క్రూడ్రైవర్ కూడా తీసు కున్నాను. కంప్యూటర్ వెనుక భాగం లోని ఒక స్విచ్చిని తట్టాను. 'అలారం బైపాస్‌డ్' అనే కంట్రోల్ పానల్ ఎర్ర లైటు వెలిగింది.

ఇక కంప్యూటర్‌లో దేన్ని కలియ బెట్టినా దాని అలారం సిగ్నల్స్ మోగవు. డేంజర్ లైటు వెలగదు. వెలు పలి హెచ్చరిక సిగ్నల్స్ పని చేయవు. కంప్యూటర్ రిపేర్ కోసమని ఏర్పాటు చెయ్యబడిన స్విచ్చి అది. లేకుంటే రిపేర్ కోసం కంప్యూటర్‌ని తెరచినప్పుడల్లా అందరికీ అనవసరమైన కంగారు. కంప్యూ

టర్‌లోని ఒక్కొక్క భాగాన్నీ స్క్రూడ్రైవర్‌తో తెరుస్తున్నప్పుడు నాకు చెమటలు పోస్తున్నాయి. రాక్ మౌంటింగ్ స్క్రూలని ఒక్కొక్కటే వూడదీస్తున్నాను. సొరుగుల వలె కిందికి జారుతోన్న యూనిట్లు.

సి.పి.యు. అనబడే సెంట్రల్ ప్రాసెసింగ్ యూనిట్‌ని బయటికి లాగాను. చేయబోయే నీచమైన పనిని తల్చుకుని. ఈ కంప్యూటర్ నిర్మాణం వెనుక ఎందరి మేధావుల కృషి, ఎంత వైజ్ఞానిక విషయ సేకరణ దాగివుందో! దీన్ని కని పెట్టడానికి ఎందరు ఎన్ని రాత్రులు శ్రమించారో, ఎంత ఆలోచనని వెచ్చించారో. కాని దీన్ని ధ్వంసం చెయ్యటానికి ఒక్క పట్టు కారు...కొన్ని నిమిషాలు చాలు. నేను



చేతులు వణుకుతున్నాయి. అతిసున్నితమైన, సుకుమారమైన కోట్లకొలది మైక్రో తీగలు! వాటిలో నిక్షిప్తమైన ఎన్ని విశేషాలు! వైజ్ఞానిక వింతల్లో వింత ఈ కంప్యూటర్! ఐ.సి.చిప్స్ మధ్య వరుసల్లో అందంగా వివిధ రంగుల్లో మెరుస్తూ జాయింట్ చెయ్యబడిన తీగెలు–మనిషి గుండె చుట్టూ అల్లుకున్న ధమనులు, సిరలవలె! నాకెందుకో దానిమీద ఒక్కసారిగా జాలి పెల్లుబికింది – నేను చేయ

చెయ్యబోయే కార్యం నీచాతి నీచమైన హత్యతో సమానంకాదా?

"శర్మా! ఏమిటాలోచిస్తున్నారు? క్షణం కూడా ఆలస్యం పనికిరాదు. త్వరగా ముగించండి" తొందరచేస్తున్నాడు జ్యోతిమూర్తి. వణికే చేతుల్తో కట్టర్‌ని పట్టుకున్నాను. దాన్ని ఆ కేబుల్‌ఫాం దగ్గరికి తీసికెళ్ళి ఆ తీగలమధ్య పెట్టి...

"ఒక్క నిమిషం ఆగండి మిస్టర్ శర్మా" ఖంగుమని ధ్వనించిన ఆ కంఠం విని తృళ్ళిపడి వెనక్కి తిరిగాను.

సత్యా!!!




మేరు పర్వతంలా నా ముందు నిలబడి వున్నాడు సత్యా. అతని ముఖంమీది ఆ చిరునవ్వుని చూస్తోంటే నాకు భయమేసింది. ఏ అబద్ధం నన్నిప్పుడు రక్షించగలదు? ఏం చెప్పి సత్యాను నమ్మించగలను? అయి పోయింది. అంతా అయిపోయింది.

"మిస్టర్ శర్మా! ఏమిటిది? చేతిలో ఆ కట్టర్ ఏమిటి? కట్టరేనా అది? రిపేర్ చేస్తున్నారు కదూ పాపం"

సత్యాతో బాటు దృఢకాయులైన అరుగురు శాంతిదళం భటులు, బెరి, ధీర వీళ్ళంతా జ్యోతిమూర్తిని చుట్టుముట్టారు. లత ముఖంలో భీతి ఛాయలు కమ్ముకున్నాయ్. "సన్నొదలండి" అని గింజుకుంటున్నాడు జ్యోతిమూర్తి. అతని ముఖం మీద బలంగా గుద్దాడు బెరి. లత మెడ మీద చెయివేసి మొరటుగా నేల మీదకి తోశాడు ధీర. ఆమె గుండెలమీద కుడికాలు పెట్టి నొక్కబోయాడు.

"తొందర పడకండి. ముందు మన అతిథి సంగతేమిటో కనుక్కుందాం. చెప్పండి శర్మగారూ మీకేమైంది? మా మీద మీకెందుకింత ఆగ్రహం? ఇంత త్వరలో ఎంత ద్రోహానికి తలపడ్డారు" అన్నాడు సత్యా.

"సత్యా. నన్ను కొంచెం మాట్లాడ నిస్తారా?" అన్నాడు జ్యోతిమూర్తి పెదాలమధ్య నుంచి కారే నెత్తుటి చుక్కల్ని తుడుచుకుంటూ.

"నోర్మూయ్" అంటూ అతని ముఖం మీద మళ్ళీ బలంగా కొట్టబోయాడు బెరి.

"బెరీ ఆగు. మన విప్లవకారుని చెప్పనీ. చెప్పు విప్లవ వీరుడా" అని వ్యంగ్యంగా జ్యోతిమూర్తికేసి తిరిగాడు సత్యా.

"శర్మగారినేమీ అనకండి. అతను నిర్దోషి. నేనే అతణ్ణి భయపెట్టి, కత్తి చూపించి ఇక్కడికి బలవంతంగా తీసుకొచ్చాను. నన్ను శిక్షించండి. అతనే పాపమూ ఎరగడు"

"నిజమేనా శర్మా"

"నేనేం చెప్పినా మీరు నమ్మరు. నన్నేమైనా చేసుకోండి. కాని ఆ అమ్మాయిని మాత్రం వదిలి పెట్టండి. నా కళ్ళముందు ఆమెని హింసలు పెట్టకండి"

"శర్మా! మీరు సముద్రతీరంలో కలుసుకున్న వ్యక్తి ఇతనేనా?" అడిగాడు సత్యా.

"అవును" అందుకున్నాడు జ్యోతి

మూర్తి.

"నేనడిగింది నిన్ను కాదు" ఛీత్కరించాడు సత్యా.

"లతా! నీ సంగతేమిటి? నువ్విక్కడుండటానికి కారణం?"

"ఇక నుంచీ నేనెక్కడుంటే లత కూడా అక్కడే వుంటుంది. మేమిద్దరం ప్రేమికులం. విడుదలకోసం, నమ్మిన లక్ష్యం కోసం ఒకే మనసుతో, దీక్షతో పోరాడి ఒకేసారి ప్రాణాలర్పించడానికైనా సిద్ధపడినవాళ్ళం" అన్నాడు జ్యోతిమూర్తి ఆవేశపూరితంగా.

"శభాష్! ఈ వుద్యమంలో మీతో బాటు ఇంకా ఎందరున్నారు?"

"నేను చెప్పను"

"అవును. నువ్వు చెప్పవు. కాని ఎలా చెప్పించాలో నాకు తెలుసు" అని వికృతంగా నవ్వేడు సత్యా.

"సత్యా! అతణ్ని ఏమీ చెయ్యకండి. అన్నిటికీ కారణం నేను. నేనే జ్యోతిమూర్తిని ప్రోత్సహించింది. అతనిలో ఈ విప్లవ బీజాలు నాటింది నేనే. నాకేశిక్ష యినా విధించండి. కాని జ్యోతిమూర్తిని మాత్రం వదిలిపెట్టండి" అంటూ ముందుకి రాబోయింది లత.

"బావుంది. చాలా బావుంది. నా చిన్నప్పుడు మీ దేశంలో చూసిన ఏదో సినిమా డైలాగులావుంది. శర్మగారూ! ఇంకా ఇలాంటి సినిమాలు ఆడుతూనే వున్నారా మీ దేశంలో. అయినా లతా ఎందుకలా బెంబేలు పడిపోతున్నావు? జ్యోతిమూర్తితో మాకు అవసరంవుంది. అతను మాకు కావాలి. కాని నువ్వు. ఆలోచించడం నేర్చుకున్న తెలివైన ఆడదానివి. చాలా అపాయకరమైన మనిషివి. నిన్ను మాత్రం వదిలిపెట్టను. నీ అంతం త్వరలోనే వుంది. తేదీ మాత్రం ఇంకా నిర్ణయించలేదు" అన్నాడు సత్యా లతకేసి తీక్షణంగా చూస్తూ.

"సత్యా! ఆమెని చంపకు. నేనే ఆమెకి బోధించి నాతో చేర్చుకున్నాను. ఆమెని వశపర్చుకుని నా వుద్యమం గురించి చెప్పి ఆమెని నాతో తీసుకొచ్చాను. ఆమెని వదిలిపెట్టండి. ఆమె అమాయకురాలు" జ్యోతిమూర్తి కళ్ళలో నీళ్ళు తిరిగినయ్.

సత్యా ఒక్కొక్క అడుగే వేస్తూ నా దగ్గరికొచ్చాడు. నా చేతిలోని కట్టర్‌ని లాగి అవతలికి విసిరేశాడు.

"మిస్టర్ శర్మా! ఏమో అనుకున్నాను. మీరు చాలా తెలివైనవారు. ఎంతో నేర్పుగా మీ గదిలోని టెలివిజన్ కెమేరాని, మైక్రోఫోన్లుల్ని తొలగించగలిగారు. కాని ఇదేమిటో చూశారా" అంటూ నా చొక్కా గుండీని వేలితోతాకి, నా కాలర్ పైకెత్తి ఆ బొత్తాముని కళ్ళకి దగ్గరగా తీసుకొచ్చాడు. నయాపైస సైజులో వున్న మెటల్ బటన్ అది.

"మిస్టర్ శర్మా! బటన్ వలె కనిపించే ఇది రేడియో మైక్రోట్రాన్స్‌మీటర్. ఐ. సి. యుగపు వింత. మీరు ఈ చొక్కా వేసుకున్న క్షణం నుంచీ మీ ముగ్గురూ మాట్లాడుకున్న మాటలన్నీ మాకు వినిపించినయ్. నాకు ముందే తెలుసు జ్యోతిమూర్తి మిమ్మల్ని కలుసుకునే ప్రయత్నం చేస్తాడని. మా ద్వీపంలో కుట్రలు జరగటానికి వీల్లేదు. మాది భావితరం వైజ్ఞానిక పద్ధతిలో మలుచుకున్న వ్యవస్థ. బుద్ధిగా మీరొచ్చిన పనిని పూర్తిచేసుకుని వెళ్ళండి. మీకు మా జీవితంతో, మా వ్యవస్థతో సంబంధంలేదు. మా అంతరంగిక వ్యవహారాల్లో అనవసరంగా తల

మూర్ఛకండి. అలీన విధానం అవలంబించే దేశ పౌరులు మీరు. మీరు మా వ్యవహారాల్లో కలుగజేసుకోవటం వుచితంకాదు. వీళ్ళ గురించి ఇక మీరేమీ పట్టించుకోకండి. వెళ్ళండి. వెళ్ళి ఆ కంప్యూటర్ సంగతి గమనించండి"

"నేను నిరాకరిస్తే ?" అన్నాను మొండిగా.

"మీ వుద్దేశం నాకర్థం కావటంలేదు"

"నేను కంప్యూటర్‌ని రిపేర్ చెయ్యనని మొండికేస్తే ఏం చెయ్యగలరు. నన్ను చంపుతారు అంతేనా?"

"మా అతిథుల్ని చంపేటంతటి అనాగరికులం కాదు మేము. మొండికేసే వుద్దేశం మీకుంటే ఇప్పుడే చెప్పటం మంచిది శర్మగారూ"

కాసేపు మౌనంగా వున్న తరువాత అన్నాను "నన్ను ఆలోచించుకోవటానికి వ్యవధివ్వండి"

"సరే ప్రస్తుతానికి మీ గదికి వెళ్ళండి. రేపుదయం మళ్ళీ కలుస్తాను మిమ్మల్ని"

"చూడండి సత్యా. నేను మీ కంప్యూటర్‌ని బాగుచెయ్యాలంటే నా షరతులు కూడా బాగా వినండి. ఈ అమ్మాయికిగాని, జ్యోతిమూర్తికిగాని మీవల్ల ఏ హానీ జరగకూడదు. వాళ్ళకి ఏమాత్రం హాని జరిగినా నేను మీ కంప్యూటర్‌ని తాకను కూడా తాకను. నన్నేంచేసినా సరే"

"అవన్నీ తరువాత మాట్లాడుకుందాం. మీరు గదికి వెళ్ళి విశ్రాంతి తీసుకోండి ముందు. వీళ్ళని గురించి మీరేమీ బెంగ పడనవసరంలేదు. అదంతా మాకొదిలి పెట్టండి"

ఆ గదిలోంచి నేను బయటికొస్తున్నప్పుడు లత కళ్ళల్లో కనిపించిన అంతులేని భయాలు...జ్యోతిమూర్తి ముఖంలో ప్రతిఫలించిన నిస్సహాయమైన క్రోధాగ్ని జ్వాలలు నన్ను వెంటాడుతున్నట్టనిపించింది. ఇంత త్వరలో వాళ్ళకి చిక్కిపోగలమని నేనూహించలేదు. ఇదంతా నన్ను ముందే అనుమానించి సత్యా తయారు చేసి పెట్టుకున్న పథకంలా కూడా అనిపిస్తోంది. జ్యోతిమూర్తిని, లతను పట్టుకోడానికి నన్ను ఎరగా వుపయోగించుకున్నాడా అని కూడా అనుమానించేలా చేస్తోంది సత్యా ప్రవర్తన చూస్తోంటే. ఆ చొక్కా గుండీలోని మైక్రోట్రాన్స్మిటర్...మైగాడ్! నా ఆలోచనలని కూడా రికార్డు చేయగల పరికరాలున్నట్టున్నాయి ఈ ద్వీపంలో. లత కన్నులలో కదలాడిన భయాల క్రీనీడలు నన్ను కలచివేస్తున్నాయి. ఏం చేస్తారో ఆమెను!

అద్దాల ఛేంబర్‌లో కుర్చీలో కూర్చుని వుంది లత.

ఆమె నగ్నంగా వుంది. మెడ, చేతులు, కాళ్ళు, నడుము ఏదో తోలు పటకాలతో రకరకాల కరెంటు తీగలతో కుర్చీకి బంధించబడి వున్నాయి. సత్యా ఆ గ్లాసు ఛాంబర్ ముందు ఎత్తైన స్టూలు మీద నిలబడి చుట్టూ పోగైన ప్రజలను ఉద్దేశించి ఏదో వుపన్యాసమిస్తున్నాడు. అందరూ చప్పట్లు కొడుతున్నారు. తెల్లటి దుస్తుల్లో వున్న ఓ నర్సు ఛేంబరులోకి ప్రవేశించింది. లత ముందు నిలబడి ఆమె నుద్దేశించి ఏదో చెప్పింది. నర్సు చెప్పిన మాటల్ని రిపీట్ చేస్తోంది లత. ఛాంబర్ చుట్టు పోగైన జనం మళ్ళీ చప్పట్లు కొట్టారు. సత్యా నర్సుకేసి చూసి తల పంకించాడు. లత కుర్చీ కింది మీట నొకదాన్ని నొక్కి ఛాంబర్ లోంచి బయటికొచ్చింది నర్సు. అంతా ఆసక్తిగా




చూస్తున్నారు. చందనపు బొమ్మలాంటి లత శరీరం కరగడం ప్రారంభించింది. ఆమెర క్రమాంసాలు వెన్నలా కరిగి కిందికి జారి చిక్కని ద్రవంగా మారి గ్లాసు ఛాంబర్ మూలలకి ప్రవహిస్తోంది. నిమిషాల మీద అంతా కరిగిపోయి ఆమె అస్థిపంజరం మాత్రం మిగిలింది. అంతా మరోసారి వుత్సాహంగా చప్పట్లు కొడుతున్నారు. వాళ్ళతో కలిసి నేను కూడా పెద్దగా అరుస్తూ చప్పట్లు చరుస్తున్నాను..

ఉలిక్కిపడి కళ్ళు తెరిచాను. గదిలో నీలిరంగు బల్బు మెత్తగా వెలుగుతోంది. ముఖమంతా చెమటతో తడిసిపోయింది. ఆతరువాత మళ్ళీ నిద్రపట్టలేదు నాకు. తెల్లవారింది. మీది అమ్మాయి తెచ్చిన ఫలహారం ఆరగించాను. నాకు వెంటనే లతని చూడాలని ఆరాటంగా వుంది. రాత్రి ఆ భయంకరమైన, జుగుప్సాకరమైన ఆ పీడ కల నిజం కాదుకదా !

బెరి ప్రవేశించాడు గదిలోకి. యమధర్మరాజు పంపిన భటునిలా ఉన్నాడు.

"వెళదామా ?" అన్నాడు అదోలా నవ్వుతూ.

"ఎక్కడికి?" అడిగాను అసహ్యంగా అతనికేసి చూస్తూ.

"కంప్యూటర్ దగ్గరికి"

"జ్యోతిమూర్తి, లత ఎలా వున్నారు, ఎక్కడున్నారు? నేను వెంటనే వాళ్ళని చూడాలి" అన్నాను. మొండిగా. నాలో ఏదో తెగింపు, నన్నేమీ చెయ్యలేరనే ధీమా. నా అవసరం వాళ్ళకు ఎంతైనా వుందనే ధైర్యం.

"వాళ్ళు బ్రతికే వున్నారు శర్మగారూ"

"నేను వాళ్లని చూడాలి"

"ఎందుకని"

"ముందు వాళ్ళని చూసి మాట్లాడితే గాని నేను కంప్యూటర్ పని ప్రారంభించలేను."

"అనవసరంగా గొడవ చెయ్యకుండా నాతో బయలుదేరండి" బెదిరిస్తున్నట్టుగా అన్నాడు బెరి.

"రాను. రాను.రాను. వెళ్ళి ఎవరితో చెప్పుకుంటావో చెప్పుకో. లతనీ, జ్యోతిమూర్తినీ చూడకుండా నేను మీ కంప్యూటర్‌ని ముట్టుకునేది లేదు. వెళ్లు. వెళ్ళి మీ సత్యాతో చెప్పు. అవసరం లేదు. నేను బాత్‌రూంలో చేసే శబ్దాలని కూడా తన గదిలోంచే వినగల సమర్థుడు మీ సత్యా. ఇప్పుడు నా మాటలన్నీ ఒక్కటి కూడా పొల్లుపోకుండా వింటూనే వుంటాడు. ఏయ్ సత్యా! వింటున్నావా నేనేమంటున్నానో..."

బెరి గది తలుపులు విసురుగా లాగి ధబాలున మూసి హడావిడిగా వెళ్ళిపోయాడు. మొండి ధైర్యంతో, పిచ్చి సాహసంతో, వెర్రిగా నవ్వుకుంటూ కూర్చున్నాను గదిలో.

అలా పావుగంట...అర్ధగంట... ముప్పావుగంట గడిచింది.

టెలిఫోన్ మోగింది. రిసీవరెత్తాను.

"నమస్తే శర్మగారూ" సత్యా గొంతు.

"వాళ్ళిద్దరినీ ఏం చేశావ్ ? చంపేశావా?"

"శర్మగారూ ! ఎందుకింత పట్టుదల చెప్పండి. వాళ్ళిద్దరికీ ఏం కాలేదు. సురక్షితంగా వున్నారు. నేను హామీ ఇస్తున్నాను కదా"

"టెలిఫోనులో ఇచ్చే హామీ నాకవసరంలేదు"

"పోనీ మీకెటువంటి హామీ కావాలో



చెప్పండి"

"వాళ్ళిద్దరినీ నా ముందు హాజరు పర చాలి. అందాకా నేనిక్కణ్ణించి కదిలేది లేదు"

"వాళ్ళు కుట్రదారులు. మా స్వర్గ ద్వీపపు వ్యవస్థని వ్యతిరేకించి తల్లకిందులు చేయడానికి ద్రోహం తలపెట్టినవాళ్ళు. మా శాంతి దళ భటుడ్ని అమానుషంగా హత్య చేసినవాళ్ళు. వారి పట్ల మీకెందు కింత సానుభూతి శర్మగారూ"

"కుట్ర... ద్రోహం.. సానుభూతి.. ఈ మాటలు మీ కొత్త పరిభాషలో కూడా వున్నాయా సత్యాగారూ. మీకు వాళ్ళు ద్రోహులే కావచ్చు. కాని నాకు మాత్రం వాళ్ళు మిత్రులు. నన్ను నమ్మి, నాకు తమ రహస్యం చెప్పినవాళ్ళు. నా మూలంగా వాళ్ళకు హాని జరగడం నేను సహించను. వాళ్ళని వెంటనే నా ముందు హాజరు పర్చకుంటే నేను మీ కంప్యూటర్‌ని రిపేరు చేయడం జరగదు" అని టెలిఫోను పెట్టేశాను. కాళ్ళు బారజాపు కుని మంచం మీద వాలి కంప్యూటర్ పుస్తకాన్ని తెరిచాను. లాజిక్ డయాగ్రంని పరిశీలించడంలో లీనమైనాను. ఎంత సేపలా పుస్తకం చదవటంలో మునిగి పోయానో తెలీదు. గదితలుపులు తెరుచు కుని వాళ్ల లోపలికి ప్రవేశించటం కూడా గమనించలేదు నేను.

"హలో శర్మగారూ" ఒకేసారి పలికా రిద్దరూ. దిగ్భ్రాంతితో గుడ్లప్పగించి చూస్తున్నాను. జ్యోతిమూర్తి, లతా చిరు నవ్వుతో నాకేసి చూస్తూ నిలబడి వున్నారు. నేనింతక్రితం చూసిన ఆ ఇద్దరేనా వీళ్ళు! కళ్లు నులుముకుని మరో సారి చూశాను. సందేహం లేదు. వాళ్ళే. ఎంత నిబ్బరంగా, నిశ్చలంగా నవ్వుతూ వున్నారు!

"నమస్తే శర్మగారూ! కంప్యూటర్ గదికి మిమ్మల్ని వెంటబెట్టుకుని రమ్మ న్నారు సత్యా. బయలుదేరండి" అన్నారు ఇద్దరూ ఒకేసారి.

"లతా! జ్యోతిమూర్తీ! మీరేనా ?" అన్నాను నివ్వెరపాటుతో.

"అవును శర్మగారూ, మేమే"

"ఏమైంది మీకు? నిన్న రాత్రి సత్యా మిమ్మల్ని హింసించాడా? భయపెట్టాడా? బ్రెయిన్‌వాష్ చేశాడా ?"

"మాకేం కాలేదు శర్మగారూ. సత్యా మమ్మల్ని క్షమించారు. అతనెంతో ఉదా రుడు శర్మగారూ. అతనిలాంటి మేధావి, నాయకుడూ ఇంకెక్కడా వుండడు. అతను మాకు ఆదర్శప్రాయుడు"

నాకు తల తిరుగుతోన్నట్టుగావుంది. నే వింటున్నది నిజమేనా? నేను చూస్తు న్నది లత, జ్యోతిమూర్తులనేనా?

"ఏమైంది మీ ఇద్దరికీ. నిన్న జరి గిందంతా అప్పుడే మరిచిపోయారా?"

"నిన్నటి సంగతులు నిన్నటితో సరి. మనం వుంటున్నది ప్రస్తుతంలో. ఈ ద్వీపం రేపటి సమాజంకోసం శాయశక్తులా కృషి చేయడానికి సంకల్పించుకున్న నేటి మనుషులం. రేపటి తరం కోసం త్యాగాలు చేయటానికి వెనుకాడని ఈ తరం స్వర్గ ద్వీప మానవులం"

చిలకల్లా పలుకుతున్నారు ఇద్దరూ.

* * *

"శర్మగారూ! మీ కోరిక ప్రకారం ఈ ఇద్దరినీ క్షమించారు సత్యా. వీళ్ళకి ఏ విధమైన శిక్షా విధించలేదు. ఇప్పుడు తృప్తేనా మీకు" అన్నాడు బెరి.

"లేదు అంతా అయోమయంగావుంది.

ఎందుకో భయంగా వుంది"

"భయమా? మా ద్వీపానికి ద్రోహం తలపెట్టాలని కుట్ర పన్నినవాళ్ళనే క్షమించగలిగారు మా సత్యా. మీరు మా అతిథులు. మీరెందుకు భయపడాలి. రండి కంప్యూటర్ రిపేరుకి""

"అవును శర్మగారూ, బయలుదేరండి. ఇప్పటికే చాలా ఆలశ్యం చేశారు" లతేనా ఈ మాటలంటున్నది!

"బెరీ! నువ్వెళ్ళు. కొంచెమాగి నేను వీళ్ళతో వస్తాను"

"సరే. లతా త్వరగా తీసుకురావాలి శర్మగారిని" అని వెళ్ళిపోయాడు బెరి నిస్సంకోచంగా.

లత చేయి పుచ్చుకుని బర బర బాత్ రూంలోకి లాక్కువెళ్ళాను. తలుపులు మూశాను.

"ఇప్పుడు నువ్వు నిర్భయంగా మాట్లాడవచ్చు నాతో. చెప్పు లతా. నిన్నేం జరిగింది. సత్యా మిమ్మల్ని హింసించాడా, భయపెట్టాడా? చెప్పు. ఇక్కడ టి.వి. కెమేరాలు, మైక్రో ఫోనులూ లేవని నీకూ తెలుసుగా" అడిగాను ఆమెని కుదిపేస్తూ.

"శర్మగారూ! వాళ్ళు ఎదురు చూస్తూ వుంటారు. వెంటనే బయలుదేరండి నాతో" అవే చిలక పలుకులు. నేను పరీక్షగా ఆమె ముఖంలోకి చూశాను. ఏ భావాన్నీ, స్పందననీ వ్యక్తం చేయని ఆ చూపులు! సందేహం లేదు. ఈ లత నాకు తెలిసిన లత కాదు. జ్యోతిమూర్తి నేనెరిగిన జ్యోతిమూర్తి కాదు. వీళ్ళిద్దరికి నిన్న రాత్రి ఏదో జరిగింది. మళ్ళీ వీళ్ళిద్దరూ ఈ ద్వీపంలోని లక్షలాది మరమనుషుల్లో ఒకరుగా మారిపోయారు. కాదు. సత్యా మార్చేశాడు. నేనెంత పిచ్చివాణ్ణి. వీళ్ళ కోసం నేనేదో త్యాగం చేస్తున్నట్టు, వీళ్ళని రక్షించడానికి నేనేదో కంకణం కట్టుకున్నట్టు... ఇప్పుడు ఈ ఇద్దరూ తమకేం జరగలేదంటున్నారు. సత్యా తమ దేవుడంటున్నారు.

* * *

ఆలోచనలతో అలసిపోయి కంప్యూటర్ గదిలోకి ప్రవేశించాను. అక్కడ ధీర నిలబడి వున్నాడు.

"రండి, రండి" అంటూ ఆహ్వానించాడు.

"సత్యా స్వయంగా వచ్చి మిమ్మల్ని ఆహ్వానించాలనుకున్నాడు. కాని పని వత్తిడి వల్ల రాలేకపోయాడు. ఇక మీరు ప్రశాంతంగా, ఏ రకమైన అడ్డంకులూ లేకుండా కంప్యూటర్‌ని పరీక్షించి రిపేర్ చేయడంలో మీ పూర్తి కాలాన్ని వినియోగించవచ్చు. ఈ విషయంలో మీకే సహాయం కావాలన్నా అడగండి. చేయటానికి ఎప్పుడూ సిద్ధంగా వుంటాము".

కంప్యూటర్ దగ్గరికి నడిచాను. నిన్నటి దినం ఇదే కంప్యూటర్‌ని ధ్వంసం చెయ్యాలనే నిర్ణయంతో వచ్చాను. సత్యాకి నేను పట్టుబడటం ఒక విధంగా మంచిదే అయింది. లేకుండా వుంటే రోగాన్ని బాగుచెయ్యవలసిన వైద్యుని స్థానంలో వున్న నేను రోగిని చంపిన హంతకుణ్ణిగా మారి వుండేవాణ్ణి. పాపం నుంచి రక్షింప పడటం ఒక విధంగా నా అంతరాత్మకు సంతృప్తినిచ్చింది. కంప్యూటర్ డయాగ్రంని శ్రద్ధగా పరిశీలించాను. ధీరతోబాటు గిరి అనే ఒక కుర్రవాడు కూడా నాకు సహాయంగా నియమించబడ్డాడు. నాకు ఏయే పరికరాలు అవసరమో వాటిని ముందుగానే గ్రహించి

అందిస్తూ వున్నాడు.

కంప్యూటర్‌లోని ఏ భాగంలో పొరపాటు జరిగిందో తెలుసుకోవటం డిటెక్టివ్ పరిశోధన వంటిది. ఎన్నో అవరోధాలు. మరెన్నో సాధ్యాసాధ్యాలు. అన్నిటిని గురించి తీవ్రంగా ఆలోచించి సరియైన నిర్ణయం తీసుకోగలగాలి. ఆ మొదటి రోజు నేను నా గదికి వెళ్ళలేదు. కంప్యూటర్‌తోనే గడిపాను. నాతోబాటు బెరీ, ధీర, గిరి ముగ్గురూ ఒకరి తరువాత ఒకరు వుంటూనే వచ్చారు. కంప్యూటర్‌తో నన్ను ఏకాంతంగా వుండనివ్వడానికి సత్యా సమ్మతించి వుండడు. ఆ ద్వీపాన్ని కంట్రోల్ చెయ్యడానికి ఎంతో సమర్థవంతంగా కంప్యూటర్‌లో ప్రోగ్రాములను అమర్చిన తీరు నాకు చాలా ఆశ్చర్యం కలిగించింది. మాస్టర్ ప్రోగ్రాములన్నీ టేపురోల్సులో ఎంతో తెలివిగా భద్రపరచ

బడివున్నాయి. ఈ ద్వీపవాసుల జీవితాన్ని శాసించే ఆజ్ఞలు వీటిలోంచే పుట్టు కొస్తున్నాయి. ఈ టేపుల్లోని అయస్కాంత శక్తులు ఈ ద్వీపపు ఆయుర్దాయాన్ని, ఉత్పత్తి శక్తుల్ని కంట్రోల్ చేస్తున్నాయి. ఈ ప్రోగ్రాముల కంటూ ప్రత్యేకం ఒక లైబ్రరీ కూడా వుంది. ఈ ప్రోగ్రాములన్నీ నెంబర్ల వారీగా విభజింపబడి ఒక్కొక్క నెంబరు ఏ ప్రోగ్రాముని సూచిస్తుందో తెలుపడానికి ప్రత్యేకమైన ఛార్టు లున్నాయి. ఒక నిర్ణీతమైన కార్యక్ర మాన్ని ఒక క్రమ పద్ధతిలో అమలు జరపడానికి ఏర్పాటు చేయబడిన దాన్ని కంప్యూటర్ ప్రోగ్రాం అంటారు. ఒక్కొక్క సెల్‌కి ఒక్కొక్క ప్రోగ్రాం అని నిర్ణయించబడి వుంటుంది. ఉదాహర ణకు స్వర్గ ద్వీపంలోని ట్రాఫిక్ లైట్సుని కంట్రోల్ చేయటానికి ఒక ప్రోగ్రాము. అలాగే స్వర్గ ద్వీపవాసులకు రోజువారీ ఇవ్వబడే మందు కొలతను, దాని తీవ్ర తని నిర్ణయించి కంట్రోల్ చేసే మరొక ప్రోగ్రాము. ఆధునిక విజ్ఞాన శాస్త్రం సాధించిన వింతల్లో ఇదొకటి. మనిషి మేధస్సు మీద ఎన్నో ప్రయోగాలు జరిపి బయోకెమిస్ట్రీ కనుగొన్న కొన్ని అత్యాధునికమైన ఔషధాలని ఈ ద్వీప వాసుల రక్తంలోకి ప్రసరింపజేసివాళ్ళలో ప్రశ్నించే శక్తిని నశింపజేసి మర మను షులుగా, కీలు బొమ్మలుగా తయారు చేయడానికి ఈ కంప్యూటర్ సత్యాకి ఎంతో వుపయోగపడుతోంది. ఇవ్వ వలసిన మందు పరిమితిని నిర్ణయించ డానికి అప్పుడప్పుడూ కొందరి రక్తాన్ని శాంపిల్సు తీసుకుని పరిశోధించడం జరు గుతుంది. ఆ రక్త పరిశోధన ఫలితాలను కంప్యూటర్‌కి ఫీడ్ చెయ్యడం జరుగు తుంది. ఆ సమాచారాన్ని కోడిఫై చేసి మెడిసిన్ డోసేజ్‌ని నిర్ణయిస్తుంది కంప్యూటర్. మోతాదుకు మించి మందు రక్తంలో కలిస్తే కొన్ని రోజుల పాటు కేవలం డిస్టిల్డ్ వాటర్ రక్తంలోకి ఎక్కించే ఏర్పాటు కూడా వుంది కంప్యూటర్‌లో. కంప్యూటర్ ఆజ్ఞల ప్రకారం కెమికల్ రిజర్వాయర్లలో ఆ మందులు కలపబడి ఆరోగ్యకేంద్రాలలోని చిన్న చిన్న టాంకులకు సరఫరా చెయ్య బడుతున్నాయి. ప్రతిరోజూ వుదయం స్వర్గద్వీప వాసులు ఆరోగ్య కేంద్రాలకు వెళ్ళి తమకి నిర్ణయించబడిన మందు మోతాదుని తమ రక్తంలోకి ఎక్కించు కుంటారు. ఒకానొక ఆరోగ్య కేంద్రంలో నేనిదివరకు చూసిన—టెలిఫోను బూతు లాంటి గాజు ఛేంబర్‌లో మైక్రోఫోను వంటి మిషిన్ కింద చేతులుంచి మందుని రక్తంలోకి ఎక్కించుకునే ఏర్పాటు ఇటు వంటిదే. కంప్యూటర్‌లోని ఒక్కొక్క ప్రోగ్రాముని పరిశీలిస్తూ నేను తెలుసు కున్న వివరాలివి. ఆ కంప్యూటర్‌లో మొత్తం రెండు వందల పద్దెనిమిది ప్రోగ్రాములు పొందుపరచబడి వున్నాయి. ఒక్కొక్క ప్రోగ్రాముని ఆపరేట్ చేస్తూ ఏదైనా పొరపాటు జరుగుతుందా లేదా అని పరిశోధించాల్సి వుంది.

మూడు రోజులు రాత్రింబవళ్ళు కంప్యూటర్‌తో పోరాటం సలిపాను. నాకు కావాల్సిన స్పేర్‌పార్టులనీ, పరికరాలనీ, సమాచారాన్నీ ఎప్పటికప్పుడు అంద జేస్తూ సహకరిస్తున్నారు ధీర, గిరి. నాలుగోరోజు నా అన్వేషణ ఫలించింది. ఒక అతిసున్నితమైన భాగంలో కొన్ని చిప్స్ అరిగిపోయి వున్నాయి. వాటిని మార్చి ఆ స్థానంలో కొత్తవి అమర్చాను.




అలాగే మరికొన్ని భాగాల్లోని వెంట్రుకల కన్న సన్నని కొన్ని కేబుల్సు తెగిపోయి వుండటం గమనించగలిగాను. వాటిని ఎంతో జాగ్రత్తగా మళ్ళీ అతికించి సరైన స్థానాలకి కనెక్టు చెయ్యాల్సి వుంది. ఎంతో శ్రమతో, నైపుణ్యంతో కూడుకున్న కార్యం అది. ఎలాగైతేనేం దాన్ని కూడా పూర్తి చేయగలిగాను. అయిదోరోజు కంప్యూటర్ రిపేర్ పూర్తయింది. అన్ని ప్రోగ్రాముల్నీ మళ్ళీ మళ్ళీ వేసి చూశాను. ఎక్కడా ఒక్క పొరపాటు కూడా జరగ లేదు. నా పని పూర్తయింది. హాయిగా నిట్టూర్చాను. ఏదో పెద్ద భారం దిగిపోయి నట్టు తేలిగ్గా వుంది.

"మీ సత్యాని పిలిచి చెప్పు. మీ కంప్యూటర్ పూర్తిగా బాగుపడింది. ఇక ఏ లోపమూ వుండదు" అన్నాను ధీరతో. మొదటి సారిగా అతని మొహంలో నిజ మైన నవ్వునీ, అభినందననీ చూడగలి గాను. ధీర టెలిఫోనులో సత్యాకి విషయం తెలిపాడు. టెలిఫోను నా చేతికిచ్చాడు. సత్యా అభినందనల పరంపర.

"సత్యా! మీ కోరిక ప్రకారం కంప్యూ టర్‌ని రిపేర్ చేయడమైంది. ఇక నన్ను మా దేశానికి పంపే ఏర్పాటు చేయండి" అన్నాను.

"తప్పకుండా శర్మగారూ"

"సరే! అయితే వెంటనే విమానం సిద్ధం చేయించండి. నేనిక్కడికొచ్చి పది రోజులే అయిందో, పదిహేను రోజులే అయిందో లెక్క కూడా తెలీటంలేదు. నన్ను వెంటనే మా దేశం పంపించండి"

"అంత తొందరెందుకు శర్మగారూ? ఈ రోజు పూర్తిగా విశ్రాంతి తీసుకుని రేపుదయం వెళ్దురుగాని. ఈ రాత్రికి మీ గౌరవార్థం ఘనమైన వీడ్కోలు విందొ కటి ఏర్పాటు చేస్తున్నాం అందులో పాల్గొని మమ్మల్ని ఆనందపరచి వెళ్ళండి"

ఆ మాటలు విని గతుక్కుమన్నాను. మొదటిసారి విందులో పాల్గొనడం, చిక్కుల్లో ఇరుక్కోవటం గుర్తుకొచ్చింది. ఆ జ్ఞాపకాలింకా నన్ను భయపెడుతూనే వున్నాయి.

"ఇంతకు క్రితం జరిగిన విందుచాలు. మీ అనుమానానికి గురికావటం, మీరు వేసే యక్ష ప్రశ్నలకి సమాధానాలివ్వలేక సతమతమై పోవటం ఇక నేను భరించ లేను. దయచేసి నన్ను వెంటనే విమానం ఎక్కించి మా దేశం పంపించండి సత్యా గారూ"

"క్షమించాలి శర్మగారూ. మా అంత రంగిక భద్రత ననుసరించి మీతో అలా ప్రవర్తించాల్సిన నిర్బంధం ఏర్పడింది. మాకూ బాధగానే వుంది. ఈ విందులో అలాంటి దేమీ జరగదు. దయచేసి నిరాక రించకండి.ఈ రాత్రి మా విందులో మీరు పాల్గొంటున్నారు. అంతే" అని ఫోను పెట్టేశాడు సత్యా. ఇక నిరాకరించి లాభం లేదనుకున్నాను.

చాలా అట్టహాసంగా ఆడంబరంగా జరిగింది విందు. నేనిదివరకు కనీ వినీ ఎరుగని ఫలహారాలు, పానీయాలు. అంతా బాగానే వుంది కాని... విందు చివర జరి గిన ఆ సంఘటనని నేనెన్నటికీ మరిచి పోలేను. ఆ దృశ్యం తల్చుకుంటే నాకిప్ప టికీ ఒళ్ళు జలదరిస్తుంది. ఆ చివరి అంశంలో పాల్గొన్న వ్యక్తులు లత, జ్యోతిమూర్తి! విందు జరుగుతుండగా అడిగాను సత్యాని..

"జ్యోతిమూర్తిని, లతని మీరు ప్రాణాలతో వదిలి పెడతారనుకోలేదు. నా కోరికను మన్నించినందుకు నాకు

చాలా సంతోషంగా వుంది. వాళ్ళిద్దరినీ నిజంగా మీరు క్షమించినట్లేనా?"

"జ్యోతిమూర్తిని చంపటం వల్ల మాకు లాభంలేదు. అతనొక నిపుణుడైన గని కార్మికుడు. అతని అవసరం మాకు చాలావుంది. ఈ మధ్య అతని మానసిక ఆరోగ్యం కొంచెం దెబ్బ తినటంవల్ల అతనలా ప్రవర్తించాడేగాని లేకుంటే అతనెంతో మంచి పౌరుడు. ఆ రాత్రి కొన్ని ప్రత్యేక చికిత్సలద్వారా అతన్నీ, అతని ప్రియురాలైన లతనీ మళ్ళీ మామూలు మనుషుల్ని చేయగలిగాము"

హాల్లోని బల్బులన్నీ క్రమంగా కాంతిని తగ్గించుకుంటూ క్షణాల మీద హాలంతా చీకటితో నిండిపోయింది. నా మనస్సేదో కీడు శంకిస్తోంది.

"శర్మగారూ ! ఇప్పుడు విందు చివరి ప్రదర్శన జరగబోతోంది చూడండి. ఇందులో పాల్గొనువారు మీ మిత్రులే. చూడండి" నా భుజం మీద చెయ్యివేసి అన్నాడు సత్యా.

హాలు మధ్యలో గుండ్రంగా చిన్న వేదికలాంటిది ఏర్పాటు చెయ్యబడివుంది. ఆ వేదిక మీద మాత్రం స్పాట్ లైటుకాంతి పరుచుకుంది. జ్యోతిమూర్తి, లత, ఆ వేదిక మీద నిలబడి వున్నారు. లత నెగ్లిజీ లాంటి తెల్ల గౌను మాత్రం వేసుకుంది.

"అందరికీ వందనం" అన్నారిద్దరూ ముక్త కంఠంతో.

"ఏదో పొరపాటు జరిగి, ఏ విష క్రిములో మా రక్తంలోకి ప్రవేశించాయి. ఫలితంగా మా మతులు చెడి, మా ఆలోచనలు పెడదారి పట్టాయి. సకాలంలో సత్యా ఈ పరిస్థితి గమనించి మాకు తగిన చికిత్సలు జరిపించి మమ్మల్ని మళ్ళీ ఆరోగ్యవంతులను చేయగలిగారు. లేకుంటే మేమీపాటికి పిచ్చివాళ్ళమై, ప్రజలకు దూరమై, స్వర్గద్వీపానికి ద్రోహం తలపెట్టిన పాపులమై, ప్రజాద్రోహులమై శిక్షార్హులమై వుండేవాళ్ళం. మమ్మల్ని రక్షించిన సత్యాగారికి మా కృతజ్ఞతలు. ఇప్పుడు సత్యాగారి కోరిక ప్రకారం శర్మగారి గౌరవార్థం ఏర్పాటు చేయబడిన ఈ విందులో మా వినోద ప్రదర్శనని ప్రారంభిస్తున్నాం. అందరూ చివరిదాకా చూసి ఆనందించాలని మా కోరిక"

అంతా చప్పట్లు కొట్టారు. నాకిదంతా ఏదో కలలో జరుగుతున్నట్టుగా వుంది. నాకు ఆనాడు సముద్రతీరంలో కనిపించిన వ్యక్తులేనా వీళ్ళిద్దరూ అనిపించింది. ఆనాడు ఈ ఇద్దరిలో కనిపించిన ఆ విప్లవ తీవ్రత ఏమైంది? కళ్ళలోని ఆ క్రోధాగ్ని జ్వాలలేమైనాయి?

"శర్మగారూ! ఏమిటాలోచిస్తున్నారు? ప్రదర్శన తిలకించండి" అన్నాడు సత్యా.

వేదిక మీదికి చూపులు మరల్చాను. వేదిక మీద జ్యోతిమూర్తి లత దుస్తులను వొలిచేస్తున్నాడు. స్పాటులైటు వెలుగులో నగ్నంగా నిలబడిన లత శరీరం పాలరాయిలా మెరిసిపోతూ ఉంది. అంతా సంతోషంగా చప్పట్లు కొట్టి అనందిస్తున్నారు.

"సత్యా! ఏమిటిది? నేనీ ప్రదర్శన చూడలేను. నేను గదికి వెళ్ళిపోతున్నాను" అని విసురుగా లేవబోయాను.

"ఇది ప్రారంభం మాత్రమే. చివరిదాకా చూడండి శర్మగారూ" అంటూ నా భుజం మీద అదిమి కూర్చోబెట్టాడు సత్యా.




జ్యోతి మూర్తి మెడచుట్టూ చేతులు పెనవేస్తోంది లత. ఆమె వొళ్ళంతా నిమురుతూ, గాఢంగా తనకేసి హత్తుకుంటూ, ఆమెని చుంబిస్తున్నాడు జ్యోతిమూర్తి.

"శర్మా! మీ దేశంలో సినిమాల్లోనూ, నాటకాల్లోనూ, నవలల్లోనూ ప్రతి ప్రియురాలూ ప్రియుని కౌగిలిలో ప్రాణాలు వదలాలని కోరుకుంటుంది కదూ! అన్నంత పని చెయ్యగల ప్రియురాళ్ళు మాకు నిజజీవితంలోనే వున్నారు. చూస్తూ వుండండి".

జ్యోతిమూర్తి కౌగిలి నుంచి విడిపించుకుని మాకేసి తిరిగింది లత.

"మన స్వర్గద్వీప శాసనాల ప్రకారం ప్రేమించటం ఘోరమైన నేరమని తెలిసి కూడా నా మానసిక అనారోగ్య కారణంగా నేను జ్యోతిమూర్తి ప్రేమలో పడ్డాను. ఆరోగ్యం కుదుటపడినా ప్రేమ భావన తాలూకు విష బీజాలు నాలో ఇంకా మిగిలే వుంటాయనీ, అవి మళ్ళీ ఎప్పుడైనా మొలకెత్తే ప్రమాదం వుంటుందనీ సత్యా భావించారు. అందుకే వారి కోరిక ప్రకారం నాకు నేనై ఈ శిక్ష విధించుకుంటున్నాను" అంటూ జ్యోతిమూర్తి వేపుకు తిరిగింది లత. జ్యోతిమూర్తి ఆమె శరీరాన్ని మృదువుగా, ప్రేమతో నిమురుతూ మెడ దగ్గరికి చేతులు పోనిచ్చాడు. చివరిసారిగా అతణ్ని గాఢంగా పెనవేసుకుంది లత. అతని చేతులు ఆమె మెడ మీద తిన్నగా బిగుసుకుంటున్నాయ్. ఒకటి.. రెండు... మూడు... అవి క్షణాలో, నిమిషాలో తెలీటంలేదు. నా గుండెలు వేగంగా కొట్టుకోవటం వినిపిస్తోంది. లత శరీరం మైనపు ముద్దలా జ్యోతిమూర్తి చేతుల్లోంచి జారి కిందపడిపోయింది. ఎవరో వచ్చి ఆమె మృత దేహాన్ని తెల్లని గుడ్డల్లో చుట్టి అవతలికి జరుపుకు పోయారు. హాల్లో లైట్లు వెలిగాయి. మేజిక్ ప్రదర్శన ముగిసిన తర్వాత అందరికీ వంగి వంగి సలాములు చేసే మెజీషియన్ వలె చిరునవ్వుతో అందరికీ వందన సమర్పణ చేస్తున్నాడు జ్యోతి మూర్తి.




"ఎలా వుంది మా ప్రదర్శన?" అడిగాడు సత్యా.

"బ్రహ్మాండంగా వుంది. మీరు నిజంగా మనుషులు కారు సత్యాగారూ. మిమ్మల్ని ఎదిరించిన వాళ్ళని చాలా తెలివిగా వాడుకుంటున్నారు. మిగిలిన ఆ పది మందినీ ఏంచేశారు?"

"అందరి వివరాలూ చెప్పేశాడు జ్యోతిమూర్తి. ఇద్దరు గని కార్మికులు. ముగ్గురు ఆరోగ్య కేంద్రం వుద్యోగులు. ఇద్దరుశాంతిదళం మనుషులు. ఒకతను పరిపాలనా యంత్రాంగంలోని ప్రముఖ వ్యక్తి. విద్యాశాఖకు చెందిన అమ్మాయి ఒకతె. టెలికమ్యూనికేషన్స్ వుద్యోగి ఒకడు"

"ఏం చెయ్యదల్చుకున్నారు వాళ్ళందరినీ"

"ఇంకా ఏమీ నిర్ణయించుకోలేదు శర్మగారూ"

"సత్యా! ఎంత కాలంగా సాగుతోంది మీ రాజ్యం ఈ ద్వీపంలో?"

"ఎప్పుడో బ్రిటిషువారి హయాంలో మా పూర్వీకులు అతిచౌకగా కొని పడేసిన ప్రదేశం ఇది. ఈ ద్వీపంలో అతి విలు ఖనిజ సంపద వున్నదని కనుగొన్నద మా పూర్వీకులే. నా చిన్నప్పుడు మా తాతగారు చెప్పిన కొన్ని వింతలూ విశేషాలూ నా మనసు మీద చెరగని ముద్ర వేసినయ్. తను చదివినవీ, వూహించేవీ ఎన్నో చెప్పేవారు ఆయన. వీలైతే ఈ ద్వీపవాసుల జీవితాన్ని ఆ పద్ధతుల్లో తీర్చి దిద్దమని అనేవారు కూడా. అది పోనివ్వండి. మీరు మాకు చేసిన సహాయానికి ప్రతి ఫలంగా మీకేదైనా మంచి కానుక ఇవ్వాలనుకుంటున్నాము. మీకేం కావాలో కోరుకోండి"

"నాకు కావలసిందల్లా ఈ ద్వీపం నుంచి విడుదల. ఎంత త్వరగా ఇప్పిస్తే అంత సంతోషం."

సత్యా బిగ్గరగానవ్వేడు.

"ఎందుకలా అంటున్నారు శర్మా. మీ సందేహం ఏమిటో అర్థమౌతోంది. మిమ్మల్ని శాశ్వతంగా ఇక్కడే వుంచేసుకుంటామనీ, మా స్వర్గ ద్వీప వాసుల్లో మిమ్మల్ని ఒక ప్రజగా మార్చివేస్తామనీ అనుకుంటున్నారు కదూ. ఆ అవసరం లేదు మాకు. మీ దగ్గర్నుంచి నేర్చుకోవలసిన విషయాలు మా సాంకేతిక నిపుణులు తెలుసుకోగలిగారు. కంప్యూటర్‌లో అంతా సరిగ్గా వుందో లేదో మరొకసారి చెక్‌చేసి చూసిం తరువాత రేపుదయమే మిమ్మల్ని మీ దేశానికి పంపించే ఏర్పాటు చేస్తాం. భయపడకండి. ధీర, గిరి ఈ రాత్రికి కంప్యూటర్‌లో అన్ని ప్రోగ్రాములూ సరిగ్గా పని చేస్తున్నాయో లేదో పరిశీలిస్తారు"

"మా వూరెళ్ళి నేనీ ద్వీపం సంగతులన్నీ వాళ్ళకు చెబితే నాకు పిచ్చెక్కిందనుకుంటారు మా వాళ్ళు"

"తప్పకుండా మీరు వాళ్ళకి ఇక్కడి జీవితం గురించి చెప్పండి శర్మా. ప్రపంచ వ్యాప్తంగా ఏర్పడబోయే రేపటి సమాజానికి మా స్వర్గ ద్వీపం నాంది పలుకుతోంది. మార్గదర్శిగా వుంటుంది. తిన్నగా ఆలోచించి చూస్తే ఇక్కడి మంచి విషయాలు మీకు అర్థం కాకుండా పోవు"

ఏదో అనాలనుకుని మానుకున్నాను.

"వెళ్ళండి. మీ గదిలో విశ్రాంతి తీసుకోండి. రేపు విమానాశ్రయంలో కలుస్తాను" అని వెళ్ళిపోయాడు సత్యా.

* * *

నా గదికి చేరుకుని బట్టలు కూడా మార్చుకోకుండా అలసి పోయి మంచం మీదవాలి కళ్ళుమూసుకున్నాను. ఎవరో తలుపు తెరచిన శబ్దం వినిపించి మగతగా కళ్ళు తెరిచాను. నా ముందు గిరి నిలబడి వున్నాడు.

"ఏమైంది?" అన్నాను లేచి కూర్చుని.

"కంప్యూటర్‌లోని ఒక సర్క్యూట్ సరిగా పని చెయ్యటం లేదు. మిమ్మల్ని వెంటనే రమ్మంటున్నాడు ధీర" అన్నాడు గిరి. మళ్ళీ ఏం కొంప మునిగిందో అనుకుంటూ హడావిడిగా అతనితో వెళ్ళాను. కంప్యూటర్ గదినిండా నేలమీద పేపర్ టేప్ చిందర వందరగా పడివుంది. ధీర కంప్యూటర్ భాగాలని పరిశీలిస్తున్నాడు.

"ఏం జరిగింది?" అడిగాను.

టెలిటైపు కాయితాన్ని నా చేతికిచ్చి "మీరే చూడండి. నాకేమీ అర్థం కావటం లేదు" అన్నాడు ధీర. ఆ కాయితం చేపునిండా 016 55 537 3101 05 6789510 అంటూ అంకెలు నిండి వున్నాయి వరుసగా.

"ఏం, ఈ అంకెలు తప్పా?" అడిగాను.

"అసలు అంకెలే పడకూడదు. ఆ స్థానంలో వార్తలుండాలి" అన్నాడు ధీర.

నేను కాసేపు ఆలోచించాను.

"ఇంత చిన్న విషయానికి నన్ను పిలవాలా? గిరీ! నీక్కూడా ఈ విషయం తట్టలేదా?

పొరపాటు కంప్యూటర్‌లో కాదు. టెలిటైపు మిషిన్‌లో వుంది. ఇలా చూడండి. ఫిగర్ షిఫ్ట్ నుంచి లెటర్ షిఫ్టు మీదికి పడటం లేదు. ముందు ఈ మిషిన్‌ని మార్చండి. సరిపోతుంది" అన్నాను.

నేను చెప్పిన విధంగా టెలిటైప్ మిషన్ మార్చాడు.

"ఇప్పుడు ఆపరేట్ చేసి చూడు"

గిరి ఒక మీటని నొక్కాడు.

"ఇఇర ఓ జవు 55 సంవతసర అఅ లవున ఇండ ఇన వసరపు..." అని టైపు చేసుకుపోతోంది మిషిన్.

"ఇప్పుడు సరిగ్గా వుందా? ఏమిటో చదువు"

"ఈ రోజు 55 సంవత్సరాలు నిండిన వాసు..." అని చదిని "ఇప్పుడు సరిగ్గా వుంది" అన్నాడు ధీర. "క్షమించండి. ఆరు గంటల్నించీ ఇక్కడే వుండి పని చేయటం చేత బాగా అలిసిపోయాము. ఈ చిన్న పొరపాటుని గమనించలేదు" అన్నాడు.

"ఎలాగూ నా నిద్ర పాడైంది. ఇంకా ఏయే ప్రోగ్రాములు బాకీ వున్నాయో చెప్పండి. మీ చెకింగ్ అంతా పూర్తయ్యే దాకా నేనూ మీతోనే వుంటాను"

"ఇంకా కొన్ని మాత్రమే మిగిలి వున్నాయి శర్మగారూ"

"సరే. నేనూ మీకు సహాయం చేస్తాను"

"అలాగే"

గిరిని నాతో ప్రోగ్రాం లైబ్రరీకి తీసుకువెళ్ళాను.

ప్రోగ్రాం లైబ్రరీ తెరిచేవుంది.

"డిబగ్గింగ్ ప్రోగ్రాం నంబరెంత?"

"అది ఇదివరకే వేసి చూశాం"

"సరిగ్గా వుందా?"

"సరిగానే వుంది" అంటూ తలూపాడు గిరి.

"అలా అయితే రేండమ్ చెకింగ్‌గా ఒకటి రెండు ప్రోగ్రాములు మళ్ళీ వేసి చూస్తే సరిపోతుంది. చూడు. ఈ 063ని తీసికెళ్ళి వస్తోందో లేదో వేసిచూడు" అని గిరిని కంప్యూటర్ దగ్గరికి పంపించాను.

ఆ నెంబర్లు నాకు బాగా గుర్తున్నాయి. 118, 118ఏ ఆ ప్రోగ్రాం నెంబర్లు. వాటి లేబిల్సుని మాత్రం తారుమారు చేశాను.

కంప్యూటర్ గదికి తిరిగొచ్చాను.

కంప్యూటర్‌లో 063 రన్నవుతోంది.

"అంతా సరిగావుందా?" అడిగాను.

కంప్యూటర్ మీదే దృష్టి నిలిపివుంచిన ధీర, గిరి వెనక్కి తిరిగారు.

"అంతా సరిపోయింది శర్మగారూ"

"వెళ్ళి 036 గాని 198నిగాని తీసుకు రండి. వాటిని కూడా వేసిచూసేద్దాం"

అన్నాను.

"అవసరంలేదు లెండి. అంతా సరిగ్గానే వుంది" అన్నారిద్దరూ.

"మరైతే మీ చెకింగంతా పూర్తయినట్టేనా?" అడిగాను.

"అయినట్టే"

"నేవెళ్ళి పడుకోవచ్చా! మళ్ళీ వచ్చి లేపరుకదా?" అడిగాను నవ్వుతూ.

"మీరు వెళ్ళి హాయిగా పడుకోండి శర్మగారూ"

గదికి తిరిగొచ్చి ఆదమరచి నిద్రపోయాను.

తెల్లవారింది.

బెరి వచ్చి నన్ను లేపాడు.

"విమానం సిద్ధంగా వుంది. బయలు



దేరండి శర్మగారూ" అన్నాడు. పావు గంటలో తయారై బయలుదేరాను.

విమానాశ్రయంలో గాలి బలంగా వీస్తోంది. ఇన్నర్ సర్కిల్ సభ్యులందరూ నాకు వీడ్కోలివ్వడానికి వరుసగా నిలబడి వున్నారు. నేనెక్కి వచ్చిన అదే విమానం హంసలా నిలబడి వుంది నా కోసం. అంతా సత్యా రాక కోసం వేచి వున్నారు.

ఎవరో ఒకతను పెద్ద సూట్‌కేసు లాంటి పెట్టెను విమానంలోకి ఎక్కిస్తున్నాడు.

"ఎవరికోసం అది. నేనేమీ లగేజి పట్టుకురాలేదే" అన్నాను

"మీ కోసమే. మా కానుకలు. మీ చెల్లికి, అమ్మగారికి సత్యా పంపుతూన్న ప్రత్యేకమైన కానుకలు. అదుగో సత్యా వస్తున్నారు"

సత్యా కారులోంచి దిగి చిరునవ్వుతో నా దగ్గరికి వచ్చాడు.

"శర్మగారూ! మీరు చేసిన సహా



యాన్ని మేమెన్నటికీ మరిచిపోము. మా వల్ల మీకు కొన్ని ఇబ్బందులు కలిగిన మాట నిజం. మేమూ చాలా విచారిస్తున్నాం. అనివార్యకారణాల వల్ల అలా జరిగినందుకు మమ్మల్ని క్షమించాలి. మా సామాజిక జీవితంలోని కొన్ని అంశాలని మీరు అంగీకరించక పోవచ్చు. కాని ఒక్కటి మాత్రం గుర్తిస్తే చాలు. జీవితంలో ఏదీ వుచితంగా లభించదు. ఒకటి పొందాలనుకున్నప్పుడు మరొకటి వదులుకోవాలి. తప్పదు.

మా ద్వీపవాసులు కొన్ని త్యాగాలు చేసి, కొన్ని సాధించగలిగారు"

"మీ ద్వీపం వర్ధిల్లాలి. మీ ద్వీప వాసులు వర్ధిల్లాలి. మీ రేపటి సమాజం వర్ధిల్లాలి. నేను మళ్ళీ ఇక్కడికి రావటం సాధ్యం కాకపోవచ్చు. నాకు మాత్రం ఒక్కటనిపిస్తోంది సత్యాగారూ. రానున్న కాలంలో మీరింకా ఎన్నో అద్భుతాలను సాధించగలరు. అప్పుడు ఈ 2080 కంప్యూటర్ శక్తి మీకు చాలకపోవచ్చు. ఇంతకంటె శక్తివంతమైన థర్డ్ జనరేషన్ కంప్యూటర్ అవసరం కావచ్చు"

"ఈ విషయాలు మేం ముందుగానే ఆలోచించి అందుకు తగ్గట్టుగా అన్ని ఏర్పాట్లకూ ఇప్పట్నించే తయారు కావటం ప్రారంభించాం శర్మగారూ"

"మీరు నిజంగా చాలా గొప్పవారు సత్యా. రాబోయే వైజ్ఞానిక తరానికి యుగ పురుషుల వంటివారు మీరు".

"మీరు ఇంటికి తిరిగివెళ్ళే సంతోషంలో నన్ను అమితంగా పొగిడేస్తున్నారు. ఏదీ మీ చేతిని ఇలా ఇవ్వండి" అంటూ ఒక బంగారపు వాచీని నాకు బహూకరించాడు.





నన్ను గాఢంగా హత్తుకున్నాడు. అతను నా పట్ల కనబరుస్తున్న అభిమానానికి ఒక్క క్షణం చలించిపోయాను.

"వెళ్ళిరండి శర్మా. మమ్మల్నీ, మా ద్వీపాన్నీ మర్చిపోకండి" అంటున్నాడు. విమానం మెట్లెక్కుతూ అందరివేపూ తిరిగి చెయ్యి వూపుతూ వీడ్కోలు తీసుకున్నాను.

"శర్మా ఒక్క నిమిషం" అన్నాడు సత్యా.

"మీ విమానాశ్రయంలో క్లియరెన్సు దొరక్కపోవచ్చు. కిందటిసారెలాగో తప్పించుకోగలిగాము. అంచేత ఈ విమానం హైదరాబాద్‌లో దిగడానికి వీలుపడదు. గండిపేట దగ్గరలో రెండో ప్రపంచయుద్ధ కాలంలో వుపయోగించిన ఒక చిన్న విమానాశ్రయం వుంది. అక్కడ దిగాల్సి వుంటుంది మీరు" అన్నాడు సత్యా.

"ఫరవాలేదు. గండిపేట చేరుకుంటే హైదరాబాద్ చేరుకున్నట్టే. బోలెడు బస్సులున్నాయి అక్కడ్నుంచి. వుంటాను" అని విమానం లోపలికి అడుగుపెట్టాను. విమానం తలుపులు మూసుకున్నాయి. విమానం రన్‌వేమీంచి పైకి లేస్తోంది. కొండలు, లోయలు క్రమంగా దూరమవుతున్నాయి. స్వర్గ ద్వీపం క్రమంగా దూరమై సముద్రం మధ్య ఒక చిన్న పచ్చబొట్టుగా కనిపిస్తోంది.

మరికొన్ని గంటల్లో హైదరాబాద్‌లో వుంటాను. నా ఆఫీసు...రమ్మీ...సినిమాలు...అబిడ్స్‌రోడ్ రద్దీ...నాకిష్టమైన రవ్వ ఇడ్లీలు...అబ్బా ఆ జీవితానికి దూరమై కొన్ని యుగాలైనట్టుగా వుంది. వాచీ చూసుకున్నాను. నేను చేసిన సహాయానికి ప్రతిఫలంగా సత్యా బహూకరించిన

బంగారు వాచీ! నేను ఆఖరి క్షణంలో ఏం చేశానో తెలిసివుంటే ఈ బంగారు వాచీకి బదులు నా చేతులకు ఇనప సంకెళ్ళు తగిలించి వుండేవాడు సత్యా.

సత్యాకి నేను చేసింది సహాయమా? ద్రోహమా! ఆఖరుక్షణాన నేనెందుకలా ప్రవర్తించానా అని ఆత్మపరీక్షచేసి చూసుకున్నాను. అంతకంటె నేను మరోలా ప్రవర్తించలేనని తెల్సుకున్నాను. అవును నేను భారతీయుణ్ణి. శతాబ్దాల భారతీయ సంస్కృతి, నా జాతి జీవనవిధానం నా జీన్స్‌లో నిక్షిప్తమై వుంది. నా రక్తంలో నరనరాల్లో జీర్ణించుకుపోయి వుంది.

నాకు మేడలూ కావాలి. పూరి గుడిసెలూ వుండాలి...

షేక్స్‌పియరూ కావాలి, శివ సాహిత్యమూ కావాలి...

రామాయణగాథలూ చదవాలి, రంకు పురాణాలూ వినాలి...

శంకర భాష్యాలూ కావాలి, సెక్సు బూతులూ కావాలి...

'మా భూములూ' కావాలి, 'మరో చరిత్ర'లూ చూడాలి...

భరతనాట్యమూ కావాలి, కాబరే డాన్సులూ వుండాలి...

త్యాగరాజ కీర్తనలూ కావాలి. విప్లవ గీతాలూ కావాలి. ఒకడుగు ముందుకు వేస్తున్నా రెండడుగులు వెనక్కినడిచే జీవితం కావాలి–మార్పులేని, వైరైటీలేని, వైవిధ్యం లేని జీవితం–అది ఎటువంటిదైనా నేను భరించలేను. నా పూర్వాను సరిపడని జీవిత విధానాన్ని నేను అంగీకరించలేను. చేతనైతే ధ్వంసం చేయడానికైనా సిద్ధపడతాను. అందుకే రాత్రి ప్రోగ్రాం లైబ్రరీలో ఆ చిన్న మార్పు చేశాను రహస్యంగా. ప్రోగ్రాం నెంబర్ లేబుళ్ళను తారుమారు చేశాను.

ఫలితంగా 118, 118 ఏ ప్రోగ్రాములు తారుమారయినాయి. 118 అనే ప్రోగ్రాం రోజూ స్వర్గ ద్వీపవాసుల రక్తంలోకి ఎక్కించవలసిన మందు మోతాదుని నిర్ణయిస్తుంది. మందు మోతాదు మించినప్పుడు మందుకు బదులు కేవలం డిస్టిల్డ్ వాటర్‌ని మాత్రమే ఎక్కించే ప్రోగ్రాము 118 ఏ. మరో నెల రోజుల పాటు స్వర్గ ద్వీప ప్రజలకు మందుకు బదులు రక్తంలోకి డిస్టిల్డ్ వాటర్ మాత్రమే ఇంజెక్టు చేయడం జరుగుతుంది. వారం రోజులు ట్రీట్‌మెంటు మిస్సయినందుకే జ్యోతిమూర్తి లత, మరో పదిమందిలో చైతన్యం మేల్కొంది. తమకి సరిపడని వ్యవస్థని మార్చి వేసేందుకు వుద్యమం ప్రారంభించారు. ఆ ద్వీప వ్యవస్థని నిర్మూలించాలనే ఆలోచనతో ఆపదిమందీ విప్లవకారులైనారు. ప్రోగ్రాం నెంబర్లని తారుమారు చెయ్యడం వల్ల ఇక నుంచి కనీసం నెలరోజులపాటు స్వర్గద్వీప ప్రజల్లో కొన్ని వేలమంది ఔషధ ప్రయోగం నించి తప్పించుకుంటారు. వాళ్ళంతా చైతన్యంపొంది విప్లవం లేవదీయటం చాలా తేలికైన విషయం. మరో నెల రోజుల్లో ఆ ద్వీప వ్యవస్థ మీద ఆ ప్రజలు తప్పకుండా తిరగబడతారు. అప్పుడు ఆ మూడున్నర లక్షలు ప్రజలు కళ్ళు తెరవక తప్పదు.

విమానం కిందికి దిగుతోంది. గండిపేట చెరువు దగ్గర పడుతోంది. అదుగో అదే హైదరాబాద్ నగరం. విమానం నేలని తాకింది.



# చతుర

సంగీతం అంటే ప్రతి ఒక్కరూ చెవి కోసుకోకపోయినా విని ఆనందించని వారు అరుదు. తెలుగువారికి వయొలిన్ విద్వాంసుడు ద్వారం వెంకటస్వామి నాయుడు ఎలాగో కన్నడిగులకి టి. చౌడయ్య అంతటివాడు. అతని జ్ఞాపకార్థం ఏడు తీగలున్న వయొలిన్ ఆకారంలో ఒక థియేటర్ కట్టాలని బెంగుళూరు సంగీత అకాడమీ చీఫ్ కె. కె.

## వయొలిన్ థియేటర్

మూర్తి ఓ శుభముహూర్తాన నిశ్చయించుకుని అవసరమైన పెద్దలను కలుసుకున్నాడు.

బెంగుళూరు కార్పొరేషన్ సంకిటాంక్ రోడ్లో స్థలం ఇవ్వడానికి ఒప్పుకుంది. అతను పొదుపుచేసి దాచుకున్న డబ్బు, ఉత్సాహవంతులైన ప్రజలు విరాళంగా ఇచ్చిన సొమ్ము కలిపి 1973లో అప్పటి రాష్ట్రపతి వి. వి. గిరి చేత శంకుస్థాపన చేయించడం అయింది.




ఆ తర్వాత వున్నట్టుండి నిర్మాణం పని ఆగిపోయింది. దాంతో కార్పొరేషన్ వారు బిల్డింగ్ కట్టదల్చుకున్నారా లేదా, స్థలం ఇచ్చేదాకా వున్న ఉత్సాహం ఇపుడేమైంది అని ప్రశ్నలవర్షం కురిపించడం మొదలెట్టారు.

మూర్తి దాన్నొక ఛాలెంజ్‌గా తీసుకుని నిధులకోసం కర్ణాటక ప్రభుత్వాన్ని, సిండికేట్ బ్యాంకును, ప్రజలను చేయి చాచి అడిగారు. అందరూ కాదనకుండా సాయం చేయడంతో 1976లో తిరిగి పని ప్రారంభమైంది. ఎన్నో కష్టనష్టాలకోర్చి థియేటర్‌కి వయొలిన్ రూపం తీసుకొచ్చారు. ప్రపంచంలోని అత్యద్భుత థియేటర్లలో ఒకటిగా దాన్ని పేర్కొనవచ్చు.

ఈ చౌడయ్య మెమోరియల్ హాల్లో 1045 మంది కూర్చోడానికి వీలుగా పుష్‌బ్యాక్ కుర్చీలున్నాయి. ఇది బెంగుళూరు నగర టూరిస్ట్‌మాప్‌లో చోటుచేసుకుంది అప్పుడే.

పోర్టికోలోకి వెళ్ళగానే చౌడయ్య నిలువెత్తు చిత్రం దర్శనమిస్తుంది. చిత్రం దగ్గరికి వెళితే చౌడయ్య వయొలిన్ మృదు మధురంగా వినిపిస్తూంటుంది.

ఈ థియేటర్లో సంగీత కార్యక్రమాలు, సభలు లేనపుడు మంచి సినిమాలు చూడ





# ప్రపంచం

వచ్చు. అందుకు ప్రత్యేకించి రెండు ప్రొజెక్టర్లు వున్నాయి.

వందమంది సభ్యులతో ప్రారంభమైన ఈ సంగీత సంస్థ పెరిగి పెద్దదయి ఇపుడు వెయ్యిమంది సభ్యత్వం కోరుకున్నవారు వెయిటింగ్ లిస్టులో వున్నారు. ఈ థియేటర్ వున్న రోడ్డుకి ఇదివర్లో వుండే శంకీ రోడ్డు అన్న పేరు తీసేసి చౌడయ్యా వీధిగా వ్యవహరిస్తున్నారు. కర్ణాటక ప్రభుత్వం ప్రతినెలా చౌడయ్యా గారి సతీమణికి పెన్షన్ ఇవ్వడమేగాక గృహ నిర్మాణం కోసం ఉచితంగా స్థలాన్ని కూడా ఇచ్చారు.

## పునరాగమనం

యుద్ధంలో శత్రువు చిక్కితే చాలు వాణ్ణి దాచేస్తారు. 1971లో జరిగిన పాకిస్తాన్ యుద్ధంలో ఒక భారతీయ మిలిటరీ కల్నల్ శత్రువుల చేతుల్లో చిక్కిపోయాడు. ఆనాటి నుండీ అతని ఆచూకీ లేదు. అతని భార్య నిరీక్షించి నిరీక్షించి ఇంక లాభం లేదని ప్రభుత్వం చూపించిన ఉద్యోగంలో చేరి అచిరకాలంలోనే ఐ. ఎ. ఎస్. స్థాయికి ఎదిగి పోయింది. ఆ తర్వాత భర్తకు సన్నిహితుడు, దగ్గరి స్నేహితుడు అయిన వ్యక్తిని పెళ్ళాడింది. కల్నల్ వలన పుట్టిన కొడుకు గాక రెండో పెళ్ళి తర్వాత మరో ఇద్దరు పిల్లలు పుట్టారు. ముచ్చటగా ముగ్గురు పిల్లల్తోను, మురిపాల భర్తతోను నిశ్చింతగా కాపురం చేసుకుంటూ వుంది.

ఓ రోజు ఆమె ఆఫీసు విధి నిర్వహణలో తల మునకలుగా వున్న సమయంలో ఆమెను చూడ్డానికి ఎవరో వచ్చారని జవాను చెప్పాడు. బైట కూర్చోబెట్టమని చెప్పింది. పనంతా అయిన తర్వాత ఓ రెండు గంటలకి బైటికి వచ్చి అక్కడి కుర్చీలో కూర్చున్న వ్యక్తిని చూసి అవాక్కయి పోయింది. భూతమూ, ప్రేతమూ కాదు సజీవంగా కళ్ళ ముందు కనబడుతున్నాడు ఆమె మొదటి భర్త



కల్నల్. ఆమె మనసులో కోటి సుడి గుండాలు. ఆ మానసిక సంఘర్షణ భరించలేక మూర్ఛపోయింది.






పాపం! ఆమె ఇంకా ఎటూ తేల్చుకో లేకపోతోంది. ఆమె మాటెలా వున్నా సినిమా వాళ్ళకు మాత్రం మంచి మసాలా వున్న ఇతివృత్తం గదా ఇది.

## టాప్ సీక్రెట్

మన టి.వి. కార్యక్రమాలు చూసిచూసి విసుగెత్తి ఎపుడు కట్టేద్దామాని చూస్తుంటే అమెరికాలో ఏకబిగిన 57 రోజులు ప్రదర్శింపబడిన 'దల్లాస్' అనే నాటకాన్ని 30 కోట్ల మంది అమెరికన్లు ఎంతో ఆసక్తిగా చూశారు.

అమెరికా దూరదర్శనిలో ప్రదర్శింప



బడిన ఈ డ్రామా అప్పటి వరకూ వున్న టి. వి. రికార్డుల నన్నింటినీ బద్దలు కొట్టింది. ఇందులోని కథానాయకుడు దల్లాస్ నగరంలో ఓ పెద్ద పారిశ్రామిక వేత్త. నిజజీవితంలో సినిమాల్లో విలన్‌ను మించిపోయినట్లు బ్యాంకుల్ని పట్టపగలు దోచుకుంటాడు. ఎంతటి రాజకీయ నాయకున్నైనా సరే చూపుడు వేలితో డాన్స్ చేయించేసాడు. భార్యను ఎంతో క్రూరంగా చూసే ఇతను పిల్లలకు ప్రేమామృతం పంచియిస్తాడు. అందరికీ జె.ఆర్.గా పరిచయమైన ఇతని పూర్తి పేరు జాన్ రాస్ ఎడింగ్. నాటకం చివరి అంకంలో జె.ఆర్.ని ఎవరో తుపాకితో కాలుసారు. దల్లాస్‌లోని దల్లాస్ మెమోరియల్ ఆస్పత్రిలో బెడ్‌మీద పడుకుని విశ్రాంతి తీసుకుంటున్న జె.ఆర్.కి ఎవరు తనను షూట్ చేయడానికి ప్రయత్నించారో తెలుసునంటాడు. కానీ చెప్పడు.

బ్రిటన్లోని దూరదర్శిని ప్రేక్షకులకు హత్యా ప్రయత్నం చేసిన ఆగంతకుని పేరు సరిగ్గా చెప్పకలిగిన వారికి మంచి ఖరీదైన బహుమానం ఉందని దూరదర్శిని ప్రకటించింది కూడా.

ప్రతివారూ ఈ గొడవతోనే తల మునకలై వున్నారు. వాళ్ళనంతటి సస్పెన్స్‌లో ముంచిన నటుడు 'లారీహాక్‌మన్'. ఈ పాత్ర ధరించినందుకు అతనికి సంవత్సరానికి రెండుకోట్ల రూపాయలు లభిస్తాయి.




ఇంతకీ లారీ హాక్‌మన్‌కి కూడా తెలీదు నాటకంలో తనను ఎవరు కాల్చారో...అంటే స్క్రిప్టు అంత పకడ్బందీగా దాచిపెట్టారన్న మాట.

## దంత చరిత్ర

ఇప్పుడంటే మన ముఖాలను కాస్త చూడగలుగుతున్నాం గాని, మన పూర్వీకుల ఆకారాలు ఎలా వుండేవో తెలుస్తే ఆంజనేయ దండకం చదవాల్సి వస్తుంది. పూర్వం మనుషల దంతాలు ఇప్పటి మన దంతాలకన్నా మూడురెట్లు పెద్దవిగా వుండేవట. అప్పట్లో పచ్చి మాంసం తినే

వారుగనక వారికి అంత పెద్ద దంతాలు అవసరమయ్యేవి. తర్వాత నిప్పును కనుక్కోవటంతో మాంసాన్ని వండటం



ప్రారంభించారు. వండిన పదార్థాలను తినటం సులభమే గనక మనిషి దంతాల పరిమాణం తగ్గడం ప్రారంభించింది. అయితే శాస్త్రజ్ఞులకి ఒక విషయం మాత్రం అర్థం కాలేదు. మనిషికి పూర్వం వున్న 32 పళ్ళు ఇప్పటికీ ఎందు కున్నాయా అన్న సందేహం తీరలేదు వారికి. మనకిప్పుడు పైన ఆరు పళ్లు, కింద ఆరుపళ్లు వుంటే చాలు మనం తినే తిండికి. పరిణామ క్రమంలో ఉపయోగం లేనివన్నీ నశిస్తాయన్నది సిద్ధాంతమైతే అవసరం లేని మిగిలిన పళ్లు నశించ కుండా ఇప్పటికీ ఎలా వున్నాయి, ఎందు కున్నాయి...పరిణామక్రమంలో ఏదో పొరపాటు జరిగి వుండాలి అని శాస్త్ర వేత్తలు అభిప్రాయ పడుతున్నారు.

## ప్రేమకుటీరం

హిమాచల్ ప్రదేశ్ టూరిజం డిపార్టు మెంటు వారికీమధ్య ప్రేమికుల మీదా, కొత్తగా పెళ్ళయిన జంటలమీదా ప్రేమాభి మానాలు పొంగి పొర్లుతున్నాయి. ఆ సంస్థవారు ఛెయిల్ అనే ఊళ్ళో ఓ 'ప్రేమకుటీరం' ప్రారంభించారీమధ్య. పైకి చూడ్డానికి ఓ చిన్న కుటీరంలా కని పించే దీని లోపల అత్యంతాధునిక సౌక ర్యాలు అమర్చబడి, అత్యంత శోభాయ మానంగా అలంకరించబడి వుంటాయి. ఖరీదైన హోటలు రూమ్సు కూడా దీని ముందు దిగదుడుపే. గదిలోని గోడలు, కప్పు కంతటికీ నిలువెత్తు అద్దాలు అమ ర్చారు. ప్రత్యేకంగా తయారు చేసిన సరి కొత్త డిజైను మంచాలు, తివాసీలు గదికి నిండుదనాన్నిస్తాయి.

గోడల మీద శృంగార స్ఫోరకము లైన చిత్రపటాలు, షెల్ఫులలో శృంగా రాన్ని రంగరించి రాసిన పుస్తకాలతో బాటు, ప్రేమికులు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ వంట చేసుకుందుకు వీలుగా సకల సదుపాయాలతో ఓ చిన్న వంట



యిల్లు కూడా వుంది.

ఈ బాదరబందీ అంతా ఎవడు పడతారనుకునేవారికి చక్కని బ్రేక్ ఫాస్టు అందించే ప్రయత్నాలు చేస్తున్నారు

కార్పొరేషన్ వాళ్ళు. అసలు నిజానికి కుటీరంలో ఇదివరకు తోటమాలి వుండే వాడు. టూరిజం వారికీ సదభిప్రాయం కలిగిన తక్షణం అతని మకాం మార్చి 50 వేల ఖర్చు పెట్టి దాని ఆకారం మార్చి ప్రేమకుటీరం చేశారు. ఇక్కడ హనీమూన్‌కి వయసులో వున్న వారే కాదు ముసలివారు కూడా మధుర స్మృతులు నెమరేసుకుందుకు రావచ్చనంటున్నారు నిర్వాహకులు. సో ఫీరో గ్రానీస్.

## పాట్లు

పెళ్ళికాకముందే తల్లులు కావడం మన దేశంలో నేరమైతే, 'ఫర్వాలేదు ఎలాగోలా పిల్లలు పుట్టి జనాభా పెరిగితే చాలనే' స్థితివుంది రష్యాలో. అక్కడ పద్ధెనిమి దేళ్ళు నిండిన ప్రతి యువతీ గర్భ స్రావం చేయించుకోవచ్చు. 1976 లెక్కల ప్రకారం ఆ సంవత్సరం జరిగిన అబార్షన్లలో రష్యాదే అగ్రస్థానం. ఏడాదిలో దాదాపు ఒక కోటి అబార్షన్లంటే మాటలా మరి!



1980 జనాభా లెక్కల ప్రకారం రష్యాలో పురుషుల కన్నా స్త్రీలు బాగా ఎక్కువగా వున్నారని తెలిసింది.

దాంతో మన సత్వవేత్తలు, జనాభా లెక్కల నిపుణులు, తదితర శాస్త్రవేత్తలు అందరూ ఏక కంఠంతో అవివాహిత కన్యల్ని ఉద్దేశిస్తూ

"భార్యా భర్తలు ఒకరి పట్ల ఒకరికి ప్రేమానురాగాలు, గౌరవంలేకుండా పెళ్ళిళ్లుచేసుకుని పిల్లల్ని కనేకంటే పెళ్ళికాకుండా తల్లులైతే వెయ్యిరెట్లు నయం" అని నొక్కి చెబుతున్నారు.

రష్యాలో నానాటికీ జనాభా క్షీణిస్తూ వుంటే సోవియట్ మధ్య ఆసియాలోని ముస్లిం దేశాల్లో జనాభా విపరీతంగా పెరిగిపోతోందని వాపోతు



న్నారు నిపుణులు. మన వాళ్ళని దిగుమతి చేసుకుంటే బావుణ్ను. ఫారిన్ ఛాన్స్ తగులుతుంది అలాగైనా.

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యంచిందే గట్టి పళ్ళు



## కోల్గేట్ డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోమకుంది. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

**కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:**



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుపోయి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

## నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!




DC.G.74 TL

# గాడిద సంత

మనవాళ్ళు కోసం వచ్చినప్పుడు ఎంత అడ్డగాడిదా, గాడిదా అని పిల్లల్ని తిట్టినా గాడిద ప్రాముఖ్యాన్ని, అది పడే కష్టాన్ని గుర్తించారనడానికి ఉజ్జయినిలో ప్రతి ఏటా నవంబర్ నెలలో జరిగే గార్దభ సంతే




తార్కాణం. గుర్రానికీ, గాడిదకీ పోలికల్లో సామీప్యంవున్నా ప్రవర్తనలో చాలా తేడా వుంది. ఎంత బరువు వీపు మీద పడేసినా కిక్కురుమనకుండా వెంట మోసు కొస్తుంది గాడిద.

గత ఏడాది జరిగిన సంతలో దాదాపు నాలుగు వేల మంది గాడిద యజమానులు పాల్గొని ఎంతో లాభానికి తమ గాడిదలను ఇతర ప్రాంత వ్యాపారస్తులకి అమ్మేరు. యజమానులు, వ్యాపారస్తుల మాట ఎలావున్నా ఈ సంత గాడిదల పాలిటి వరం అని చెప్పుకోవచ్చు. ఆ వారం రోజులూ వాటి సంబరం అంతా ఇంతా కాదు. ఎందుకంటే ఇతపుల వాటితో తీసిపోకుండా కంటికి నదురుగా కనబడేందుకు గాను సంతకు కొన్ని వారాల ముందు నుంచే వాటికి తైలంతో శరీరం అంతా మర్దనా చేస్తారు. మంచి ఖరీదైన ఆహారం పెడతారు. నిజానికి అంతకు ముందెప్పుడూ అవి అంత రుచికరమైన ఆహారన్ని తిని వుండలేదు.

మూడు రోజుల్లో 3 వేల గాడిదలు అమ్ముడుపోయాయి. అందులో చిన్న గాడిద 1.5 క్వింటాళ్ళ బరువును మోసే సామర్థ్యాన్ని కలిగి వుండడంతో ఒక వ్యాపారస్థుడు దాన్ని 1500రూపాయలకి కొన్నాడు. గత 25 ఏళ్లుగా సంతలో పాల్గొంటున్న గాడిద యజమానులున్నారు. పది గాడిదలమ్మి పది వేలు సంపాదించి, చేస్తే గాడిదలవ్యాపారమే చెయ్యాలని నిశ్చయించుకున్న వాళ్ళున్నారు. ఇంతవరకూ తమతమ గాడిదల మీద ఎవరూ నష్టపోలేదు. అందుకే చాలా మంది తమ పెంపుడు గాడిదల వల్ల చేయించుకోవల్సిన గాడిద చాకిరీ అంతా చేయించుకుని తైలంతో మాలిష్ చేసి నిగనిగమనిపించి సంతలో అమ్మేసి డబ్బు చేసుకుంటారు. అలా చేయడానిక్కూడా ఎంతో తెలివి తేటలు అవసరం. కొనేవాళ్లు మరీ అంత గాడిదలేం కారు గదా!

# జంతువుల బ్యాంక్

ఈమధ్య మద్రాస్ వెటర్నరీ సైన్స్ కాలేజీలో వైద్యంకోసం తెచ్చిన

తొమ్మిది నెలల కుక్కపిల్ల సమయానికి ఎక్కించడానికి రక్తంలేక అక్కడికక్కడే మరణించింది. కుక్కలకి వచ్చే వైరస్ వ్యాధివల్ల రక్తహీనత ఏర్పడి రక్తం దొరక్క ఎన్నో కుక్కలు దారుణంగా చనిపోవడం చూసిన ఆ కళాశాల డాక్టరు త్యాగరాజుగారికి మనుషులకు లాగే జంతువులకి కూడా బ్లడ్ బ్యాంక్ ఎందుకుండకూడదు అని ఒక ఆలోచన వచ్చింది.




ప్రస్తుతం జంతువులకి రక్తం అవసరమైనపుడు అప్పటికప్పుడు తాత్కాలిక ఏర్పాట్లేవో చేస్తున్నారు గానీ శాశ్వత సౌకర్యాలు లేవింతవరకూ. సరియైన సమయానికి సరియైన రక్తం ఎక్కించలేక పోవడంవల్ల వందలాది పెంపుడు జంతువులు మరణిస్తున్నాయి.

ఇటువంటి స్థితిలో జంతువుల బ్లడ్ బ్యాంక్ తెరిచిన కీర్తి మద్రాసు వెటర్నరీ సైన్స్ కాలేజీకే దక్కుతుంది.

ఇలా సేకరించిన రక్తం కేవలం శస్త్రచికిత్సలకేగాక ఇతరత్రా కూడా ఉపయోగపడుతుంది. కొన్ని జంతువులు తమ ఆహారాన్ని కూడా తాము తినలేనంత బలహీనంగా వుంటాయి. అలాంటివాటికి రక్తంలో కొన్ని విటమిన్లను కలిపి శరీరంలోకి ఎక్కిస్తారు. అలాగే ఈసే కాలంలో కూడా చాలా రక్తస్రావమయి రక్తం ఎక్కిస్తేనే గాని దాని ప్రాణం నిలబడని స్థితి ఏర్పడుతుంది.

కానీ మానవ రక్తంలా గాక జంతు రక్తం ఆరు వారాలపాటు మాత్రమే భద్రపర్చడానికి వీలవుతుంది. ఎంత జాగ్రత్తగా భద్రపర్చిన రక్తమైనా ఆరు వారాల లోపలే వాడేయాలి.

## ఎలక్ట్రిక్ కార్

పెట్రోలు ధరలు రోజురోజుకీ రోదసిలోకి దూసుకుపోతున్న తరుణంలో కాస్తోకూస్తో తెలివితేటలున్నవారి బుర్రలు అమోఘంగా పనిచేస్తున్నాయి. పెట్రోలు లేకుండా కారు నడపడం ఎలా అని ఇరవైనాల్గంటలూ వారి ఆలోచనలు పదును పెడుతూనే వున్నారు. పంజాబ్ ఇంజనీరింగ్ కాలేజీ విద్యార్థి మలేకియట్ సింగ్, చండీఘర్లో పేరుమోసిన బిజినెస్ మన్ దివాకర్ సహూంజా కలిసి ఓ కారుకున్న పెట్రోలు ఇంజన్ను తీసి దానిస్థానే ఓ ఎలక్ట్రిక్ మోటారును అమర్చారు. ఈ మోటారులో వున్న లెడ్ ఆసిడ్ బాటరీలు చాలా శక్తివంతమైనవి. వీటిని అమర్చుకోవడం కూడా చాలా సులభం.

ఈ మార్పు తేవడానికి, వారు చాలా కష్టపడ్డారు. మంచి పికప్, స్పీడు, పనితనం వుండే మోటారును పెట్టుకోవాలంటే ఖర్చు తక్కువేమీకాదు. కపూర్తాలా మహారాజు వాడిన పాత మోడల్ కారును తీసుకుని తమకనువుగా వుండేలా మార్పులు చేశారు. కొత్త పవర్ కంట్రోల్




పద్ధతిని ప్రవేశపెట్టి 'బ్రేక్' విధానాన్ని మార్చారు. ఈ ప్రయోగానికి 55 వేల రూపాయలు ఖర్చయింది.

పెట్రోలు మీద ఆధారపడకుండా గంటకు 65 మైళ్ళ వేగంతో 250 కిలో మీటర్లు ఏకబిగిన ప్రయాణం చేయవచ్చు. ఖర్చు పెట్రోలుతో పోల్చిచూస్తే చాలా తక్కువ కూడా. పైగా ఇది శబ్దకాలుష్య రహితం. రాత్రి ఎలక్ట్రిక్ ప్లగ్‌లో పెడితే తెల్లవారి మళ్ళీ 250 కిలోమీటర్లు నడి పేందుకు వీలుగా ఛార్జ్ అయిపోతుంది.

ఈ ప్రయోగం విజయవంతమైంది గనక ఇకపైన తక్కువ ఖర్చుతో తేలి కైన బాటరీని తయారుచేసే ప్రయత్నంలో వున్నాడు సింగ్. ఈ విధంగా మామూలు పెట్రోలు కారును ఎలక్ట్రిక్ కారుగా మార్చడానికి 22 వేలు మాత్రమే ఖర్చవు తుంది. ఈ మొత్తం ఎక్కువగా కనబడినా తర్వాత కలిసి వస్తుంది గనుక లాభ సాటే.

అమెరికాలో ఈ పద్ధతి కార్లు ఇపుడి పుడే బాగా అభివృద్ధి చెందుతున్నాయి. మనదేశంలో కూడా అటువంటివి తయారు చేసి కీర్తిని పెంచిన సింగ్‌కి ఇరవై రెండేళ్ళు, సహూంజాకి రెండు తక్కువ ముప్ఫై ఏళ్ళు మాత్రమే.

# మహావృక్షం

ప్రపంచంలో అత్యంత పురాతనమైన చెట్టు చైనాలో 'షాన్‌డోంగ్' అనే ప్రదేశంలో వుంది. ఈ 'జింక్' వృక్షా నికి చెందిన అనేకమైన మొదళ్ళు దాదాపు 800 చదరపు మీటర్ల వైశాల్యాన్ని ఆక్రమించి వున్నాయి. దీన్ని 'కింగ్ ట్రీ' అని పిలుస్తారు. వేసవిలో ఈ చెట్టునీడలో చాలా మంది సేద తీరుతుంటారు. శాఖోప శాఖలుగా విస్తరించి ఏది అసలో, ఏది మొదలో తెలియని ఈ మహావృక్షం తాలూకు కొమ్మలకు ఆధారంగా వుండే టట్టు ప్రభుత్వం కాంక్రీటు స్తంభాలని నిర్మించింది. ఎంతోమంది ఈ చెట్టు



కొమ్మలమీద కూర్చుని చదరంగంలాంటి ఆటలు ఆడుతూ కాలక్షేపం చేస్తుంటారు. ఈ వృక్షంకింద దాని వయసు 3,000 సంవత్సరాలని తెలియజేసే చిన్న చిన్న రాతి కట్టడాలు అమర్చారు. వీటిల్లో ఒకటి క్రీ.పూ. 715లో 'లు' రాజ్యాన్ని పాలిం చిన రాజు, 'జు' రాజ్య పరిపాలకుడు ఈ చెట్టు కింద సమావేశమైన సంఘటన జ్ఞాపకార్థం నిర్మించబడింది. ఈ వృక్షం కొమ్మలు ఆపద సంభవించే సమయాల్లో ఎరుపుగా మారతాయని స్థానికుల నమ్మకం. ఇది ఒక రకమైన 'నట్ ట్రీ'. ఏటా ఇది వెయ్యికిలోల 'నట్స్'ని ఉత్పత్తి చేస్తుంది. ఈ 'నట్స్' చాలా బలవర్థకమైనవేగాక రుచిగా కూడా ఉంటాయట.

# హీరో ముంగలి

అదృష్టదేవత కడగంటి చూపు ఎపుడు ఎవరిమీద పడుతుందో చెప్పలేం. బొంబే దూరదర్శినిలో 'ఫూల్ ఖిలే గుల్షన్ గుల్షన్' కార్యక్రమంలో ఈమధ్య హకీంకిర్మానీ అనే అతన్ని ఇంటర్వ్యూ చేశారు. హకీంఎన్నడూ మొహానికి రంగు పూసుకోలేదు. అయినా ఎంతో మంది టాప్ హీరోలకి హెయిర్ డ్రస్సర్ గా వున్నాడు. అంత మాత్రానికే అతన్ని టి.వి.లో ఇంటర్వ్యూ చేయాలా?



రేపట్నించీ సినీతారలవంటివాళ్ళు, చాకళ్ళు బూట్ పాలిష్ చేసేవాళ్ళు, చౌకీదార్లను కూడా ఇంటర్వ్యూ చేసేలా వున్నారని కొందరు మేధావులు వ్యాఖ్యానించారు కూడా. హకీంని అదృష్టదేవత వరించ బోతున్న సంగతి ముందే తెలిస్తే వాళ్ళా మాట అని వుండేవారు కాదేమో!

తాజ్ సెలూన్లో హెయిర్ డ్రస్సర్ గా పనిచేసే హకీం అమానుష్ సిన్మాకోసం ఉత్తమకుమార్ కి హెయిర్ డ్రెస్ చేశాడు. ఆ చిత్రం బంపర్ హిట్ అయింది. ఉత్తమకుమార్ హఠాన్మరణంతో మధ్యలో ఆగిపోయిన రెండు సినిమాల్లో అతని పాత్ర ధరించడానికి ప్రస్తుతం హకీం కిర్మానీ ఎన్నుకోబడ్డాడు.

సినిమాకి అవసరమైన అన్ని రకాల పరీక్షలు, వివిధ కోణాల్లో తీసిన అనేక ఫొటోలు పరిశీలించిన తర్వాతే హకీంకి ఈ అవకాశం దొరకింది. 125 చిత్రాల్లో ఉత్తమకుమార్ తో కెమెరామన్ గా పనిచేసి నతనే హకీంకి కూడా ఫొటోలు తీసి గ్రీన్ సిగ్నల్ ఇచ్చాడు. బొంబాయిలో పన్నెండు రోజులపాటు షూటింగ్ లో పాల్గొని ఓ చిత్రం పూర్తి చేశాడు.

అతను వేస్తున్న రెండు చిత్రాల్లో ఒక దాంట్లో అతని సరసన షర్మిలా టాగూర్ కథానాయికగా నటిస్తోంది. పటౌడీని, షర్మిలాని విపరీతంగా అభిమానించే హకీం ఆమె పక్కన నటించడం ఏదో కలలో లాగ వుందనీ, ఎంతో థ్రిల్లింగా వుందనీ అంటున్నాడు.

ఇంక కత్తెరని పక్కన పడేసి సినిమాల్లో నటిస్తూ కాలుమీద కాలేసుకు కూర్చోవచ్చుకదా అని మిత్రులంటే— 'అమ్మో అంతకంటే తెలివితక్కువ పని ఇంకోటి లేదు. సినిమాలు, ఛాన్సులు శాశ్వతంకాదు. ఎప్పటికైనా నేను కత్తెర మీదే ఆధారపడతాను. జై కత్తెర' అని సమాధానం చెప్పిన హకీం ప్రస్తుతం ఓ నెల్లాళ్ళు సెలవుమీదున్నాడు. షూటింగ్ లయిపోగానే వచ్చి డ్యూటీలో జాయినయి పోయి కత్తెర చక్ చక్ మనిపిస్తాడు.

# మతిమరుపు

పూర్వం మునుల శాపాల వలన రాజులకి వగైరాలకి హఠాత్తుగా మతిమరపుముంచుకువచ్చేది. దూర్వాసుడు శకుంతలను 'నీ మనోవల్లభుడు నిన్ను మర్చిపోతాడ'ని శపించాడు. ఈ రోజుల్లో ఆ శాపతాపాలు లేవుగాని అనుకోని పరధ్యానాలూ, రాజకీయాల్లో కోరితెచ్చుకొనే మతిమరపులూ మామూలయిపోయాయి. ఆమధ్య ఓ మంత్రివర్యులు



కొన్ని లక్షల ఇన్‌కమ్‌టాక్స్ కట్టడం మర్చిపోయానంటూ మతిమరుపు నడ్డం వేసి ఇన్‌కంటాక్స్‌వారి బారి పడకుండా తప్పించుకున్నాడు. మతిమరుపు ఫ్యాషనవుతున్న ఈ రోజుల్లో తమ జ్ఞాపకశక్తితో అందర్నీ ఆశ్చర్యచకితులని చేసేవాళ్ళు అక్కడక్కడా వున్నారు.

లండన్‌లో లెస్‌లె వెల్చ్ అనే 71 ఏళ్ళ ఆసామి లండన్ రేడియో, టి.వి.లో గత 31 సంవత్సరాలుగా క్రీడల మీద వేసే ప్రశ్నల్లో 95 శాతం వరకూ సరిగ్గా జవాబు చెప్పగలడు.

పీటర్ పెట్రోవిచ్ అనే యుగోస్లావియా నివాసి పది అంకెలుగల సంఖ్యని ఒక నిమిషంలో గుర్తుపెట్టుకోగలడు. మరో జర్మన్ పియానో వాద్యకారుడు పుస్తకం చూడకుండా దాదాపు 22 గీతాలను ఒక్క అపస్వరమూ లేకుండా ఏకబిగిని వాయించగలడు. తూర్పు జర్మనీకి చెందిన హెల్మట్ ఓస్సిగ్ బ్రెస్‌లూ టౌన్ కౌన్సిల్‌లో సమాచార కార్యాలయంలో అధికారిగా పని చేస్తున్నాడు. ఈయన మూలంగా ఆ టౌన్ కౌన్సిల్ వారికి ఫైళ్లు పెట్టాల్సిన శ్రమ, దానికయ్యే ఖర్చు తప్పాయట. ఎందుకంటే ఓస్సిగ్ ఆఫీసుకి సంబంధించిన ఏ విషయమైనా క్షణంలో చెప్పేయగలడట.

మనస్తత్వ శాస్త్రవేత్తలు మతిమరపు ఆసక్తి లేకపోవడం వలన వస్తుందని అంటున్నారు. జ్ఞాపక శక్తిని రెండు రకాలుగా విభజించవచ్చు. ఒకటి ఫొటోగ్రాఫిక్. అంటే ఎదురుగా చిత్రాన్ని చూస్తున్నంత తేలిగ్గా వెంటనే గుర్తుకు రావడం, రెండోది ఓ క్షణం ఆలోచించాక గుర్తుకి రావడం. జ్ఞాపక శక్తిని పెంచుకోవాలనుకుంటే ప్రయత్న పూర్వకంగా విషయాలను గుర్తుంచుకొనే ప్రయత్నం చేయడం, గుర్తుంచుకోదలిచిన విషయాలను మాత్రమే చదవడం, రోజూ క్రమం తప్పకుండా గుర్తుంచుకోడానికి మెదడుకి శిక్షణ ఇవ్వడం చేయాలి. ఈ జాగ్రత్తలు పాటిస్తే ఎవరైనాసరే ప్రపంచ రికార్డ్ స్థాపించవచ్చునంటున్నారు మనస్తత్వ శాస్త్రవేత్తలు.

# రంగు మోజు

ఓ ఆదివారం బిబిసి టెలివిజన్లో 'అమర్ అక్బర్ ఆంథోనీ' సినిమా చూసిన

ఇంగ్లండు ఆడవాళ్ళకి ఆ సినిమాలో నటించిన ముగ్గురు హీరోయిన్లలో చామన ఛాయగా వున్న షబనా ఆజ్మీ నచ్చింది. నిమిషాల మీద షబనాకి పాపులారిటీ పెరిగిపోయింది. రాత్రికి రాత్రే లండన్లోని బ్యూటీ పార్లర్లన్నీ పాలరాతి ఛాయలో మెరిసిపోతున్న యువతులతో క్రిక్కిరిసి పోయాయి. 'షబనా' రంగు తమకూ కావాలన్నదే వారి కోరిక.

ఇంతకు ముందు బ్యూటీ పార్లర్లకిటు వంటి గిరాకీ లేదు. వాళ్ళ రంగుపిచ్చిని గ్రహించిన కొన్ని డిపార్టుమెంటు స్టోర్స్ లలో "తెల్లని మీ చర్మం నలుపు, చాక్లెట్ రంగులలోకి మార్చబడును" అని



పబ్లిసిటీ ప్రారంభించాయి. ఆఫ్రికన్ నలుపు దగ్గర్నించి, ఇండియా, అరేబియా స్త్రీల చాక్‌లెట్ రంగు వరకూ ఏ 'షేడ్' కావాలంటే ఆ షేడ్ వచ్చేలా చేస్తారు. కానీ చిన్న చికిత్సకి కూడా ఒక సిట్టింగ్‌కి 10 పౌండ్ల నుండి 25 పౌండ్ల వరకూ ఖర్చవుతుంది. ఉన్న రంగుమారి కొత్త ఛాయ రావాలంటే రోజు విడిచి రోజు మొత్తం పది సిట్టింగులైనా తీసుకోవాలి. ఎంత ఓపిగ్గా ట్రీట్‌మెంటు తీసుకుంటే అంత సహజమైన ఛాయ వస్తుందన్న మాట.

వారానికి 50 పౌండ్లు వచ్చే మధ్య తరగతి స్త్రీకి ఓ నెల జీతమంతా ఇచ్చి తాత్కాలికంగానైనా ఛాయ మార్చుకోవడం అంటే మాటలు కాదు. కొత్త ఛాయ శాశ్వతంగా వుండాలంటే ఎలక్ట్రానిక్ ట్రీట్‌మెంట్ తీసుకోవాలి. సూర్యస్నానాలు చేయాలి. ఇది చాలా ఖర్చుతో కూడుకున్న పని.

ఈ పిచ్చి ఎంత వరకూ వచ్చిందంటే స్టవ్‌లు, కుంపట్లు, ఎలక్ట్రిక్ ఛాంబర్స్, ఓవెన్స్ దగ్గర గంటల తరబడి కూర్చుని శరీరాన్ని అధిక వేడికి, ఉష్ణోగ్రతకి గురి చేస్తున్నారు. ఏ పత్రిక చూసినా "ఇంట్లో కూర్చుని అతి తక్కువ ఖర్చుతో స్వయంగా సన్‌బాత్ తీసుకోవచ్చుననీ, సహజమైన రంగు మార్పు గ్యారంటీ అని" రకరకాల ప్రకటనలు.

స్పెయిన్, ఇటలీ, యుగోస్లేవియా దేశాల్లో సీసైడ్‌కి వెళ్ళాలనుకునేవారికి 'షన్‌బర్న్' చర్మం ఓ స్టేటస్ సింబల్.

అక్కడ తెల్లరంగువాళ్ళంటే చాలా బీదవాళ్ళని అర్థం. డబ్బున్నవాళ్ళే దాన్ని ఖర్చుపెట్టి రంగు మార్చుకోగలరని, లేనివాళ్లు అలా పాలిపోయిన చర్మాన్ని వుంచుకుంటారన్న హీనభావం కూడా లేకపోలేదు.

ఇండియాలో ఎబార్షన్ చేయించుకున్న కన్నెల పేర్లు బైటికి రానీయనంత రహస్యంగా అక్కడి బ్యూటీ క్లినిక్కుల వారు తమ దగ్గర ట్రీట్‌మెంటు తీసుకుని రంగు మార్చుకున్న వారి పేర్లను అతి రహస్యంగా వుంచుతారట. ఇకముందు శ్వేత జాతీయులను చూసి నల్లవారు అసూయపడనవసరం లేదన్న మాట. గుడ్.

# కేశవర్ధని




రోడ్డుమీద ఎవరైనా అమ్మాయి నడిచి వెళ్తుంటే ఒత్తైన జుట్టు పెద్ద జడ కనబడగానే ఎంతబావుందో, ఎంత పెద్ద జుట్టో అనుకోకుండా వుండలేం. కవులు జడని నాగుపాముతో పోల్చినా అక్కడక్కడా కొండచిలువ జడలు కూడా కనబడుతూనే వుంటాయి. అల్లిన జడని విరబోస్తే ఇంకా పొడుగ్గా కనబడుతుంది. తైల సంస్కారం లేక జడలు కట్టేసిన జుట్టు తెగ బారెడున్నా అందం చందం వుండదు రికార్డు స్థాపించుకోడానికి తప్ప.

ఉజ్జయినికి చెందిన 64 ఏళ్ళ మాతా జగదాంబిక అనే సన్యాసిని కంటే ఆమె జుట్టు పొడుగే ఎక్కువ. ఆమె నాలు గడుగుల పదకొండు అంగుళాలుంటే ఆమె జుట్టు ఆరడుగుల 6 అంగుళాలు.

1949లో తిరు దదుతూరై సంస్థానానికి చెందిన స్వామి పండర సన్నధి 'గిన్నిస్ బుక్'లో స్థాపించిన 26 అడుగుల జుట్టు రికార్డును ఈమె అధిగమించలేకపోయినా ప్రజలకిది విడ్డూరంగానే వుంది. జుట్టింత ఒత్తుగా, అంత పొడుగ్గా వున్నా పేలు, చుండ్రు జగదాంబిక దరిదాపులకు రాకపోవడం వింతే. ఈమె రోజూ యోగాభ్యాసం చేసి, మామూలు ఆహారం తీసుకుంటుంది. ఎప్పుడైనా ముక్కుగుండా పాలని త్రాగడం ఆమె అలవాటు.

ఈమెది చిన్నతనం నుంచీ మంచి తల కట్టు. పుట్టు వెంట్రుకలు కూడా తీయించలేదు. సన్యాసం పుచ్చుకునేనాటికామె వయసు తొమ్మిది సంవత్సరాలు మాత్రమే. తర్వాత 25 సంవత్సరాల పాటు గంగోత్రి వద్ద గడిపి ప్రస్తుతం 1955 నుండీ ఉజ్జయినిలో తన గురువు గారి ఆశ్రమంలో గడుపుతోంది. ఆమె జుట్టును చూడ్డంకోసం రోజూ ఎంతో మంది ప్రజలు వచ్చిపోతున్నారు.

# దొరికితే దొంగలు

లండన్‌లోని ఓ ఆరుగురు సాహసవంతులు వరుసగా బ్యాంకులన్నింటినీ కొల్లకొట్టి వచ్చిన సొమ్ముని సమంగా పంచుకుందామని పథకం వేసి రంగంలోకి దిగారు.

కానీ తమ ప్రతి చర్యని టి.వి. కెమెరాలు రికార్డు చేసున్నాయనీ, 30 మంది డిటెక్టివ్‌లు, పోలీసు ఆఫీసర్ల కళ్ళు, రైఫిళ్లు తమ వెన్నంటి వున్నాయనీ గ్రహించలేకపోయారు. రెండు వారాల

ముందునుంచే నగరంలో పెద్ద బ్యాంక్ దోపిడీ జరగబోతుందన్నవార్త పోలీసు డిటెక్టివ్‌లకు తెలిసింది అప్పట్నించీ వాళ్ళు అప్రమత్తులై నేర్పుగా దొంగల్ని పట్టుకోడానికి సర్వసన్నద్ధులై వున్నారు.




దొంగలు అనుకున్న ప్రకారం బ్యాంకుల్ని దోచుకుని డబ్బంతా పెద్ద పెద్ద పెట్టెల్లో భద్రపరచి ఎవరికీ అనుమానం రాకుండా ఓ పాత కారులో వేసుకుని వెళ్తుండగా రోడ్డుపక్క పొదల్లో నక్కివున్న పోలీసులు అటకాయించారు. వారు ఆయుధాలు బైటికితీసే అవకాశం ఇవ్వకుండా క్షణాల మీద ఆరుగురినీ పట్టేశారు. కానీ పెట్టెల్లో ఎంత డబ్బు వుందో ప్రజలకు చెప్పడానికి ఆఫీసర్లు నిరాకరించారు. ఈ తతంగమంతా రికార్డ్ చేసిన చిత్రాన్ని ప్రజలకి టి.వి.లో చూపించడం వల్ల ఎంతో మేలు జరుగుతుందనీ, ఇకముందు దొంగతనం చేసేవారు భయపడతారనీ, ఒకవేళ దోపిడీ జరిగినా ఎంత బందోబస్తుగా నేరస్థుల్ని పట్టాలో తెలుస్తుందనీ డిటెక్టివ్ పోలీసాఫీసర్లు అన్నారు. మరి అదంతా చూసి ఇంకా జాగ్రత్తగా దోచుకో ప్రయత్నించవచ్చు గదా చోరాగ్రేసరులు.

# అశ్వఘోష

రేస్‌కోర్స్ కోలాహలంగా ఉంది. గుర్రాలు పరుగెడుతోంటే చూస్తున్న వాళ్ళు ఆవేశంగా ఊగిపోతూ కేకలు వేస్తున్నారు. చూస్తుండగానే పందాలు ముగిశాయి. గెలుపొందిన మూడు గుర్రాలను వరస ప్రకారం ప్రకటించారు. మరో పది నిముషాల్లో అక్కడి హడావిడి తగ్గిపోయి ఎవరి దారిన వారెళ్ళిపోయారు. దీనితో నిర్వాహకులు కూడా తట్టాబుట్ట సర్దుకుని హాయిగా విశ్రాంతిగా లాభాలు లెక్క పెట్టుకుంటారు అని చాలా మంది అభిప్రాయం. కేవలం ఈ రెండు నిమిషాల కోసం రేస్‌క్లబ్ అధికారులు చాలా ఏర్పాట్లు చూసుకోవాల్సి ఉంటుంది.




పందెంలో పాల్గొనే ప్రతి గుర్రానికీ మూత్ర పరీక్ష చేస్తారు. పందాలు జరిగే ముందు రోజున నిర్వాహకులు గుర్రం యజమానికి ఓ సీసా ఇస్తారు. మర్నాడు ఉదయం 8గంటల ప్రాంతంలో గుర్రాల యజమానులు ఆ సీసాలో గుర్రం మూత్రం సేకరించి నిర్వాహకులకి ఇవ్వాలి. కొకైన్ లాంటి ఉత్తేజాన్ని కలిగించే మందులు గుర్రాలకిస్తే ఈ మూత్ర పరీక్షలో ఆ విషయం తెలిసిపోతుంది. ఈ

సందర్భంలో గుర్రాలకి ఉత్తేజకర పదార్థాలిచ్చినట్లు తేలితే ఆ గుర్రం తాలూకు శిక్షకుడి మీద చర్య తీసికొని ఆ గుర్రం గుర్రపు పందాలలో పాల్గొనే అర్హతను రద్దు చేస్తారు. పందెంలో పాల్గొనే గుర్రాలన్నింటికీ యూరిన్‌లో ఏ లోపమూ లేదన్న సర్టిఫికెట్ ఉండి తీరాలి.

అంతేగాదు సరిగా-పందేలు ప్రారంభమయే ఓ గంటముందు ప్రతి గుర్రం యొక్క చొంగను పరీక్షిస్తారు. ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలు సంపాదించిన గుర్రాలకయితే పోటీ అనంతరం కూడా మూత్రం, చొంగను క్షుణ్ణంగా పరీక్షిస్తారు.

ఈ పరీక్షలో ఏమన్నా అనుమానాస్పదంగా అన్పిస్తే ఆ గుర్రాల గెలుపును రద్దుచేస్తారు. ఇలాంటి పరీక్షా సౌకర్యాలు గల క్లినిక్ ఒక్క గిండీలోనే వుంది. హైదరాబాద్, బొంబాయి, పూనేలలో పందాలు అయిపోగానే యూరిన్ శాంపిల్స్‌ను మద్రాస్ రేస్‌క్లబ్‌కి విమానంలో పంపిస్తారు. ఇక గాయపడి పందాలలో పాల్గోలేని గుర్రాలను కాల్చి చంపేస్తారని ఓ అనుమానం ఉంది. ఎముకలు విరిగినా, ఎనీమియా, ఇతర చిన్న చిన్న వ్యాధులకు సాధ్యమయినంత వరకూ చికిత్స చేయిస్తారు. మద్రాసు రేస్ క్లబ్‌లో గుర్రాల కోసం ప్రత్యేకంగా ఓ ఈతకొలను వుంది. గుర్రం మూడు నిమిషాలు ఈత కొడితే ఒకటిన్నర మైలు పరుగెత్తినంత వ్యాయామం లభిస్తుంది. ఈ గుర్రాల ఆస్పత్రి 1.75 ఎకరాల స్థలంలో ఆరు లక్షల వ్యయంతో నిర్మించబడింది. దీనిలో గుర్రాలకోసం ప్రత్యేకంగా ఆపరేషన్ థియేటర్, ఎక్స్‌రే గది లాంటి ప్రత్యేక సౌకర్యాలు కూడా నెలకొల్పబడ్డాయి.

# ఉట్టికెగరలేక

"ఒలింపిక్స్ వంటి అంతర్జాతీయ క్రీడా పోటీల్లో భారతదేశం అపజయాన్ని ఎందుకు ఎదుర్కొంటోంది?" అఖిలభారత క్రీడా సంస్థ అధికారులు తమకు తామే ఈ ప్రశ్న వేసుకుని సమాధానం కోసం సర్వే ప్రారంభించారు. ఆరవ పంచవర్ష ప్రణాళికలో ఫిజికల్ ఎడ్యుకేషన్‌కి, క్రీడలకి దేశం మొత్తానికి ఏడున్నర కోట్ల రూపాయలు కేటాయించారు. ఇతర దేశాల్లో జరిగే పోటీల్లో పాల్గొనే క్రీడాకారుల ఖర్చుల నిమిత్తం అదనంగా మరో రెండు కోట్లు కేటాయించారు. అదీ ఇదీ కలపగా ప్రతి




భారతీయ క్రీడాకారునికీ పెట్టే ఖర్చు సంవత్సరానికి నాలుగు పైసలకి మించడం లేదు. ప్రపంచ దేశాలు క్రీడాకారుల కోసం చేసే ఖర్చులోకెల్లా ఇదే హీనమైనదన్నమాట.

ఇతరదేశాల్లో క్రీడలకయ్యే వ్యయాన్ని ప్రభుత్వేతర సంస్థలు ధనరూపంలోను, అదనపు సౌకర్యాల ఏర్పాటులకునూ భరిస్తారు. స్థానిక సంస్థలు కూడా ఈ

విషయంలో ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి. కానీ మన స్వతంత్రభారతంలో ఈ బాధ్యత కేవలం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకే పరిమితం.

భారతదేశం తర్వాత స్వతంత్రాన్ని సాధించిన దేశాలు, జనాభా తక్కువున్న దేశాలు కూడా అంతర్జాతీయ క్రీడల పోటీల్లో విజయ పతాకాలెగరేస్తున్నాయి. దానికి కారణం మనదేశంలోలాగ వాళ్లు ప్రతి ఆటనీ పట్టుకు కూర్చోరు. ప్రత్యేకించి కొన్ని ఆటల్ని ఎన్నుకుని వాటి మీదే దృష్టి కేంద్రీకరించి మంచి ఫలితాలను సాధించ గలుగుతారు. మన క్రీడాకారులు, ప్రభుత్వం ప్రతిదాంట్లోనూ నిష్ణాతులు కావడానికి ప్రయత్నించడంతో మందెక్కువ మజ్జిగ పల్చనలాగ తయారయింది పరిస్థితి.

అదీగాక ఆధునిక వస్తువుల కొరత, పురాతన పద్ధతుల్లో ఇండోర్, ఔట్ డోర్ స్టేడియంల నిర్మాణం మొదలైనవి సమస్యలుగా వున్నాయి. పాఠశాలలు, కళాశాలలు, ఆఖరికి విశ్వవిద్యాలయాల్లో వుండే క్రీడా సౌకర్యాలు చాలా తక్కువ.

భారత ఒలింపిక్ సంస్థ ఒక్కటేగాక ఇతర సంస్థలు, వివిధ ఆటలకు సంబంధించిన ఫెడరేషన్లు ఆర్గనైజేషన్ల లోపంతోను, రాజకీయాలతోను కలుషితమై పోయాయి. స్వాతంత్ర్యం వచ్చి ముఫై మూడేళ్లు నిండినాగాని చాలా క్రీడలు జిల్లాస్థాయికి కూడా చేరలేదు.

ఇంక ఒలింపిక్స్‌లో సాధించమంటే ఎలా ? ఉట్టికెగరలేనమ్మ స్వర్గానికి ఎగురుతానందన్న సామెత పూరికే రాలేదనిపిస్తుంది ఇది చూస్తుంటే.

# టగ్ ఆఫ్ వార్

ఇప్పుడు స్కూలు పిల్లలకి కాలక్షేపంగా వున్న 'టగ్ ఆఫ్ వార్' ఆట ఒకప్పుడు అథ్లెటిక్స్‌లో భాగంగా వుండేది. ఒక తాడు రెండు చివరలను రెండు జట్లు పట్టుకొని లాగుతూ బలాబలాలు ప్రదర్శించుకొనే ఈ ఆట ముందుగా చైనా లేదా ఈజిప్ట్ దేశాల్లో పుట్టిందని భావిస్తున్నారు. 19వ శతాబ్దంలో ఈ ఆటను ఇంగ్లండ్‌లో ఎక్కువగా ఆడేవారు. 1900 సంవత్సరంలో పారిస్‌లో జరిగిన ఒలింపిక్స్‌లో ఈ ఆట చోటు చేసుకుంది. దీనిలో అమెరికా బంగారు పతకం సాధించిందని కొందరంటే, కాదు స్వీడన్ లేదా డెన్మార్క్‌లకి బంగారు పతకం లభించిందని మరి కొందరి వాదన: ఈ ఆటను చివరిసారిగా 1920లో అన్వర్స్‌లో జరిగిన ఒలింపిక్స్‌లో ఆడారు. తర్వాత దీన్ని ఒలింపిక్స్ నుంచి తొలగించారు. ఆక్స్‌ఫర్డ్‌లో 'అంతర్జాతీయ టగ్ ఆఫ్ వార్ ఫెడరేషన్' వారి ప్రధాన కార్యాలయం కూడా వుంది. 1965 నుంచి యూరప్‌లో 'టగ్ ఆఫ్ వార్' ఆటలో ఛాంపియన్‌షిప్‌లు ఇవ్వడం ప్రారంభమయింది. ఈ ఆటకి కొన్ని నియమాలు కూడా వున్నాయి. ఒక్కో టీములో ఎనిమిది మంది సభ్యులుండాలి. ఒక్కో టీములోని మొత్తం సభ్యుల బరువు 559-711 కిలో గ్రాముల మధ్య వుండాలి. ఆటలో ఉపయోగించే తాడు 35 అడుగుల పొడవు, నాలుగు లేక ఐదు అంగుళాల లావు వుండాలి.

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.




"ప్రియ దృష్టిలో పడాలంటే ఏ మామిడికాయ అయినా నిగనిగలాడుతూ నాలా కండ కలిగి ఉండాలి. అప్పుడే మేలయిన మసాలాలు, స్వచ్ఛమయిన నూనెల పొందు లభిస్తుంది. చక్కని ఆరోగ్య సూత్రాలతో, అధునాతన ఫాక్టరీలో రుచులెన్నో నింపుకొని మీ విందుకు వస్తాను. అందమయిన సీసాల్లో కళకళ లాడ్తూ మిమ్మల్ని ఆకర్షిస్తాను.

అదుగో.... అప్పుడే మీ నోరూరుతోంది.
మరింక మాటలెందుకు ?"

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ "ప్రియ" పచ్చళ్లు 300, 650 గ్రాముల సీసాల్లో లభిస్తాయి

మామిడికాయ • నిమ్మకాయ • టొమాటో • అల్లం • గోంగూర

**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్




Marketed by:
MARGADARSI MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound, Hyderabad 500 004

**ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ**